ఓ చిన్న సినిమా సూపర్ డూపర్ హిట్టయితే అందరి కళ్ళూ ఒక్కసారి ఆ సినిమా హీరో, హీరోయిన్ల వైపే తిరుగుతాయి. మరీ ముఖ్యంగా హీరోయిన్‌కి అవకాశాలు వెల్లువెత్తుతాయి. ఇది సహజంగా జరిగే ప్రక్రియ. కానీ హెబ్బా పటేల్ విషయంలో మాత్రం అలా జరగలేదు. హెబ్బా నటించిన 'కుమారి 21 ఎఫ్' చిన్న సినిమాల్లో సూపర్ డూపర్ హిట్. ఆ సినిమాతో హెబ్బా స్థాయి ఓ రేంజ్‌లో పెరుగుతుందని అనుకున్నారు. అందరూ ఊహించిన విధంగా ఆమె కెరీర్ స్పీడందుకోలేదు. ఇప్పటికీ అరకొరా సినిమాలతోనే సరిపెట్టుకోవలసి వస్తోంది. దానికి కారణాలేమిటో ఆమె మాటల్లోనే..

# అలా చూడటం లేదు

**-హెబ్బా పటేల్**

**'ఈడోరకం ఆడోరకం' సక్సెస్ ఎంజాయ్ చేస్తున్నట్టున్నారు?**

సినిమా కామెడీగా చాలా బాగుందని చూసిన వాళ్ళు చెబుతుంటే చాలా ఆనందమనిపిస్తోంది.

**'కుమారి 21 ఎఫ్' సమయంలో కూడా ఇలాంటి ప్రశంసలే వచ్చినట్టున్నాయి?**

సినిమా బాగుంటే తప్పకుండా ఆదరిస్తారు. ఈ విషయం ఇప్పటికే చాలా సార్లు రుజువైంది. 'కుమారి 21 ఎఫ్' ఎంత పెద్ద హిట్టో 'ఈడోరకం ఆడోరకం' కూడా అంత పెద్ద హిట్.

**రాజ్‌తరుణ్‌తో రెండోసారి చేయడం ఎలా అనిపించింది?**

తను చాలా ఎనర్జెటిక్‌గా ఉంటాడు. తనతో చేయడం చాలా కంఫర్టబుల్‌గా ఉంటుంది. 'కుమారి' సినిమా సమయంలోనే ఆ విషయం నాకు అర్థమైపోయింది. మా కెమిస్ట్రీ బాగా వర్కవుట్ అయింది.

**సినిమాలు సక్సెస్ అయినా అనుకున్న గుర్తింపు రాకపోవడానికి కారణం?**

ఈ విషయం ఒక్కటే నాకు ఎప్పటికీ అర్థం కాని పజిల్! నా సినిమాలేవీ డిజాస్టర్ కావు. బాగానే ఆడతాయి. ఎక్స్‌పోజింగ్‌కి నేనేమీ వ్యతిరేకిని కాను. ఎంత బోల్డ్‌గా కనిపించమన్నా అభ్యంతరం పెట్టను. కానీ నన్ను ఇంకా చిన్నపిల్లగానే చూస్తున్నారు తప్ప నాలోని గ్లామర్‌ని చూడడం లేదు. నన్ను హాట్ అండ్ సెక్సీ అని అంటేనే చాలా ఇష్టం. కానీ నా మొహం ఇంకా చిన్నపిల్లలాగే ఉంటుందని అంటూంటారు. ఇక నటన పరంగా కూడా మంచి మార్కులే పడుతున్నాయి. 'అన్నీ ఉన్నా అల్లుడి నోట్లో శని' అన్న చందంగా తయారైంది నా పరిస్థితి.

**అవకాశాలు రాకపోవడానికి కుటుంబ నేపథ్యమే కారణమంటారా?**

అలాంటిది ఉండదనే నా అభిప్రాయం. మా కుటుంబంలో ఎవరూ ఈ రంగంలో లేరన్నది నిజమే! అయితే సినిమా బ్యాక్‌గ్రౌండ్ ఉన్న వారందరూ సక్సెస్ కావడం లేదు కదా! అవకాశాలు రావడానికి బ్యాక్‌గ్రౌండ్ కొంత వరకే ఉపయోగపడుతుంది, అంతే. టాలెంట్ లేకపోతే ఎన్ని రికమెండేషన్లు ఉన్నా అవకాశాలు రావు. ఇదే నేను గమనించిన విషయం.

**సినిమాల్లోకి రావడం మీ పేరెంట్స్‌కి ఇష్టం లేదట కదా? ఇప్పటికీ ఆ అయిష్టం కొనసాగుతోందా?**

చదువు మధ్యలో ఆపి సినిమాలు చేస్తానంటే వద్దని అన్నారు. ఈ రంగం గురించి వారికి పూర్తిగా తెలియదు. రిజల్ట్ అటూ ఇటూగా వస్తే ఇబ్బంది అవుతుంది. చేతిలో గ్రాడ్యుయేషన్ సర్టిఫికెట్ ఉంటే, ఇక్కడ సక్సెస్ కాలేకపోతే మరో రంగంలో సెటిల్ కావచ్చన్నది వారి ఉద్దేశం. అందుకే నా మొదటి సినిమా 'అలా ఎలా'లో అవకాశం వచ్చినప్పుడు కొంత అయిష్టత కనబరిచారు. ఇప్పుడు నా సినిమాల సక్సెస్ చూసి నా కెరీర్ మీద వారిలో ఉన్న భయాలన్నీ పోయాయి.

**'కుమారి 21ఎఫ్'ను కన్నడంలో తీయబోతున్నారట కదా? అందులోనూ మీరే లీడ్ రోల్ చేస్తున్నారా?**



ఈ సినిమాను కన్నడంలో చేయబోతున్నారన్న విషయం నాకూ తెలిసింది. అయితే కన్నడంలో చేయమని ఇంత వరకూ నన్ను ఎవరూ అప్రోచ్ కాలేదు. అడిగితే తప్పకుండా చేస్తాను. కన్నడంలో నా మొదటి సినిమా ఫ్లాప్ కావడంతో అక్కడ నాకు హిట్ అన్నది లేదు. ఈ సినిమాలో నాకు అవకాశం వస్తే కన్నడంలో కూడా ఓ హిట్‌ను తప్పకుండా నా ఖాతాలో వేసుకుంటాను.

**తెలుగులో చేస్తున్న సినిమాలు?**

శర్వానంద్ హీరోగా ఒక సినిమా అంగీకరించాను. మరో రెండు కథలు వినడం జరిగింది. వాటికి ఇంకా ఓకే చెప్పలేదు.

-కె.రామకృష్ణ

## సరదాగా

### అమ్మో! పులి

రఘు, రవి ఇద్దరూ తిరుమల ఘాట్ రోడ్డు మీద నడిచి వెళ్తుంటే ఒక పులి ఎదురొచ్చింది. ఇద్దరూ వణికిపోయారు. "భయపడకు రఘు, సడన్‌గా పులి ఎదురొచ్చినప్పుడు చేతులు రెండు పక్కలకు జాపి దిష్టిబొమ్మలా కదలకుండా నిలుచుంటే పులి ఏమీ చేయదని మొన్న ఒక పత్రికలో చదివాను" ధైర్యం చెప్పాడు రవి.

"నువ్వు చదివావు సరే, మరి ఆ పులి ఆ పత్రిక చదివిందా అని" వణుకుతూ అన్నాడు రఘు.

### ఒక ప్రశ్న?

బొమ్మను పూర్తిగా పరిశీలించండి. విఘ్నేష్ చెట్టు కొమ్మకు వేలాడుతున్నాడు. చెట్టు సగం నరికి ఉంది. ఎటు చూసినా ఏదో ఒక రూపంలో ఆపద పొంచి ఉంది. కట్టెల కోసం వచ్చిన విఘ్నేష్ అలా ఇరుక్కుపోయాడు మరి. సింహం రావడం చూసి గొడ్డలిని అక్కడే వదిలి చెట్టెక్కేశాడు. తీరా చెట్టెక్కేశాక, నేల మీద చూస్తే సింహం, చెట్టు మీద పాము, నీటిలో మొసళ్ళు. ఒకవేళ విఘ్నేష్ చెట్టుకొమ్మ నుంచి కుడి వైపుకు కదిలితే పాము కాటు వేయడానికి రెడీగా ఉంది. అటు ఊగి ఇటు ఊగి నేలమీదికి దూకుదామంటే ఆకలితో ఉన్న సింహం ఆవురావురుమంటూ ఎదురుచూస్తోంది. పోనీ నీటిలోకి దూకి ఈదుకుంటూ వెళదామంటే రెండు మొసళ్ళు ఎగిరెగిరి పడుతున్నాయి. అదీకాక సగం నరికి ఉన్న చెట్టు ఎప్పుడెప్పుడు విరిగిపడుతుందా? ఎప్పుడెప్పుడు ఎర నోట్లో పడుతుందా? అని ఎదురుచూస్తున్నాయి. మరి ఇన్ని ఆపదల మధ్య నుంచి విఘ్నేష్ ఎలా తప్పించుకున్నాడు? మీ దగ్గర ఏమైనా ప్లానుంటే, విఘ్నేష్ ఎలా తప్పించుకోవాలో చెప్పండి.

### సమాధానం

ఇలాంటి సాహసాలు కలల్లోనే సాధ్యం అనుకోవచ్చు కొంతమంది. మరికొంతమంది దేవుడి మీద భారం వేసేస్తే సరి అంటారు. ఇంకొంత మంది ప్లానులు రెడీ చేస్తారు. మరి అలాంటి ప్లానుల్లో ఒకటి...

మెల్లగా ముందుకు వస్తున్న సర్పాన్ని ఒక చేత్తో పట్టుకుని లాగి, సింహంపైకి విసిరేయాలి. పాము మీదపడేసరికి కొన్ని క్షణాలైనా దాన్ని వదిలించుకునేందుకు ప్రయత్నిస్తుంది సింహం. ఆ కొద్ది క్షణాల్లో విఘ్నేష్ నేల మీదకి దూకి అక్కడున్న గొడ్డలి తీసుకుని సింహాన్ని చంపేస్తే సరి. మరి మొసళ్ళు నేలమీదకి వస్తాయి కదా! అనుకుంటున్నారేమో! చనిపోయిన సింహాన్ని ఆ మొసళ్ళకు ఆహారంగా వేస్తే, ఇక వాటికి విఘ్నేష్‌తో పనేముంటుంది?

# Jayadev

# అడపా దడపా నవ్వేద్దాం

మన కాలనీలో పిచ్చి మొక్కలు దూరాయంటుండే... సెక్రటరీ చెప్పాడు..!

సెక్రటరీ ఎక్కడో? నాక్కనపడ్డాడే!!

వాడినా!

తను వూరెళ్తోంది... ఆరిగాబట్టే దాకా... పెంపుడు కుక్కనీ... పూల కుండీలనీ మనకప్పజెప్పడానికొస్తోంది! నేనింట్లో లేనని చెప్పండి!!

కింద లాన్‌లో నడిపించబరాదుటండీ.. నాకే అర్థం అవట్లేదిగా!



8

## వెరైటీ ఫెస్టివల్స్!

**కొన్ని పండుగల గురించి చెప్పుకుంటే ఇలా కూడా జరుపుకుంటారా? అని ఆశ్చర్యపోవాల్సిందే! చాలా దేశాల్లో ఎన్నో క్రేజీ పండుగలు చేసుకుంటారు. ఇలాంటి పండుగలు ఆశ్చర్యంతో పాటు ఒళ్లు గగుర్పాటు కలిగించే విధంగా కూడా ఉంటాయి!**

**54**

### హాయి హాయి కునుకు! కంటినిండ కునుకు

మీ విలువైన నిద్రని కోల్పోయారా? మీ పని పద్ధతులకు అనుగుణంగా మీ నిద్ర సమయాల్ని ప్లాన్ చేసుకోవాలనుకుంటున్నారా? అయితే ఇది చదివేసేయండి మరి!

**72**

### ఇంటర్వ్యూ

ఎన్.టి. రామారావుగారి తర్వాత అంతటి గొప్ప అదృష్టం తననే వరించిందంటున్న నటుడు విజయచందర్ ఇంటర్వ్యూ ఈ వారం

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



*ముఖచిత్రం:* రకుల్ ప్రీత్ సింగ్
ఫోటో: గోపీకృష్ణ


**రచనలు, కథలు పంపవలసిన చిరునామా**

**నవ్య వీక్లీ,** ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్-33. **email: navyaweekly@andhrajyothy.com**





"డాక్టర్‌గారూ! డాక్టర్‌గారూ! మీరు అర్జంట్‌గా మా ఇంటికి రావాలి."

"ఎందుకు? ఏమైంది?"

"మా ఇంటి తాళం రావట్లేదు సార్."

"అది నా పని కాదయ్యా"

"మీ పనేసార్! మా మూడేళ్ళ వెధవ, ఇంటి తాళం మింగేశాడు."

•••

అతను ఓ బడా వ్యాపారవేత్త. కొడుక్కి వ్యాపార రహస్యాలు చెబుతున్నాడు.

"వ్యాపారంలో రాణించాలంటే రెండు విషయాలు తెలుసుకోవాలా."

"ఏంటి డాడీ అవి?"

"ఒకటి: మాట నిలబెట్టుకోవడం.

రెండు: వివేకంగా ప్రవర్తించడం.

"మాట నిలబెట్టుకోవడం అంటే...?"

"అంటే...ఎటువంటి పరిస్థితుల్లోనూ ఇచ్చిన మాట తప్పకూడదు."

"మరి వివేకంగా ప్రవర్తించడం అంటే?"

"అంటే...అసలు మాటే ఇవ్వకపోవడం."

•••

"అదేం కుక్కండీ బాబూ, అలా ఉంది."

"బలేవారే! అది పోలీసు కుక్క."

"పోలీసుకుక్కా? మరి అలా కనిపించట్లేదే?"

"కనిపించదు. ఎందుకలా కనిపించదంటే...అది 'సీక్రెట్ సర్వీసు'లో ఉంది కాబట్టి."

•••

**పంటిడాక్టర్:** ఎందుకయ్యా అంతగట్టిగా అరుస్తావు, నేనింకా నీ పన్ను పీకందే!"

"అవున్సార్! కాకపోతే నా కాలు తొక్కేస్తున్నారు."

•••

"డాక్టర్! రోజూ నాకు ఓ భయంకరమైన కల వస్తోంది."

"ఏంటో అది?"

"ఒక దయ్యం నన్ను తరుముతూ ఉంటుంది. నేను దానికి అందక పరిగెడుతూ ఉంటాను."

"అవునా! అలాంటి కలలు రాకూడదండీ! అది చాలా ప్రమాదం. మీరు ట్రీట్‌మెంట్ తీసుకోవాల్సిందే, తప్పదు."

"ఖర్చు ఎంతవుతుందో?"

"ఎంతవుతుంది? మహా అయితే ఓ లక్షరూపాయలు అవుతుంది."

"లక్షరూపాయలే! నావల్ల కాదుగాని, నేను పరిగెత్తడం మానేసి, దయ్యంతో ఫ్రెండ్‌షిప్ చేసుకుంటాలెండి. వస్తా!"

-వైనతేయ

www.navyaweekly.com

నవ్య

సంపుటి: 13 సంచిక: 9

4-5-2016

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



## మొదటి పేజి

# నాన్నకు ఓ ముద్దు

అమ్మని ముద్దుపెట్టుకోవడం పెద్ద కష్టమేమీ కాదు. అడిగితే ముద్దు పెట్టుకోమంటుందమ్మ. బుగ్గను అందించి మరీ మురిసిపోతుంది. అదే నాన్నకి ముద్దు పెట్టాలంటే? మహా కష్టం. గాండ్రిస్తున్న పులి బుగ్గ మీద ముద్దుపెట్టడం, గర్జిస్తున్న సింహాన్ని గట్టిగా కౌగిలించుకుని చుంబించడం. అది జరగని పని. అయినా దానిని సాధించేందుకు అతను చాలా ఏళ్ళుగా ప్రయత్నిస్తూనే ఉన్నాడు.

ఏడేళ్ళ వయసప్పుడు ఒకానొక సినిమాలో తండ్రిని గాఢంగా ముద్దుపెట్టుకున్న అయిదేళ్ళ కుర్రాణ్ణి చూశాడతను. ముద్దు పెడుతూ కుర్రాడు పరవశించిపోవడాన్నీ, తండ్రి తన్మయత్వం చెందడాన్నీ కళ్ళల్లో కొలువుదీర్చుకున్నాడు. నాన్నని గట్టిగా ముద్దు పెట్టుకోవాలి అన్నది అతని కోరికైందప్పుడు. నాన్నని ముద్దుపెట్టుకోవాలే అమ్మా అడిగాడు ఓసారి తల్లిని. దానికి నా పర్మిషన్ ఎందుకు? వెళ్ళి ముద్దు పెట్టుకో అన్నది తల్లి. ఇంకేం అనుకున్నాడతను. పరుగున వసారాలోకి వచ్చి చూశాడు. వాలుకుర్చీలో నాన్న నిద్రపోతూ కనిపించాడు. చదువుతూ నిద్రపోయినట్టున్నాడు. పుస్తకం నాన్న గుండెల మీద ఉంది. చేతులు ఒడిలో ఉన్నాయి. అదే అవకాశంగా అడుగులో అడుగు వేసి, మెల్లగా వచ్చాడతను. మూతిని ముందుకు జాచి నాన్న బుగ్గన పెదవులు ఆనించబోయాడు. పొలమారిందేమో! హఠాత్తుగా మెలకువ వచ్చింది నాన్నకి. దగ్గసాగాడు. నీళ్ళు అని అరిచాడు. పరుగున అమ్మ తెచ్చి ఇచ్చింది. తాగి తెప్పరిల్లాడు. అయినా నాన్న కళ్ళు ఎర్రగా చింతనిప్పుల్లా ఉన్నాయి. ఇంకా ఆయాసపడుతూనే ఉన్నాడు. ఆ ఆయాసాన్ని తగ్గించేందుకు నాన్న గుండెల మీద చేత్తో రాస్తూ కూర్చుంది అమ్మ. అంతా గమనిస్తూ భయం భయంగా నిల్చున్నాడతను. ఏం కావాలా? ఏం చూస్తున్నావిక్కడ అడిగాడు నాన్న. సమాధానం లేదు. చెప్పలేకపోయాడతను. వెళ్ళు! వెళ్ళి చదువుకో అన్నాడు నాన్న. వెనక్కి వచ్చేశాడు. తర్వాత ముద్దు మాటే మరచిపోయాడతను.



సిక్స్‌క్లాసుకి వచ్చాడు. కావాల్సిన కొత్తపుస్తకాలన్నీ నాన్న దగ్గరుండి కొనిపెట్టాడు. హనుమంతుడు బొమ్మలకథల పుస్తకం కావాలంటే దానినీ కొనిపెట్టాడు. రంగు రంగుల హనుమంతుని బొమ్మలు చూస్తూ ఆ రాత్రి నాన్నకి ముద్దు పెడితే బాగుణ్ణన్నది గుర్తు చేసుకున్నాడతను. నాన్నగదికి వెళ్ళాడు. చూస్తే ఏడుస్తూ కనిపించాడు నాన్న. ఊరుకోండి! మరీ చిన్నపిల్లాడిలా ఏంటిది? అబ్బాయిని డాక్టర్ ఎందుకు చదివించలేరు? చదివిస్తారు. మీరే చదివిస్తారు. ఆరోతరగతి పుస్తకాలే కొనిపెట్టలేని వాణ్ణి అబ్బాయిని డాక్టర్‌ని చెయ్యగలనా అని అధైర్యపడితే ఎలా? చేస్తారు. మీరే చేస్తారంటూ అమ్మ ధైర్యం చెబుతోంది నాన్నకి. వేళకాని వేళ కోరరాని కోరిక నాన్నని ముద్దుపెట్టుకోవడం అనిపించిందప్పుడు. వెనక్కి వచ్చేశాడతను.

ఇంటర్మీడియట్ ఫస్ట్‌క్లాసులో పాసయ్యాడు. ఎంసెట్ రాసి, ఫస్ట్‌ర్యాంకు సాధించాడు. మెడికల్ కాలేజీలో చేరాడు. నాన్న చాలా ఆనందంగా ఉన్నాడప్పుడు. ఇదే సరైన సమయం అని నాన్నని ముద్దుపెట్టుకుందాం అనుకున్నాడతను. సిగ్గు అడ్డొచ్చింది. ఆగిపోయాడు. ఆ ఆగిపోవడం డాక్టరైనా అతను ముందుకు సాగలేకపోయాడు. పెళ్ళయిపోయింది. పిల్లల తండ్రి అయ్యాడు. అయినా నాన్నకి ముద్దు పెట్టలేకపోయాడు. కుమిలిపోసాగాడు. అలా కుమిలిపోతున్న రోజుల్లోనే ఓ రోజు అమ్మ ఫోన్ చేసింది. నాన్న పోయాడని చెప్పింది. అంతే! పట్నం నుంచి పరుగుపరుగున వచ్చాడతను. వచ్చి చూశాడు. ఎప్పటిలాగానే నాన్న వసారాలో వాలుకుర్చీలో నిద్రపోతూ కనిపించాడు. చదువుతూ నిద్రపోయినట్టున్నాడు. పుస్తకం నాన్న గుండెల మీద ఉంది. చేతులు ఒడిలో ఉన్నాయి. ఏడుస్తూ నాన్నని దగ్గరగా తీసుకున్నాడతను. నుదుటన ముద్దుపెట్టాడు.

నీ ముద్దు కోసం మీ నాన్న పరితపించని రోజు లేదురా! నీకు ఏడేళ్ళ వయసు నుంచి అడుగుతూనే ఉన్నారు. వాడు ముద్దు పెడతాడన్నావు, వస్తాడన్నావు, ఏడి? రాడేం? అని అడుగుతూనే ఉన్నారు. ఆఖరికిప్పుడు వచ్చావు. ముద్దుపెట్టావు. చాల్రా! అదే ఆనందం అంది అమ్మ. అతడు హతాశుడయ్యాడు.

నవ్య




## లాటరీ టికెట్!

రోడ్డుమీద వెళుతుంటే బంగారు గొలుసో, నోట్ల కట్టో కనబడితే ఏం చేస్తారు? మామూలుగా అయితే తెగ ఆనందపడిపోతూ చటుక్కున జేబులోకో, బ్యాగులోకో తోసేస్తారు కదా! ఈరోజు నా పంట పండింది, నా అదృష్టం బాగుంది అనుకుంటారు కూడా! కానీ సుధాకరన్ మాత్రం అలా అనుకోలేదు. నీతిగా నిజాయితీగా ఉండమని చెప్పిన తండ్రి మాటలనే వేదవాక్కుగా భావించి ప్రవర్తించాడు. జీవితాన్ని సంతోషంగా గడుపుతున్నాడు. అతని జీవితంలో జరిగిన అలాంటి ఓ సంఘటన...

కేరళలోని కన్హాన్‌గడ్ అనే ఓ చిన్న పట్టణానికి చెందిన సాదాసీదా మనిషి సుధాకరన్. బతుకు తెరువు కోసం ఓ చిన్న దుకాణం నడుపుకుంటున్నాడు. జ్యూస్‌లు, కూల్‌డ్రింక్‌లు, స్వీట్స్‌తో పాటు లాటరీ టికెట్‌లు కూడా అమ్ముతూ ఉంటాడు. ఒక రోజు ఉదయాన్నే తన దుకాణానికి అశోకన్ అనే రెగ్యులర్ కస్టమర్ నుంచి ఫోన్ వచ్చింది. పది లాటరీ టికెట్‌లు తీసి పక్కన పెట్టమని, తరువాత వచ్చి డబ్బు కట్టి తీసుకుంటానని అన్నాడు. సరేనని సుధాకరన్ అతని కోసం ఓ పది టికెట్‌లు తీసి పక్కన ఉంచాడు. అశోకన్ వచ్చి టికెట్లు తీసుకోలేదు. ఈలోపు లాటరీ ఫలితాలు వచ్చాయి. అశోకన్ కోసం తీసిన పది టికెట్లలో ఒకదానికి బంపర్ ప్రైజ్ తగిలింది. అక్షరాలా కోటిరూపాయల టికెట్. ఏం చేయాలో పాలుపోక తన తండ్రికి ఫోన్ చేశాడు సుధాకరన్. తండ్రి నీతి నిజాయితీలనే నమ్ముకోమన్నాడు. అతని కోసమే కదా ఆ టికెట్ పక్కన పెట్టావు. న్యాయంగా ఆ డబ్బులు అతనికే చెందాలి కాబట్టి అతనికే ఇచ్చెయ్యమన్నాడు తండ్రి. వెంటనే అశోకన్‌కి ఫోన్ చేసి లాటరీ తగిలినట్లు చెప్పాడు. అంతే, అశోకన్ షాకయ్యాడు.



సమయానికి తగ్గట్టుగా ప్రవర్తించడం మానవ సహజం. కస్టమర్ వచ్చి లాటరీ టికెట్ తీసుకోలేదు. డబ్బులు కట్టలేదు. కనీసం టికెట్ నెంబర్లు కూడా తెలీదు. కాబట్టి ఆ టికెట్ తానే తీసుకుని కహానీలు చెప్పవచ్చు కస్టమర్‌కి. కానీ సుధాకరన్ అలాచేయలేదు. నీతి నిజాయితీలనే నమ్ముకున్నాడు. ఇదొక్కటే కాదు. ఇంతకుముందు అతడు రైల్లో ప్రయాణిస్తుండగా బంగారుగొలుసు దొరికింది. దాన్ని జాగ్రత్తగా తీసుకెళ్ళి పోలీసులకు అప్పగించాడు సుధాకరన్. నీతిగా ఉండే విషయంలో తన తండ్రే తనకు స్ఫూర్తి అంటున్నాడు. "ధనం ప్రధానం కాదు, సంతోషంగా, ఆనందంగా, ఉన్న దాంతో సంతృప్తి చెందుతూ జీవించడం గొప్ప. నీకు లేకపోతే అడుక్కు తిను. అంతేకాని వేరొకరి సొమ్ముకు ఆశపడవద్దు" అనే సూత్రాన్ని నమ్ముతూ ఆ నీతి సూత్రాన్నే పాటిస్తున్న సుధాకరన్‌కి హ్యాట్సాఫ్ చెప్పాల్సిందే!

# మెయిల్ బాక్స్

### దొంగ దొంగ

మొదటిపేజీలో జైలే నయం అనే ఆ తండ్రి ఆలోచన చదివిన తర్వాత కడుపులో ఎంతో బాధ కలిగింది. ఏమిటీ లోకం? ఆ ఒక్క తండ్రి పరిస్థితే కాదు, చాలా ఇళ్ళల్లో ఇలాంటి తండ్రులున్నారు. మా ఇంటి దగ్గరే బీటెక్ చదివిన ఒక కొడుకు విదేశాలు వెళ్ళే మోజుతో స్థానికంగా దొరికిన ఉద్యోగాన్ని కాలదన్నుకున్నాడు. జర్మనీకి వెళ్ళేందుకు 15 లక్షలు కావాలని ఇల్లు అమ్మేయాలనీ తగాదా పడుతున్నాడు. ఏడాది తర్వాత నేనే రాజుని అంటున్నాడు ఆ కొడుకు. ఆ తండ్రి ఎంతో ఆవేదన చెందుతున్నాడు. ఇది నేను చూసిన ఒక ఉదాహరణ.

**ఆహా! ఏమి వర్ణన:** సీత జాడను రాముడికి తెలియజేసిన అరణి రామాయణ ఘట్టం అద్భుతం. 'అనంతవిశ్వం చేతులు జాచి ఓ అణువును కౌగిట బంధించడాన్ని, బంధించి మురిసిపోవడాన్ని ఆకాశ సంచారులు చూశారు, ఆశ్చర్యపోయారు అనే వాక్యాలు ఎంతో ఆకట్టుకున్నాయి. ఆ వర్ణన చదువుతుంటే ముళ్ళపూడి రమణగారు గుర్తుకు వచ్చారు. ఆహా ఏమి వర్ణన. అద్భుతం. ఇందుకోసమేనండీ అరణిగారి రామాయణం చదువుతాం.

-కె.వి.రంగల శెట్టి, విశ్రాంత సూపరింటెండెంట్ ఇంజనీర్, నర్సరావుపేట

### కమనీయమైన కల్యాణం

కంగనా రనౌత్ ముఖచిత్రం ఆకర్షణీయంగా ఉంది. 'కమనీయం సీతారామకల్యాణం' ప్రత్యేక వ్యాసం బాగుంది. 'కామరూప' సీరియల్ రసవత్తరంగా ఉంది. ఈ వారం శృంగార కథ బాగా నచ్చింది. చక్కటి అంశాలు వారం వారం ప్రచురిస్తున్న నవ్య వీక్లీ సంపాదకులకు ధన్యవాదాలు.

-లక్కరాజు ప్రఫుల్లచంద్ర, ధర్మవరం

### రామాయణం అందరూ చదవాలి

రామాయణం ఎన్ని సార్లు చదివినా అద్భుతమే. అరణి రామాయణం ఎంతో హాయిగా ఉంది. కొత్తగా ఉంది. ఇంటిల్లపాదీ చదివి ఆనందిస్తున్నాం. ఆశ్చర్యపోతున్నాం. రాముడు ఏడవటం, సీత భయపడిపోవడం, లంకలో హనుమంతుడి యుద్ధం, రాముడు యుద్ధానికి బయలుదేరడం వంటి ఘట్టాలు బాగుంటున్నాయి. రామాయణం అందరూ చదవాలి.

-నాగేశ్వరరావు, ఏలూరు

### కార్టూన్లు, కార్టూనిస్టులు సూపర్

ఇంటర్వ్యూ విశేషాలు బాగున్నాయి. పినిశెట్టి గారి వర్ణ చిత్రాలు సూపర్. ఆయన మంచి ఆర్టిస్టు. కార్టూను కళ అందరికీ ఆదర్శం కావాలి. ప్రముఖులతో కార్టూన్ చిత్రాలు వేయిస్తున్న ఆలోచన సూపర్బ్. ఎమ్మెస్ నారాయణగారు మన మధ్య లేకపోవడం తీరనిలోటు. ఆయన సజీవంగా ఉండి ఉంటే ఇంకా వెండితెరకు ఎంతో హాస్యం లభించేది. బాచిగారి కార్టూన్లు బాపుగారితో సమానంగా ఉంటున్నవి. సరసిగారి కార్టూన్ హ్యూమరస్‌గా ఉంది. రసజ్ఞత గలవారిని అభినందించాలి.

-వాసుదేవ, ఉయ్యూరు

### ప్రతిపేజీ ఆకర్షణీయం

నవ్య వీక్లీలో కార్టూన్లు, మార్నింగ్ కాఫీ బిట్లు ఎంతో ఆకట్టుకుంటున్నాయి. ప్రతి పేజీకీ ఒక ఆకర్షణ ఉండటం, ప్రతి పేజీకీ ఒక ప్రత్యేకత ఉండటం నవ్య వీక్లీకి ప్రధాన ఆభరణం. సరసి కార్టూన్లు, జయదేవ్, బాచి కార్టూన్లు, అన్నీ బాగుంటున్నాయి. అమ్మకానికి ఫ్రెష్ ఎయిర్ వ్యాసం చదివాక భవిష్యత్తు పట్ల భయం వేస్తోంది. రాబోయే కాలం ఇలాగే ఉంటుందా?

-పోసి, హైదరాబాద్




విజయనగరంజిల్లా బొబ్బిలిలో ఏప్రిల్ 10వ తేదీ జరిగిన రాష్ట్రస్థాయి సేవాశ్రీ అవార్డు ప్రదానోత్సవ దృశ్యం. మ్యాజిక్ సిస్టర్స్ మౌనిక, సుస్మితకు అభిమాని ఫౌండేషన్ ఆధ్వర్యంలో ప్రముఖులు ఈ అవార్డు అందజేశారు.

## సయాటికా, నడుంనొప్పులకు చెక్

**నడుం** నొప్పి ఉంటే జీవితం నిర్జీవంగా మారుతుంది. నొప్పి మూలంగా ఏ పనీ చేసుకోలేకపోతారు. ఉదయం వేళ నొప్పి తీవ్రంగా ఉంటుంది. అరుదుగా మూత్రవిసర్జనపై నియంత్రణ కోల్పోవడం జరుగుతుంది. దీర్ఘకాలంగా బాధపడే వారిలో శృంగార సమస్యలు కూడా ఎదురవుతాయి. సరియైన భంగిమలో కూర్చోకుండా పని చేసే వారిలోనూ, గంటల తరబడి కూర్చుని పనిచేసే వారిలోనూ ఈ సమస్య వస్తుంది. కొందరిలో నొప్పి నడుం నుంచి మోకాళ్లు, పిక్కల ద్వారా అరికాళ్లు, కాలివేళ్ల దాకా వ్యాపిస్తుంది. దీన్ని సయాటికా అంటారు. వెన్నులో ప్రతి రెండు వెన్నుపూసల మధ్య కొంత ఖాళీ ప్రదేశం, ఒక సయాటిక్ నరం, పూసలను బంధించి ఉంచే కొన్ని కండరాలు ఉంటాయి. మన దైనందిన పనుల్లోని కొన్ని లోపాల వల్ల కొందరిలో ఈ పూసలను బంధించి ఉంచే కండరాలు బలహీనమవుతాయి. ఫలితంగా పూసల మధ్య సహజంగా ఉండవలసిన ఖాళీ తగ్గిపోతుంది. దీనివల్ల పూసల మధ్య ఉండే సయాటికా నరం ఒత్తిడికి లోనవుతుంది. దీనివల్ల ఆ నరం వెంట నొప్పి వస్తూనే ఉంటుంది.

**లక్షణాలు :** చాలా మందిలో కుడి వైపు నొప్పి ఎక్కువగా వస్తుంది. నడుము నొప్పి రావడం, కొద్దిగా శారీరక శ్రమ చేయగానే నొప్పి తీవ్రత పెరగడం, మొదట నడుము భాగంలో మొదలై క్రమేణా తొడ వెనక భాగానికి పాకుతుంది. కరెంట్ షాక్ కొట్టినట్లు నొప్పి వస్తుంది. కొన్నిసార్లు నడవడానికి, కూర్చోవడానికి ఇబ్బంది పడాల్సి వస్తుంది.

**హోమియో చికిత్స :** నొప్పి ఏదైనా సమూలంగా తగ్గాలంటే హోమియో చికిత్స ఒక్కటే మార్గం.లుంబార్‌స్పాండిలోసిస్, సయాటికా సమస్యలకు హోమియోలో మంచి మందులు ఉన్నాయి. వీటితో నడుం నొప్పి శాశ్వతంగా పోతుంది.





## పైల్స్, ఫిస్టులా పోవాలంటే..?

**పైల్స్, ఫిస్టులా** సమస్యలతో బాధపడే వారి సంఖ్య తక్కువేమీ కాదు. కాకపోతే, సమస్య మరీ తీవ్రమై భరించలేని స్థితికి వస్తే కానీ , చాలా మంది డాక్టర్‌ను సంప్రదించరు. సమస్య బాగా ముదిరిన తరువాత ఆపరేషన్‌కు వెళతారు. నిజానికి శస్త్ర చికిత్సల వల్ల తాత్కాలిక ఉపశమనం లభిస్తుందే తప్ప సమస్య సంపూర్ణంగా పోదు. వ్యాధి మూలాలను సమూలంగా తొలగిస్తే గానీ ఈ సమస్యలు పూర్తిగా కనుమరుగైపోవు. అలాంటి మూల వైద్యం చేయడంలో హోమియో వైద్యులు ఎంతో సిద్ధహస్తులు.

**యానల్ ఫిస్టులా (భగంద్రం) :** ఫిస్టులా రోగికి ప్రాణాంతకమేమీ కాకపోయినా, అది కలిగించే బాధ వర్ణనాతీతం. ఆ బాధల్లో ముఖ్యంగా చీము, రక్తం కలగలిసిన ద్రవం పిరుదులు, మలద్వారం వద్దనుంచి తరుచూ రావడం. భరించలేని నొప్పితో పాటు జ్వరంగా కూడా ఉంటుంది. కొందరికి మలంతో పాటే రక్తమూ రావచ్చు.

**అర్శమొలలు(పైల్స్) :** మలద్వారం పక్కన ఉండే దమనులు ఉబ్బిపోవడాన్నే అర్శమొలలు అంటారు. ఈ సమస్య ఉన్న వారిలో మల విసర్జన సమయంలో రక్తం పడుతుంది. కొన్నిసార్లు రక్తం మలంతో కలిసి వస్తుంది.

**హోమియో వైద్యం :** పైల్స్‌కు సంబంధించిన వైద్యంలో హోమియోలో ఒక విలక్షణమైన విధానం ఉంది. ప్రత్యేకించి దెబ్బతిని వాచిపోయిన దమనులను తిరిగి పూర్వస్థితికి తెచ్చే సామర్థ్యం హోమియో మందులకు ఉంది. అందుకే ఇక్కడ పైల్స్ సమస్యశాశ్వతంగా, సంపూర్ణంగా తగ్గిపోతోంది. ఫిస్టులా లోనూ ఆ మార్గాన్ని మూసి వేయడమే కాకుండా, హోమియో మందులు సమస్య మరోసారి రాకుండా కూడా చేసి ప్రశాంతమైన జీవితం గడిపేలా చేస్తాయి.

## మైగ్రేన్ తలనొప్పి మళ్లీ రాదు

**తలనొప్పి** వచ్చిందంటే చాలు తగ్గే వరకు మామూలు మనిషి కాలేరు. రోజూ నరకం అనుభవిస్తారు. వెలుతురు చూడలేరు, చిన్న శబ్దాలను వినలేరు. తలనొప్పిఅంత తీవ్రంగా ఉంటుంది. మరి కొందరికి రెండు, మూడు రోజులకొకసారి తలనొప్పి వస్తూనే ఉంటుంది. తలనొప్పితో పాటు వాంతులు, తలతిరగడం వంటి లక్షణాలుంటాయి. ఏ పని చేసుకోలేకపోతారు. నెలలో 10 రోజులు ఆఫీసుకు సెలవు పెట్టాల్సి వస్తుంది. ఏదైనా పనిచేస్తున్నప్పుడు తలనొప్పి మరింత తీవ్రమవుతుంది. తీవ్రమైన తలనొప్పి వల్ల ఏ పనీ చేసుకోలేకపోతారు వికారం, వాంతులు, వంటి లక్షణాలు ఉంటాయి.

**కారణం ఏమై ఉంటుంది? :** సైనసైటిస్‌తో బాధపడే వారిలోనూ తలనొప్పి ఉంటుంది. తీవ్రమైన ఒత్తిడికి గురయ్యే వారిలోనూ తలనొప్పి ఉంటుంది. కాబట్టి ముందుగా కారణాలను తెలుసుకునే ప్రయత్నం చేయాలి.. మెదడులో కొన్ని రకాల కెమికల్స్ విడుదల కావడం, రక్తనాళం ఎన్‌లార్జ్‌మెంట్ కావడం వంటివి తలనొప్పికి కారణమవుతుంది. అలర్జీ, లైట్, పెర్‌ఫ్యూమ్, స్ట్రెస్, స్మోకింగ్, ఆల్కహాల్, సమయానికి భోజనం చేయకపోవడం వంటి కారణాలు అందులో ఉంటాయి.

**హోమియో చికిత్స తరువాత :** మైగ్రేన్ సమస్యకు ఇతర చికిత్సా విధానాల్లో పరిష్కారం లేదనే చెప్పవచ్చు. ఇతర చికిత్సల్లో లక్షణాలు తగ్గించేందుకు చికిత్స ఇస్తారే తప్ప మూలకారణాన్ని తొలగించేలా చికిత్స ఉండదు. నాలుగు రోజుల తరువాత మళ్లీ మామూలే అవుతుంది. కానీ హోమియో చికిత్స అలా కాదు. మూలకారణాన్ని తొలగిస్తుంది. మైగ్రేన్‌కు కారణమవుతున్న నరాలను సాధారణ స్థితికి తీసుకువస్తుంది. కెమికల్స్ విడుదలను అడ్డుకుంటుది. ఫలితంగా మైగ్రేన్ సమస్య శాశ్వతంగా తగ్గిపోతుంది. సమస్య మళ్లీ పునరావృతం కావడం అంటూ ఉండదు.

## హెపటైటిస్ బి, సి, హెర్పిస్‌లపై విజయం

**హెపటైటిస్...** ఈ మధ్యకాలంలో చాలా మందిని భయపెడుతున్న వైరస్ ఇది. ఇతర జబ్బులకు చికిత్స కోసం వెళ్లినపుడు, అనుకోకుండా చేసిన పరీక్షల్లో హెపటైటిస్ ఉన్నట్లు భయటపడుతుంది. దాంతో ఇక తమ జీవితం ముగిసనట్టేనని నిర్ధారణకు వస్తారు. ఈ వైరస్ శరీరంలో నుంచి పూర్తిగా పోదని, దీర్ఘకాలంలో కాలేయం దెబ్బతినే అవకాశం కూడా ఉందని వైద్యులు చెప్పడంతో వాళ్లు ఆ నిర్ణయానికి వస్తారు. నిజానికి హెపటైటిస్ వైరస్‌ను కట్టడి చేసే మందులు హోమియోలో ఉన్నాయి. హెపటైటిస్ ఉందని నిర్ధారణ అయ్యాక భయపడకుండా హోమియో వైద్యం తీసుకుంటే ఆరోగ్యవంతమైన జీవితం గడిపే అవకాశం దక్కుతుంది. ఆకలి వాంతులు వచ్చినట్టు అనిపించడం, ఒళ్లంతా నొప్పులు, మూత్రం పచ్చగా రావడం, కామెర్లు, చర్మంపైన దద్దుర్లు రావడం జరుగుతుంది. కడుపులో ఉబ్బరంగా ఉండటం, పొట్టలో నొప్పి వంటి లక్షణాలన్నీ హోమియో మందులతో దూరమవుతాయి.

**హెర్పిస్ సింప్లెక్స్ :** పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. సాధారణ పొక్కులే కదా అని వాటిని నిర్లక్ష్యం చేస్తారు. కానీ ఆ నీటిపొక్కులు పగిలి ఎర్రగా పుండు మాదిరిగా తయారవుతాయి. పురుషుల్లోనే కాకుండా స్త్రీలలో కూడా యోని మీద చిన్న చిన్న పొక్కులలాగా వచ్చి ఎర్రగా మారి విపరీతమైన నొప్పి ఉంటుంది. ఈ సమస్యకు చికిత్స తీసుకోకుండా వదిలేస్తే అనేక ఇతర సమస్యలకు దారితీస్తుంది. శృంగార జీవితం దెబ్బతింటుంది. సుఖం దూరమవుతుంది. దంపతుల మధ్య గొడవలకు కారణమవుతుంది. అయితే హెర్పిస్ సమస్యకు హోమియో అద్భుతంగా పనిచేస్తుంది. హోమియో చికిత్స అనంతరం వ్యాధి మళ్లీ తిరగబె ట్టడం ఉండదు. శృంగారజీవితం ఆనందమయం అవుతుంది.



పండుగ అంటే సందడి. ఇంటిల్లిపాదికీ ఆనందోత్సాహాల వేడుక. అయితే కొన్ని పండుగల గురించి చెప్పుకుంటే ఆశ్చర్యపోవాల్సిందే! ఇలా కూడా పండుగలు జరుపుకుంటారా అని ఆశ్చర్యం కలుగక మానదు. ప్రపంచ వ్యాప్తంగా చాలా చోట్ల ఇలాంటి క్రేజీ పండుగలు జరుపుకుంటారు. కొన్ని పండుగలు ఆశ్చర్యం కలిగించడంతో పాటు ఒళ్లు గగుర్పాటు కలిగించే విధంగా కూడా ఉంటాయి. ఒకచోట టమాటాలతో కొట్టుకుంటే, మరో చోట బత్తాయి పళ్లతో తన్నుకుంటారు. ఇంకోచోట ఏకంగా బురదగుంటలో పడి దొర్లుతూ ఆనందిస్తారు. మనకు గుర్రంపందేలు, కోడి పందేలు, ఎడ్ల పందేలు గురించి తెలుసుకదా కానీ అక్కడ ఒంటెల పందేలు నిర్వహిస్తారు మరి ఇలాంటి ఎన్నో ఆశ్చర్యం కలిగించే పండుగలు, ఆ విశేషాలు ఏమిటో చదివేసేయండి.

# వెరైటీ ఫెస్టివల్స్

## ఆరెంజెస్ వార్

యుద్ధం అంటే కత్తులు, బల్లేలు లేదా బాంబులు, తుపాకీ గుళ్ళ వర్షం. ఈ యుద్ధాలు మనకు తెలిసినవే! కానీ ఇటలీలో కమలా పండ్లతో యుద్ధం చేసుకుంటారు. ఇదేం సీరియస్ యుద్ధం కాదులెండి, సరదాకే! ఇటలీలోని ఇవేరియాలో ప్రతి సంవత్సరం ఆరెంజెస్ వార్ జరుగుతుంది. నాలుగు రోజుల పాటు జరుపుకునే ఈ యుద్ధంలో ఒకరి మీదకు ఒకరు కమలా పండ్లు గురి చూసి కొట్టుకుంటూ ఉంటారు. చిన్నా పెద్దా అందరూ కలిసి చేసుకునే పండుగ ఇది. ఈ పండుగ జరుగుతున్నన్ని రోజులూ అక్కడ రోడ్లన్నీ కమలా పండ్ల తొక్కలూ, రసంతో నిండిపోతాయి. ఇక మనుషుల సంగతి చెప్పనక్కర్లేదు. ఆ పండుగలో పాల్గొనే వారి బట్టలు నారింజ రసంతో తడిసి పోతాయి. కొంతమంది కమలాకాయ దెబ్బలను తట్టుకోవడానికి రక్షణ కవచాలు అంటే మాస్కులు కూడా ధరిస్తారు. మరి ఈ యుద్ధం కోసం ఎన్ని కమలాపండ్లు ఉపయోగిస్తారో తెలుసుకుంటే అందరూ ఆశ్చర్యపోవాల్సిందే. అక్షరాలా ఐదు వందల టన్నుల కమలా పండ్లు! అలాగే ఈ యుద్ధం కోసం దాదాపుగా 500 టన్నుల కమలాకాయలను ఉపయోగిస్తారు. ఎంతో ఫన్నీ అనిపించే ఈ పండుగ చూసేందుకు ఆ నాలుగు రోజుల సమయంలో అనేక మంది విదేశీ పర్యాటకులు కూడా ఇటలీకి వస్తారట.

## బురదగుంట పండుగ

పండుగలప్పుడు పవిత్ర నదీ జలాల్లో స్నానమాచరించడం తెలిసిందే! కానీ దక్షిణ కొరియాలో ప్రజలు ఇలాంటి పండుగే, కాస్త భిన్నంగా జరుపుకుంటారు. దాని పేరు మడ్ ఫెస్టివల్. దక్షిణ కొరియా బోరియాంగ్ పట్టణంలో 1998లో ఈ మడ్ ఫెస్టివల్ ప్రారంభమైంది. ప్రతి సంవత్సరం జరిగే ఈ పండుగలో వివిధ దేశాలకు చెందిన ప్రజలు కూడా పాల్గొంటారు. దక్షిణ సియోల్‌లో ఓ బీచ్ దగ్గర ఈ పండుగ జరుగుతుంది. ఈ బీచ్ పొడవున కొన్ని రకాల బురద గుంటలను ఏర్పాటు చేస్తారు. వాటికి మినరల్స్, జర్మేనియమ్, బెంటోనైట్ వంటి వాటిని కలిపి అతినీల లోహిత కిరణాల తాకిడికి గురికాకుండా చేస్తారు. ఈ పండుగలో పాల్గొనే వారందరూ ఆ బురదలో తుళ్లుతూ ఆడుకుంటుంటారు. బురదలో స్నానం చేయడం వల్ల కొన్ని రకాల చర్మ వ్యాధులు తొలిగిపోతాయని వారి విశ్వాసం. అంతే కాదండోయ్.. ఇక్కడ బురద స్నానం చేయాలనుకునే వారి కోసం ఏకంగా కృత్రిమ బురద వర్షాన్ని కూడా సృష్టిస్తారు. ఈ పండుగ ముగింపులో భారీగా బాణాసంచా కాలుస్తారు.

## స్పెయిన్‌లో టమాటా పండుగ

మనం హోళీ వేడుకల్లో పరస్పరం రంగులు చల్లుకోవడం, టమాటాలు, కోడిగుడ్లులాంటివి విసురు కోవడం తెలిసిందే కదా! అలాంటిదే ఈ టమాటాల పండుగ. టమాటా బాటిల్ లేదా లా టమాటినాగా పిలుచుకునే ఈ పండుగను స్పెయిన్ దేశం బునాల్‌లోని వాలెన్సియన్ టౌన్‌లో జరుపుకుంటారు. ఈ పండుగ ఆగస్ట్ నెల చివరి బుధవారం రోజు జరుపుతారు. అది కూడా ఉదయం పదకొండు నుంచి మధ్యాహ్నం ఒంటిగంట వరకే! ఈ పండుగలో భాగంగా రకరకాల టమాటాలను వాళ్లు వీళ్ళు అని తేడా లేకుండా కనిపించిన వారి మీదకి విసిరి ఆనందిస్తుంటారు. ఆ రోజు మొత్తం అక్కడి వీధులు, మనుషులు కూడా టమాటాలతో తడిసి ముద్దవ్వాల్సిందే!

## నీళ్లు చల్లుకునే పండుగ

రంగులు చల్లుకునే పండుగ మనందరికీ







# తాగినవారికి తాగినంత

తాగిన వారికి లేదనకుండా పోసే మందు పండుగ కూడా ఉందండోయ్! దానిపేరు అక్టోబర్ ఫెస్ట్. సెప్టెంబర్ చివరి వారంలో ప్రారంభమయ్యే ఈ పండగ అక్టోబర్ మొదటి వారం వరకూ దాదాపు పదహారు రోజులపాటు సాగుతుంది. ఇది జర్మనీ ప్రజల పండుగ. బవేరియన్ కల్చర్‌కి ప్రతిరూపంగా 1818 సంవత్సరం నుంచి ఈ పండుగ చేసుకోవడం ఇక్కడి ప్రజలకు సంప్రదాయంగా మారింది. ఈపండుగలో లక్షలాది మంది పాల్గొని ఆనందంగా గడుపుతారు. ఈ పండుగలో పాల్గొన్న వారందరికీ లేదనకుండా ఎంత తాగితే అంత ఉచితంగా బీరు సప్లై చేస్తారు.



తెలిసిందే. సరిగ్గా ఇలాంటిదే నీళ్ల చల్లుకునే పండుగ. దీన్ని సాంగ్‌క్రాన్ ఫెస్టివల్ అంటారు. థాయిలాండ్ దేశ ప్రజలు ఆచారంగా చేసుకునే పండుగ. ప్రపంచమంతా నీళ్ల లేవని గగ్గోలు పెడుతుంటే వాళ్ల మాత్రం ఈ పండుగలో ఒకరిపై ఒకరు నీళ్ల చల్లుకుంటారు. ఈ పండుగ ప్రతి సంవత్సరం ఏప్రిల్ 13 నుంచి 15వ తేదీ వరకు జరుగుతుంది. ఇది వారికి కొత్త సంవత్సరాది వేడుక. దానికి గుర్తుగా థాయ్ ప్రజలు ఇలా సెలబ్రేట్ చేసుకుంటారన్నమాట. ముఖ్యంగా పిల్లలకైతే ఇది ఎంతో ఇష్టమైన పండుగ.

## ద క్లీన్ మండే

ఇదిలా ఉంటే, ద క్లీన్ మండే పండుగ పేరుతో గ్రీస్‌లోని గెలాక్సిడీ అనే ప్రాంతంలో ఒకరిపై ఒకరు రంగురంగుల పిండి చల్లుకుంటారు. 200 సంవత్సరాలకు పూర్వమే ప్రారంభమైన పురాతన పర్వదినం 'ద క్లీన్ మండే'. ఈ పండుగ కోసం దాదాపు 1,500 కేజీల పిండి ఖర్చు అవుతుందట.

## పుచ్చకాయల పండుగ

ఎండాకాలంలో పుచ్చకాయ ఎంత చల్లదనం ఇస్తుందో మనందరికీ తెలిసిందే! కానీ ఆస్ట్రేలియాలో మాత్రం పుచ్చకాయను తినడానికే కాదు ఆటలు ఆడుకోవడానికి కూడా ఉపయోగిస్తారు. ఆస్ట్రేలియాలో డార్లింగ్‌డౌన్స్‌లోని చిన్‌చిల్లా గ్రామంలో పుచ్చకాయల పండుగ జరుగుతుంది. ఈ ప్రాంతాన్ని 'మెలన్ కాపిటల్ ఆఫ్ ఆస్ట్రేలియా' అని కూడా అంటారు. ఈ పండుగ ప్రతి రెండు సంవత్సరాలకొకసారి ఫిబ్రవరి నెలలో వస్తుంది. అందులో భాగంగా పుచ్చకాయకు సంబంధించిన అనేక రకాల పోటీలు నిర్వహిస్తారు. అయితే అత్యంత ప్రమాదకరమైనది ఆశ్చర్యం కలిగించేది ఏంటంటే ఈ పుచ్చకాయతో చేసే హెడ్ స్మాషింగ్ అనే ఈవెంట్! ఈ ఈవెంట్‌లో మనిషి తలను పుచ్చకాయతో గురిచూసి కొట్టడానికి ప్రయత్నిస్తారు. పుచ్చకాయ పగిలిపోకుండా ఆ మనిషి ఆ కాయను కాపాడుకోవాలన్నమాట. ఒళ్లు గగుర్పొడిచే ప్రమాదకరమైన ఈ పండుగ 2015లో జరిగింది. మళ్లీ ఈ పండుగ చూడాలంటే 2017 ఫిబ్రవరి దాకా ఆగాల్సిందే!

## ఒంటెల రెజ్లింగ్ పోటీలు

గుర్రపు పందేలు, కోడి పందేలు గురించి మనకు బాగా తెలిసిందే కదా! అలాగే టర్కీలో ఒంటెలకు పోటీలు నిర్వహిస్తారు. టర్కీలోని సేల్సుక్ పట్టణం వెలుపల ఎఫెసుస్ వద్ద ఒక పురాతన స్టేడియంలో ప్రతిసంవత్సరం జనవరి నెలలో ఈ పండుగ జరుగుతుంది. ఈ రెజ్లింగ్ పోటీలలో ఒంటె రెజ్లింగ్ చాంపియన్ షిప్ టైటిల్ కోసం పెద్ద పోటీ ఉంటుంది. ఈ పోటీలో దాదాపు 120 మంది ఒంటె యజమానులు పాల్గొంటారట. దాదాపు 200 సంవత్సరాల పూర్వం నుంచే ఈ పోటీలను ఒక పండుగలా నిర్వహిస్తున్నారు. ఒంటెల పోటీల్లో భాగంగా యజమానులు తమతమ ఒంటెలకు శిక్షణ ఇస్తారు. అంతే కాదండోయ్ ఈ మ్యాచ్‌లకు హాజరయ్యే ప్రేక్షకులకు ఎటువంటి ప్రమాదాలు జరగకుండా యాజమాన్యమే అన్ని రకాల జాగ్రత్తలూ తీసుకుంటుంది.



## వామ్మో అనాల్సిందే!

థైపూసం అనే పండుగ సుబ్రహ్మణ్యేశ్వర స్వామివారికి చేసే ఓ జాతర లాంటిది. శ్రీలంక, మలేషియా, సింగపూర్, దక్షిణాఫ్రికా, ఇండోనేసియాలో, థాయ్ దేశాల్లో తమిళ నెలలో పౌర్ణమి నాడు ప్రతి సంవత్సరం ఈ పండుగ జరుపుకుంటారు. ఈ వేడుకను చేయడం ద్వారా సుబ్రహ్మణ్యేశ్వర స్వామి కోరిన కోరికలను తీరుస్తాడని తమిళుల నమ్మకం. ధ్యాన సమయంలో మౌనంగా ఉండి, నాలుక, వీపు, ఛాతీ, ఇంకా ముఖం మీద త్రిశూలాలను గుచ్చుకుంటారు. మరికొంతమంది భక్తులు వాటికి రకరకాల తాళ్ళు తగిలించుకుని రథాలు లాగుతూ ఉంటారు. వాళ్లను చూస్తే ఒళ్ల జలదరిస్తుంది.

## కోతి బఫెట్ ఫెస్టివల్

బఫెట్ అంటే మనకు తెలిసిందే కదా! కానీ అక్కడ కోతులకు కూడా విందు భోజనం వడ్డిస్తారు. ఈ పండుగ థాయిలాండ్‌లోని లోప్‌బురిలో సానా ఫ్రా కానా, ఫ్రా ప్రాంగ్ సామ్ అనే ఆలయాల సమీపంలో జరుగుతుంది. ఈ ప్రాంత పరిసరాల్లో దాదాపు 300 కోతులు ఉంటాయి. స్థానిక ప్రజలు 4000 కిలోల తాజా పండ్లను, కూరగాయలను వీటికి ఆహారంగా సమకూరుస్తారు. 10వ శతాబ్దంలో నిర్మించిన సానా ఫ్రా కానా, ఫ్రా ప్రాంగ్ సామ్ అనే ఆలయాలు కాంబోడియాలోని అంగ్‌కోర్‌వాట్ ఆలయాన్ని పోలి ఉంటాయి. ఈ ఆలయాల వెలుపల అనేక కోతులు నివాసం ఉంటాయి. అందువల్ల ఈ ఆలయం బయట ఈ వేడుక జరుపుతారు. ప్రపంచ వ్యాప్తంగా ఈ పండుగ చూడటానికి వేలాదిమంది సందర్శకులు ఈ ప్రాంతానికి వస్తుంటారు.

## స్నార్కెలింగ్ చాంపియన్‌షిప్

ఈ పండుగను ప్రపంచ చిత్తడి స్నార్కెలింగ్ చాంపియన్‌షిప్ అని పిలుస్తారు. ప్రతి సంవత్సరం ఆగస్ట్ 30వ తేదీన ఈ పోటీలు జరుగుతాయి. ఈ క్రేజీ ఉత్సవంలో ప్రపంచ వ్యాప్తంగా 50 మంది మాత్రమే పాల్గొంటారు. ఈ పండుగనే స్విమ్ ఫిన్స్, స్నార్కెలింగ్ అని అంటారు. ఈ పోటీలో 55 మీటర్ల దూరం ఈతను రెండుసార్లు పూర్తి చేయాలి. ఎవరైనా సంప్రదాయ ఈత స్ట్రోకులు ఉపయోగిస్తే వారిని అనర్హులుగా ప్రకటిస్తారు. బురద గుంటలో ఈదుతూ అందరికన్నా ముందు వచ్చినవారికి చాంపియన్‌షిప్ ప్రకటిస్తారు. ప్రస్తుత ప్రపంచ ఛాంపియన్ షిప్‌లో 33ఏళ్ల క్రిస్టీ జాన్సన్ అనే మహిళ అమెరికన్, జర్మన్, ఫ్రెంచ్, బెల్జియం, స్వీడిష్, పోర్చుగీస్, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా, కివి దేశాల నుంచి గట్టిపోటీ ఎదుర్కొని నిలిచింది.

- విజేత దహగాం

# వందన

సి.వి. సర్వేశ్వర శర్మ

**'అక్కా! గాయత్రి కొడుకు పెళ్ళికి అందరూ తయారవుతున్నారు. ఎల్లుండి పెళ్ళి అంటున్నారు. నాకు ఏ విషయం చెప్పలేదేమిటి?' ప్రశ్నించింది వందన.**

**'గాయత్రి నీతో చెప్పలేదా? నాకు తెలియదు' సమాధానం ఇచ్చింది అక్క అన్నపూర్ణ.**

**'మనింట్లో మనకు పిలుపులేమిటి? అందుకే పెళ్ళికి వచ్చేందుకు నేను బట్టలు సర్దుకుని రెడీగానే ఉన్నాను' చెప్పింది వందన.**

'ఈ మనుషులు, ఈ పద్ధతులు నాకు అర్థం కావడం లేదు. గాయత్రితో మాట్లాడు' అన్నపూర్ణ గొంతులో తేడా స్పష్టంగా గ్రహించింది వందన.

'గాయత్రిని అడుగుదామంటే అది నన్ను తప్పించుకుని తిరుగుతోంది! ఎందుకు ఇలా చేస్తున్నారు?' వందన గొంతులో కొంత ఆదుర్దా.

'నాకేం తెలుస్తుంది! ఎవరికి వారే గొప్పవారు! ఎవరి అభిప్రాయాలు వారివి. గాయత్రి చిన్నపిల్లేం కాదు. కొడుకు పెళ్ళి చేస్తోంది' అక్క జవాబుగా చెప్పింది.

'నాకు ఎంతో సంతోషంగా ఉంది. ఆ పెళ్ళి ముచ్చట చూడాలని కదా! ఈ ఆరాటం' వందన తన మనసులో కోరికను బయట పెట్టింది.

'అదిగో! గాయత్రి. దానినే అడుగు' అంది అన్నపూర్ణ 'ఒసేవ్! గాయత్రి, అలా వెళ్ళి పోతావేమిటి? అందరినీ పెళ్ళికి పిలిచావు. నాకు కనీసం పెళ్ళి గురించి ఏ విషయం చెప్పవేమిటి?' వందన నిష్ఠూరంగా అంది.

'పెద్దదానివి పిన్నీ! నీకు చెప్పకుండా ఏమి చేస్తాం? అదే ఎలా చెప్పాలని ఆలోచిస్తున్నాను' గాయత్రి జవాబు ఇచ్చింది.

వీధిలోంచి హాల్లోకి వచ్చిన గాయత్రి హాల్లో కుర్చీలో కూర్చుని ఉన్న వందనతో మాట్లాడుతుంటే అన్నపూర్ణ లోపలి గదిలోకి వెళ్ళే గుమ్మం దగ్గర నుంచుని వీరి సంభాషణ వింటోంది.

'ఇందులో ఆలోచించడానికి ఏముంది?' వందన ప్రశ్నించింది. 'అదికాదు పిన్నీ! నీకు మోకాళ్ల నొప్పులు. అడుగు తీసి అడుగు వేయడానికి చాలా ఇబ్బంది పడుతున్నావు. ఇలాంటి స్థితిలో పెళ్ళికి తీసుకువెళ్లి నిన్ను ఇబ్బంది పెట్టడం ఎంతవరకు సమంజసం అని ఆలోచిస్తున్నాను' మనసులో మాట చెప్పింది గాయత్రి.

'కాళ్ల నొప్పులు మాట నిజమే! కాని ఏది మానుతున్నాను. ఊళ్ళు తిరుగుతూనే ఉన్నాను కదా?' వందన ప్రశ్నించింది.

'అవుననుకో! పెళ్ళిలో నిన్ను కనిపెట్టుకుని ఉండడం కష్టం కదా! ఊళ్ళు వెళ్ళినప్పుడు నీతో ఉన్న వారికి దృష్టి నీ మీద ఉంటుంది. అందువల్ల సమస్యలు ఉండవు' గాయత్రి చెప్పింది.

'పెళ్లికి వస్తే నేను మీకు సమస్య అవుతానా?' కొంచెం ఉక్రోషంగా అడిగింది వందన.

'అది కాదు పిన్నీ! నీ కాలికి నొప్పి ఎక్కువయితే పెళ్ళిలో నిన్ను చూసుకోవడం కష్టం అవుతుంది కదా!" అనునయంగా చెప్పింది గాయత్రి.

వందన మనసుకు కష్టం అన్పించింది. గాయత్రి పుట్టినప్పటి నుండి దానిని ఎత్తుకుని పెంచి ఎంతో ముద్దు చేసింది తాను. అటువంటి గాయత్రి ఇప్పుడు మనసులో ఏదో పెట్టుకుని తనను పెళ్ళికి రావద్దంటోంది. వందనకు గాయత్రి ధోరణి అర్థం కావడం లేదు.

•••

'వందనా! నిన్న మనింటికి వచ్చిన సుబ్బారావు గురించి నీ అభిప్రాయం ఏమిటి?' తండ్రి

పాపారావు అడిగాడు.

'అలా అడుగుతున్నారేమిటి?' వందన ప్రశ్నించింది.

'నిన్ను ఎంతో గారాబంగా పెంచుకుంటున్నాం. అయినా ఏదో ఒక రోజున నిన్ను ఒకరి చేతిలో పెట్టాలి. సుబ్బారావు నిన్ను కంటికి రెప్పలా చూసుకుంటాడనిపించింది. నీకు ఇష్టమైతే వాళ్ల నాన్నగారితో మాట్లాడతాను' పాపారావు తన అభిప్రాయం చెప్పాడు.

'నాకెలా తెలుస్తుంది నాన్నగారు! మీ ఇష్టం. మీ మనసుకు ఎలా నచ్చితే అలా చెయ్యండి' వందన తన అభిప్రాయం చెప్పింది.

అక్క అన్నపూర్ణకి అప్పటికే పెళ్ళి అయ్యింది. గాయత్రి కూడా పుట్టింది.

మొత్తం మీద పాపారావు నిర్ణయం తీసుకోవడంతో సుబ్బారావుకు వందన ఇల్లాలు అయ్యింది.

సుబ్బారావు భువనేశ్వర్‌లో ఉద్యోగం చేసేవాడు. సుబ్బారావు తల్లిదండ్రులు మార్టేరు సమీపంలో కొడమంచిలి అనే పల్లెటూళ్లో ఉండేవారు. సుబ్బారావు ఉద్యోగానికి వారం రోజులు సెలవు పెడితే విశాఖపట్టణంలో ఉండే తండ్రి పాపారావు వద్ద వందన ఉండేది. భార్య మీది ఇష్టం కొద్దీ సుబ్బారావు ఆమెతో విశాఖపట్టణంలో ఉండి పోయేవాడు.

కొడమంచిలి రావాలంటే రెండు రోజులు పడుతుందని సుబ్బారావుగాని వందనగాని పల్లెటూరుకి వెళ్లేవారు కారు.



ఆ విధంగా సుబ్బారావు భార్యా దాసుడై తల్లిదండ్రులకు దాదాపు దూరం అయిపోయాడు. సుబ్బారావు తల్లిదండ్రులు నిస్సహాయులుగా ఉండిపోయి సుబ్బారావును తలచుకుంటూనే కాలం గడుపుతూ చివరకు ముసలితనం కారణంగా తనువులు చాలించారు.

సుబ్బారావు అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లు కలుసుకుంటూ ఉండేవారు. సుబ్బారావు యోగ క్షేమాలు చెప్పుకుంటూ ఉండేవారు.

వందన ఎప్పుడూ తనకు ఏది కావాలో చూసుకునేది. సుబ్బారావును పట్టించుకునేది కాదు. భార్యకు ఏమి కావాలో తెలుసుకుని సమకూర్చేవాడు సుబ్బారావు. వారి సంసారంలో వారిద్దరే. పిల్లలు కూడా లేరు. పాపారావు కన్ను మూయడంతో ఆ ఇంట్లోకి అన్నపూర్ణ తన ఇద్దరు పిల్లలు, భర్తతో చేరిపోయింది.

తండ్రి మరణించినా ఆ పాత్ర అన్నపూర్ణ పోషించేది. చెల్లెలు వందనను ఎంతో అభిమానంతో చూసుకునేది.

సుబ్బారావు రిటైరయిన తరువాత మకాం భువనేశ్వర్ నుండి విశాఖపట్టణం మార్చారు. అక్క అన్నపూర్ణ ఇంటికి సమీపంలోనే ఉండేవారు. సుబ్బారావుకు గుండె పోటు వచ్చింది. ఆసుపత్రిలో చేరాడు.

అన్నగారిని చూడటానికి వచ్చిన అతని చెల్లెలు రాణికి తన భర్త బాధ్యతలు అప్పగించి వందన అక్కగారింట్లో ఉండిపోయింది. రాణికి మనసు ఎంతో కష్టం అన్పించింది. అయినా అన్నకు అండగా నిలిచింది. సుబ్బారావుకి ఆరోగ్యం కుదుట పడగానే వందన తనింటికి వచ్చింది.

'వదినగారు! మీరు ఎప్పుడు వెడుతున్నారు? తమ్ముడి గారికి పాపం ఇబ్బంది కదా?' వందన మాటలకు రాణి చాలా చిన్నబుచ్చుకుంది. వెంటనే వెళ్ళిపోయింది రాణి.

రెండేళ్ళు గడచిన తరువాత సుబ్బారావుకు మళ్ళీ గుండెపోటు రావడం ప్రాణాలు విడవడం జరిగింది.

కబురు తెలిసిన సుబ్బారావు తోడబుట్టినవారు కర్మకాండలు పూర్తి చేసి ఎంతో మర్యాదగా ప్రవర్తించి వెళ్లిపోయారు.

•••

'అక్కా! నేను వితంతువుగా కన్పించడం నాకు ఇష్టం లేదు! అటువంటి తంతులు పెట్టకండి' వందన తన మనసులో మాట చెప్పింది. 'నీ ఇష్టం. నీ మనసు కష్టపెట్టే పనులు మేం చేయం' అంది అక్క. గాయత్రి తటస్థంగా ఊరుకుంది. అన్నపూర్ణ భర్త రంగనాథం ఆడవారి విషయాల్లో తల దూర్చడం ఎందుకని మౌనం వహించాడు.

'నాకు చిన్నప్పటి నుండి గాజులు, పూవులు అంటే ఎంతో ఇష్టం. పెళ్ళి అయిన తరువాత అవి నా ఒంటి మీదకు రాలేదు. సుబ్బారావు పెళ్ళి చేసుకున్నాడు. అతడు వచ్చిన పని అయిపోయింది. వెళ్లిపోయాడు. అంతమాత్రాన నేను వాటికి ఎందుకు దూరం కావాలి?' వందన అన్నపూర్ణతో తన మనోభావాన్ని చెప్పింది.

'మంగళసూత్రం పెళ్ళితో వచ్చింది కదా!' చటుక్కున అన్న గాయత్రి వెంటనే నాలిక కరచుకుంది.



'దానికేముంది. మంగళసూత్రం తీసేస్తాను' వందన వెంటనే జవాబు చెప్పింది.

'వందనా! ఒక పని చేద్దాం. నువ్వు చేసే పని ఎంతవరకూ శాస్త్ర సమ్మతమో బ్రహ్మాగారిని అడుగుదాం' అన్నపూర్ణ అక్క సలహా ఇచ్చింది.

'బ్రహ్మాగారిని అడగడం నాకు ఇష్టం లేదు' వందన తన ధోరణిలో జవాబు ఇచ్చింది.

'ఎందుకని' గాయత్రి ప్రశ్నించింది.

హాలుకు ఆనుకుని ఉన్నగదిలో కుర్చీలో కూర్చొని వందన, సమీపంలో ఉన్న మంచం మీద ఒక వైపు గాయత్రి, కుర్చీకి దగ్గరలో ఉన్న మంచం చివర అక్క అన్నపూర్ణ కూర్చుని చర్చించుకుంటున్నారు. మిగతా కుటుంబ సభ్యులు కొంతమంది హాలులోను, మరికొంతమంది వీధిలో వేసిన షామియానాలో గల కుర్చీలలో కూర్చుని ఎవరి ధోరణిలలో వారు కబుర్లు చెప్పుకుంటున్నారు.

'ఏముంది! ఆ తంతు పూర్తి చేసిన వారికి డబ్బులు ముడతాయి. అందుకని ఆ డిపార్టుమెంటు వారిని అడిగితే వద్దని అనరు. ఎదుటిమనిషి ఎంత నలుగుతున్నది వారికి అనవసరం. అందుకే వద్దంటున్నాను' వందన చెప్పింది.

పక్క గదిలో తచ్చాడుతూ వీరి సంభాషణ వింటున్న రంగనాథం వీరున్న గదిలోకి ప్రవేశించి 'మీరు తరచు దర్శనానికి వెళ్లే 'బాబా' గారిని అడగండి' ఉచిత సలహా ఇచ్చాడు.

'బావ చెప్పింది కరెక్టు! గాయత్రీ నువ్వు తరచు వెళ్లే 'బాబా' గారి దగ్గరకు నన్ను తీసుకు వెళ్ళు, అడుగుదాం' వందన అడిగింది.

'నువ్వు ఈ తంతులకు వ్యతిరేకం కాబట్టి అవి జరగాల్సిన సమయంలో జరగకుండా వాయిదా వేయించాను. ఏదైనా చిన్నకార్యక్రమం ఇంట్లో జరుగుతుంటే నీకు ఆ పాత ఆలోచనలు అన్నీ వచ్చేస్తూ ఉంటాయి' అక్క కొంచెం చికాకుగానే మాట్లాడింది.

మనలోని ఆలోచనలు వేరు. వాటిలోని న్యాయ బద్ధత తెలుసుకుంటే మంచిదని అక్క చికాకు పడకూడదని సర్ది చెప్పబోయింది వందన.

పిన్ని వందనను గాయత్రి 'దేముడుబాబా' గారి దగ్గరకు తీసుకు వెళ్లింది. 'మనసుకు నచ్చిన మార్గం ఎన్నుకుంటే ఏమీ తప్పులేదు' బాబా గారు సెలవు ఇచ్చారు. వందన మనసు కుదుట పడింది.

సుబ్బారావు సంవత్సరీకాలు వచ్చాయి. సుబ్బారావు అన్నదమ్ములు, అప్పచెల్లెళ్ళు కొంతమంది వచ్చారు. వందన పువ్వుల చీర, గాజులు, పువ్వులు, ముఖాన కుంకుమ బొట్టుతో కార్యక్రమాల్లో పాల్గొంది. 'సుబ్బారావు లేడు', ఇక 'వందన గురించి విమర్శలు అనవసరం' అత్తవారి వైపు వారు భావించి మౌనంగా కార్యక్రమాలు అయిపోయిన తరువాత వెళ్లిపోయారు. వందన మనసులో కొంత వెలితిగా అన్పించినా పట్టించుకోకుండా కార్యక్రమాల్లో పాల్గొంది.

•••

'గాయత్రీ! నా ఆరోగ్యం మీద నీకున్న శ్రద్ధకు సంతోషం. నీ మనసులో ఏముందో చెప్పు?' కొంచెం నిలదీసి అడిగింది వందన.

'అదేమిటి పిన్నీ! నా మనసులో ఏముంటుంది? మా అమ్మ తరువాత అమ్మలాంటి దానివి. నువ్వు పెళ్ళికి రావాలని నేను కోరుకోనా?' ఎదురు ప్రశ్న వేసింది గాయత్రి.

'నా ఆరోగ్యం గురించి అయితే నేను చూసుకుంటాను. నీకు ఇబ్బంది రానియ్యను. నీ కొడుకు పెళ్ళికి నేను వస్తున్నాను. అంతే' వందన స్పష్టం చేసింది.

గాయత్రికి పిన్నిలోని మూర్ఖత్వం అర్థం అయ్యింది.

'పిన్నీ! నేను ఎన్నో ఆలోచించి నీకు చెప్పాను. ఆ తరువాత నీ ఇష్టం' గాయత్రి చెప్పింది.

'నీ మనసులో ఏదో ఉంది! అది చెప్పు?' వందన నిష్ఠూరంగా అంది.

'గాయత్రి నువ్వు వెళ్లి నీ పని చూసుకో! పిన్నికి నేను చెబుతాను' అన్నపూర్ణ కలుగ జేసుకుంది.

'అక్కా! ఏమి చెబుతావు?' ఆశ్చర్యంగా అక్కకేసి చూసింది వందన. అన్నపూర్ణ చేతిలో గిన్నె ఎదురుగా ఉన్న బల్లమీద పెట్టింది.

ప్లాస్టిక్ కుర్చీని ఈడ్చుకుని వచ్చి వందన కూర్చున్న కుర్చీకి ఎదురుగా వేసుకుని కూర్చుంది.

'ఏమీ లేదు వందనా! గాయత్రి కొంచెం భయపడుతోంది!' అన్నపూర్ణ చెప్పబోయింది.

'నా ఆరోగ్యం గురించా?' వందన ఎదురు ప్రశ్న వేసింది.

'కాదు! కొత్త వియ్యాలవారు! నిన్ను నీ అవతారం చూసి ఈవిడ ఎవరు అని అడిగితే ఏమి చెబుతుంది?' అక్క ప్రశ్నించింది.

'పిన్ని' అని చెబుతుంది. వందన జవాబుగా చెప్పింది.

'మీ బాబయ్యగారు రాలేదా?' అని అడిగితే?

'ఆ విషయం వారికి అనవసరం' కఠినంగా చెప్పింది వందన.

'అది నీ అభిప్రాయం. కాని వారు అడుగుతారు. గాయత్రి జవాబు చెప్పాలి.'

'ముత్తయిదువలలో ముత్తయిదువుగా కూర్చుంటే ఎన్నో సమస్యలు ఎదురవుతాయి. నీ అభిప్రాయాలను మేము అంగీకరిస్తాం. గౌరవిస్తాం. కానీ సమాజంలో ఎంతమంది ఆమోదిస్తారు. ఎవరైనా ఏదైనా అంటే మేము ఆ మాటలు విని భరించగలమా?' అనునయంగా అక్క చెప్పింది. వందన మౌనంగా వింటోంది.

'అందుకే పెళ్ళికి నిన్ను రమ్మని ఆహ్వానించడానికి గాయత్రి తటపటాయిస్తోంది' అసలు విషయం అక్క అన్నపూర్ణ సున్నితంగా చెప్పింది.

వందన మాట్లాడలేదు. హాలు పక్కగా ఎదుటి గదిలో మేడ మెట్లు ఉన్నాయి. అడుగులో అడుగు వేసుకుంటూ వందన నెమ్మదిగా మేడ మీద ఉన్న తన గదిలోకి వెళ్లిపోయింది.

•••

వందన మంచం మీద అటూ ఇటూ దొర్లుతోంది తన గదిలో. ఇంట్లో ఎవరూ లేరు. అందరూ పెళ్ళికి వెళ్లారు. ఆమెకు నిద్ర పట్టడం లేదు. మనసులో రకరకాల ఆలోచనలు.

'భర్త మరణిస్తే భార్య వితంతువు రూపంలో ఉండాలా? లోకంలో ఎంతమంది పాత సంప్రదా

## చందమామ స్కెచ్ అదిరింది

*బాలీవుడ్‌లో స్టార్ హీరోయిన్ అనిపించుకోవాలని టాలీవుడ్ చందమామ కాజల్ అగర్వాల్ ఎప్పటి నుంచో ప్రయత్నిస్తూనే ఉంది. అవకాశం వచ్చినప్పుడల్లా అక్కడి హీరోలను కాకాపడుతూనే ఉంది. ఆమె ప్రయత్నాలేవీ పెద్దగా ఫలించలేదు. తాజాగా బాలీవుడ్ హీరో హృతిక్ రోషన్ భజన చేయడం మొదలెట్టింది కాజల్. తెలుగులో సూపర్ హిట్ అయిన 'మిస్టర్ పర్‌ఫెక్ట్' బాలీవుడ్‌లో రీమేక్ చేస్తే కచ్చితంగా బ్లాక్ బస్టర్ అవుతుంది అంటోంది కాజల్. ఆ రీమేక్ సినిమాలో ప్రభాస్ రోల్‌ను హృతిక్ చేస్తేనే న్యాయం జరుగుతుంది అని కూడా చెబుతోంది. ఈ సినిమాను బాలీవుడ్‌లో రీమేక్ చేసే ఆలోచన ఎవర్కైనా ఉందో లేదో తెలియదు గానీ, ఏ హీరో అయితే బాగుంటుందో ఎందుకు చెబుతోందో తెలియక కొందరు అయోమయానికి గురవుతున్నారట! అయితే ప్రస్తుతం కాజల్ చేతిలో ఒకే ఒక్క హిందీ సినిమా ఉంది. అదిపూర్తయ్యే లోపు మరికొన్ని అవకాశాలు దక్కించుకోవడానికే ఇలాంటి ట్రిక్కులు ప్లే చేస్తోందనీ, మొత్తానికి కాజల్ స్కెచ్ అదిరిందనీ బాలీవుడ్ జనాలు అంటున్నారు.*

**స్త్రీకి బొట్టు, కాటుక, గాజులు, పువ్వులు బాల్యం నుండీ వచ్చిన అందాలు, అలంకరణలే. భర్త మధ్యలో వస్తాడు. మధ్యలోనే మరణించవచ్చు. భర్తపోతే స్త్రీ బొట్టూ, గాజులకు ఎందుకు దూరం కావాలి? ఈ కథలో వందన తనకు నచ్చిన పని చేసింది. భర్త పోయినా బొట్టూ గాజులూ, చక్కటి చీరను వదిలిపెట్టలేదు. సమాజం ఆమెను ప్రశ్నించిందా? సమాజ కట్టుబాట్లను ఒక మనిషి పాటించాల్సిన అవసరం ఉందా?**

యాలను పక్కకు పెట్టి సమాజంలో మామూలు స్త్రీల మాదిరి తిరగడం లేదు' వందన ఆలోచిస్తోంది.

'తను మరొక్క అడుగు ముందుకు వేసి పువ్వులు, కుంకం కూడా వాడుతోంది. అది తప్పా?'

'అత్తవారి కుటుంబంలో ఎవరూ తనను పల్లెత్తు మాట మాట్లాడలేదు. పుట్టిన పుట్టింట్లో అభ్యంతరాలు ఎందుకు మొదలయ్యాయి?'

'తనకు సంబంధం లేని గాయత్రి వియ్యాల వారికి నా గొడవ ఎందుకు?'.

'నిజమే కుటుంబంలో నాలుగు గోడల మధ్య తను ఎలా ఉన్నా ఎవరికీ అభ్యంతరం లేదు. నలుగురిలోకి వెళ్లాలంటే అన్నీ ప్రతిబంధకాలేనా?'

'తన కోసం ఎవరు ఆలోచిస్తున్నారు? తన కోసం ఎంతో ఆరాటపడి ప్రేమగా చూసుకున్న సుబ్బారావు ప్రేమను పొందాను. తాను సుబ్బారావు బాగోగులు గురించి ఎందుకు ఎక్కువగా పట్టించుకోలేక పోయింది?'

వందనకు ఆలోచనలు సుడులుగా తిరుగుతున్నాయి. నిద్ర రావడం లేదు. మనసులో ఏదో అలజడి.

'చిన్నప్పటి నుండి తనను అందరూ గారంగా చూశారు. భర్త సుబ్బారావు కూడా తనను ఎంతో గారం చేశాడు. పిల్లలు పుట్టకపోయినా, ఎన్నడూ ఆ ప్రస్తావన చేయలేదు'.

'సుబ్బారావు మరణిస్తూ బోలెడంత డబ్బు తన పేర ఉంచాడు. అతని తరువాత అతని పెన్షన్ కూడా తనకు వస్తోంది. సుబ్బారావు తనకు ఇంత చేస్తే తను సుబ్బారావుకు ఏం చేసింది?'

తన మనసు ఎప్పుడూ ఈ కోణంలో ఆలోచించలేదు.

'సుబ్బారావు తనకు వదలిన డబ్బులో చాలా భాగం అక్క పిల్లలకు ఇచ్చింది. అత్తవారి వైపు వారికి ఎవ్వరికీ ఏమీ ఇవ్వలేదు. అక్క పిల్లలకు తన డబ్బు పనికి వచ్చింది. తను పనికి రాలేదు' వందనకు దుఃఖం ముంచుకొచ్చింది.

'తను అతిగా వస్త్రధారణ, సింగారం చేసుకోవడం తప్పా? తనకు భర్త లేడు. ఒంటరిగా జీవించలేదు. నలుగురితో కలిసిమెలిసి తిరుగుతుంటే బాధలు మరిచిపోవచ్చు. ఉత్సాహంగా జీవితం గడపవచ్చు.'

'తను బాధ పడుతుందని భావించి ఎవ్వరూ తన విషయంలో ఫలానాలా ఉండమని ఒత్తిడి చెయ్యలేదు'.

'నాకు నేనే ఆలోచించుకోవాలి. ఒంటరి జీవితమా? నలుగురితో కలిసి మెలిసి జీవించడమా?'

'సంఘ జీవనం కావాలంటే కట్టుబాట్లకు కట్టుబడి ఉండాలి' ఆలోచించి ఆలోచించి వందన అలసిపోయింది.

తెలియకుండానే నిద్ర పట్టేసింది.

•••

పెళ్ళివారు పెళ్ళి పూర్తి చేసుకుని కొత్త పెళ్లి కూతురుతో ఇంటికి వచ్చారు. తంతులన్నీ ఇంట్లో పూర్తయ్యాయి. 'పిన్ని' మేడ మీద ఉంది. గాయత్రి మనసు పిన్ని వైపు మళ్లింది.

కాఫీ, టిఫిన్‌లు పుచ్చుకుని గాయత్రి మేడ మీద గదిలోకి పిన్ని వద్దకు వెళ్లింది.

పిన్నిని చూసి గాయత్రి తెల్లబోయింది.

అక్కడక్కడ పలచగా పువ్వులు ఉన్న తెల్లచీర కట్టుకుంది. చేతులకున్న గాజులన్నీ తీసి వేసింది. రెండు చేతులకు రెండు బంగారు గాజులు వేసుకుంది. తల జుట్టు ముడి వేసుకుంది. ముఖాన నల్లని బొట్టు పెట్టుకుంది.

'పిన్నీ! కాఫీ, టిఫిన్ తీసుకువచ్చాను' అని గాయత్రి అక్కడ బల్ల మీద ఉంచింది.

'పెళ్ళి బాగా జరిగిందా?' పిన్ని అడిగింది.

'బాగానే జరిగింది' గాయత్రి అయోమయంగా పిన్నిని చూస్తూ జవాబు చెప్పింది.

'మీ తంతులన్నీ పూర్తి అయిన తరువాత నాకు పెళ్లి కూతుర్ని చూపిస్తారా?' పిన్ని మర్యాద పూరక స్వరంతోనే అంది.

'అదేమిటి పిన్నీ! తంతులతో సంబంధం ఏముంది. ముందుగా నీ ఆశీర్వాదం తీసుకున్న తరువాతనే మిగిలిన కార్యక్రమాలు' గాయత్రి చెప్పింది.

'మీ సంప్రదాయాల ప్రకారం చేయండి. నేను ఏమీ అనుకోను' వందన నెమ్మదిగా చెప్పింది.

'పిన్నీ! నీ వేషం, రూపం ఇలా మార్చేసుకున్నావేమిటి?' గాయత్రి భయపడుతూ అడిగింది.

'నా జీవితంలో ఇంతవరకూ అందరూ నన్ను ఎంతో అభిమానంగా చూశారు. ఆదరించారు. నా మంచి చెడ్డలను దృష్టిలో ఉంచుకుని నాకు ఏది కావాలో అది సమకూర్చేవారు తాతగారు. ఆ తరువాత బాబాయి. ఇప్పుడు మీ అమ్మ' వందన చెబుతోంది.

'అవును' గాయత్రి తలూపింది.

'నేను ఎప్పుడూ ఏ విషయం స్వతంత్రంగా ఆలోచించలేదు. ఎంత దగ్గర వాళ్లయినా కట్టుబాట్లకు భిన్నంగా ఉంటే అంగీకరించలేరని నా మనసు హెచ్చరించి చెప్పింది' వందన చెబుతోంది.

'మేము నిన్ను ఏమయినా బాధ పెట్టామా?' గాయత్రి హడలి పోతూ అడిగింది.

'లేదు. మనం మన కుటుంబంలో బ్రతకడం వేరు. సమాజంలో బ్రతకడం వేరు. మనిషి ఆరోగ్యంగా ఉండాలంటే సమాజంలో బ్రతకాలి. ఆ సమాజం కట్టుబాట్లకు కట్టుబడి ఉంటేనే సమాజంలో మనగలుగుతాం అన్పించింది' వందన చెప్పింది.

'అవును. నువ్వు చెప్పింది నిజమే' గాయత్రీ పిన్ని అభిప్రాయాన్ని సమర్థించింది.

'అందుకే నా వేషధారణ మార్చాను. నేను వితంతువును. అంటే భర్తను కోల్పోయిన స్త్రీని. ఆ విషయాన్ని మరుగున ఉంచే ప్రయత్నం మంచిది కాదని నా మనస్సు నన్ను హెచ్చరించింది. అందుకే ఇలా తయారయ్యాను' వందన వివరించి చెప్పింది.

'మనిషి మనసుకు తోచాలంటే కొన్ని సంఘటనలు ప్రేరణగా ఉంటాయి. పిన్ని మనసుకు నచ్చిన పని చేసింది' అనుకుంది గాయత్రి.

*సెల్: 98668 43982*

## నక్కతోక తొక్కిన మెహ్రీన్

టాలీవుడ్‌లో స్టార్ హీరోయిన్ అని పించుకున్న వాళ్ళు కూడా బాలీవుడ్‌లో ప్రవేశానికి ముప్పతిప్పలు పడుతూంటే, టాలీవుడ్‌లో ఒకే ఒక్క సినిమా చేసిన మెహ్రీన్‌కి మాత్రం బాలీవుడ్ నుంచి పిలుపు వచ్చేసిందట! అనుష్క శర్మ నిర్మాతగా చేస్తున్న రెండో సినిమాలో మెహ్రీన్‌కి అవకాశం వచ్చిందని అంటున్నారు. టాలీవుడ్‌లో కూడా మెహ్రీన్‌కి అవకాశాలు తలుపు తడుతున్నాయంటున్నారు. తాము ఎంత కష్టపడినా బాలీవుడ్‌లో అవకాశాలు రావడం కష్టంగా ఉంటే కొత్త పిల్లకి అప్పుడే అక్కడ ఛాన్సా? అంటూ దక్షిణాది సీనియర్ హీరోయిన్లు కొందరు అసూయతో రగిలిపోతున్నారట!





# కందుగాడి కాశీయాత్ర

## - శివసతీపురం శర్మ

9

సుబ్బారావు కెవ్వుమనడంతో చైతన్యం వచ్చినట్టుగా కదిలారంతా. వణికిపోతున్న అతన్ని గట్టిగా పట్టుకున్నారు. ఏమైంది? ఏమైంది? అంటూ అడిగారు. సమాధానంగా నీటిలో కొట్టుకుపోతున్న శవాన్ని చూపించాడు సుబ్బారావు. కళ్ళు గుంతలుగా ఉండి, చర్మం లేచొచ్చి, ఉబ్బిన శరీరంతో గంగలో కొట్టుకుపోతున్న శవాన్ని చూసి చేష్టలుడిగారంతా.

"ఇవన్నీ ఇక్కడ మామూలే! దీనికే భయపడితే ఎలా?" అడిగాడు మోహన్. కూర్చోండి! కూర్చోండన్నాడు. కూర్చున్నారంతా.

"చనిపోయే ముందు నారాయణ నారాయణ అంటూ నోట్లో గంగాజలం పోస్తే పుణ్యలోకాలు సిద్ధిస్తాయంటారు. అలాంటిది ఏకంగా గంగలోనే కొట్టుకుపోతోంది శవం. ఎన్ని పుణ్యలోకాలు సిద్ధిస్తాయో!" నవ్వాడు మోహన్.

"మీకు ఓ సంగతి తెలుసా? ఇక్కడ చనిపోయిన వారి చెవిలో సాక్షాత్తు ఆ శివుడే తారకమంత్రం ఉపదేశిస్తాట్ట." అన్నాడు మోహన్.

మిత్రబృందం అతని మాటలు వింటున్నదంతే! ప్రశ్నించడం లేదేదీ.

"చనిపోయిన వారికి ముక్తీ, మోక్షమూ లభించాలంటే వారి అస్థికలుగానీ, చితాభస్మంగానీ ఈ గంగలో కలపాల్సిందే! తప్పదంటారు." అన్నాడు మోహన్. వాణి వెంటనే అందుకుంది.

"మా వారి అస్థికలు నిమజ్జనం చెయ్యాలి, ఎప్పుడు చేద్దాం?"

"రేపు చేద్దాం లెండి! రాత్రి అవన్నీ వివరంగా మాట్లాడుకుందాం." అన్నాడు మోహన్.

"అదిగో! ఆ రెడ్ కలర్ బిల్డింగ్‌నే హీరో చిరంజీవి పదిహేను కోట్లు పెట్టి కొన్నాడు." అన్నాడు పడవ నడిపే కుర్రాడు. కనుసైగలతో ఆ బిల్డింగ్‌ని చూపించాడు.

"అన్ని కోట్లు పోసి ఇక్కడీ బిల్డింగ్ దేనికి? ఏం వస్తుందని?" అడిగాడు కందు.

"అది హోటలండీ! ఆయన కొని ఉండరు. లీజుకు తీసుకుని ఉంటారు. ఈ మాట కూడా అనుమానమే! రకరకాల వార్తలు ప్రచారంలో ఉన్నాయి." అన్నాడు మోహన్.

"ఇంద్ర సినిమా అంతా ఈ ఘాట్లమీదే తీశారు." చెప్పాడు కుర్రాడు.

అంతా ఆ సినిమా ముచ్చట్లలో పడ్డారు. ఆసరికి కాస్తంతగా సుబ్బారావుసహా తేరుకున్నారంతా.

గంగాహారతి ఇంకా ప్రారంభం కాలేదు. వేదికకు అభిముఖంగా గంగలో పడవల్లో ప్రేక్షకులంతా కూర్చుని ఉన్నారు. వందలాది పడవల్లో వేలాది ప్రేక్షకులు కిక్కిరిసి ఉన్నారు. వారిని దాటుకుని ముందుకు నడిచింది పడవ. హరిశ్చంద్రఘాట్‌కి చేరుకుంది. కాలుతున్న శవాలను చూశాడక్కడ సుబ్బారావు.

"మళ్ళీ ఇదేంటి?" అడిగాడు.

"దీనినే హరిశ్చంద్రఘాట్ అంటారు. ఇక్కడ కూడా శవదహనాలు జరుగుతాయి. అయితే మణికర్ణికాఘాట్‌లో రాత్రింబవళ్ళు జరిగినట్టుగా ఇక్కడ శవదహనాలు జరగవు." అన్నాడు మోహన్.

"హరిశ్చంద్రుని కథ తెలుసుకదా! ఈ శ్మశానంలోనే హరిశ్చంద్రుడు కాటికాపరిగా పని చేశాడు." అన్నాడు అంతలోనే! పడవని కొద్దిగా ముందుకు పోనిచ్చి ఆపమన్నాడు మోహన్. ఆపాడు కుర్రాడు.

"దిగండి! దేవుణ్ణి దర్శించుకుని వద్దాం." అన్నాడు.

"ఏ దేవుడు?" అడిగాడు డాక్టర్‌బాబు.

"కేదారేశ్వర్" చెప్పాడు మోహన్.

"పదండిరా, ఇక్కడి ఈ ఘాట్లలో శ్మశానాలే తప్ప దేవుణ్ణి చూసింది లేదు. ఓ దేవుణ్ణి చూసుకుందాం." అన్నాడు సుబ్బారావు. ఒకరి చేయి పట్టుకుని ఒకరుగా అంతా పడవ దిగారు. అక్కణ్ణుంచి పైకి చూశారు. పెద్దపెద్ద మెట్లు వందో యాభయ్యో ఉన్నాయి. ఆపైన ఆలయం ఉంది.

"రండి రండి" అన్నాడు మోహన్. మెట్లెక్కసాగాడు. అతన్ని అంతా అనుసరించారు.

కేదారేశ్వరాలయానికి చేరుకున్నారు. పురాతన ఆలయం. జీర్ణోద్ధరణ జరిగినట్టుగా లేదు. పెచ్చులూడొచ్చిన గోడలతో, గుంతలు పడ్డ గచ్చులతో బీద బీదగా ఉంది. శుభ్రత లేదస్సలు.

దేవుణ్ణి దర్శించుకున్నారంతా. వెను తిరిగి వస్తూ ఉంటే...ఆలయంలో ఓ మూల నిల్చున్న సీతమ్మగారిని పరిచయం చేశాడు మోహన్.

"సీతమ్మగారని...కాశీవాసి. మన తెలుగావిడే." అన్నాడు మోహన్.

సుమారుగా ఎనభై ఏళ్ళుంటాయి ఆమెకు. వితంతువు. ఆమెకు నమస్కరించారంతా. పరిచయాలయ్యాయి.

"ఏం సాధిద్దామని ఇక్కడ ఒంటరిగా ఉంటున్నారు?" అడిగాడు కందు.

"మోక్షం" అంది సీతమ్మ.

"అంటే?" అర్థం కానట్టుగా అడిగాడు డాక్టర్ బాబు.

"కైవల్యం" అని నవ్వింది ఆమె.

"అంటే" మళ్ళీ అడిగాడు కందు.

"అంటే...స్వస్వరూపానంద ఆవిర్భావం." అంది సీతమ్మ.

ఒక్క ముక్క అర్థమైతే ఒట్టు అన్నట్టుగా జాలిగా చూశాడామెను సుబ్బారావు. అతని స్థితిని గమనించినట్టున్నాడు దగ్గరగా ఉన్న బైరాగి.





నవ్వుతూ అన్నాడిలా.

"ముక్తి, మోక్షం, కైవల్యం అంటే...మీకు తెలిసిన భాషలో చెప్పాలంటే...దటీజ్ ఎటర్నల్ బ్లిస్ ఆర్ హ్యాపీనెస్."

ఆంగ్లంలో మాట్లాడుతోంటే ఆశ్చర్యంగా చూశారతన్ని.

"ఇంకో మాటగా చెప్పాలంటే...ఎక్జంప్షన్ ఫ్రం సిన్ అండ్ పనిష్మెంట్." అని నవ్వాడాయన.

"ఓకే ఓకే" అన్నాడు డాక్టర్‌బాబు. ఆయన ఇంగ్లీషులో మాట్లాడడం, ఆయనలోని తేజస్సూ బాబుకి నచ్చాయేమో! జేబులోంచి పర్సు తీసి, ఆయనకి ఓ వంద రూపాయలు ఇవ్వబోయాడు.

"వద్దుబాబు! నేను బైరాగిని కాని, బిచ్చగాణ్ణి కాదు." అన్నాడాయన. వెళ్ళిపోయాడు అక్కణ్ణుంచి.

సీతమ్మ దగ్గర సెలవు తీసుకుని, మిత్రబృందం కూడా ముందుకు కదిలింది. వెళ్తోన్న ఆ బృందాన్ని చూస్తూ సన్నగా నవ్వుకుంది సీతమ్మ.

మెట్లు దిగి కిందికి వస్తోంటే...జై గంగే మాతా! జైజై గంగే మాతా! అని పాట వినవచ్చింది.

"హారతి స్టార్టయింది, పదండి పదండి." అని తొందర చేశాడు మోహన్. గబగబా మెట్లు దిగి, పడవ చేరుకున్నారంతా. పడవ నడిపే కుర్రాడితో పోనీయమంటూ తొందర చేశారు.

"కంగారేం అక్కరలేదు. హారతి అరగంటపాటు సాగుతుంది." అన్నాడు మోహన్.

ఘాట్‌లన్నీ దీపాలతో వెలిగిపోతున్నాయి. పాటలతో పరవశించిపోతున్నాయి. శంఖధ్వని చెలరేగుతోంది. ఢమరుకనాదం జలదరిస్తోంది.

**నీటిని దేవతను చేసి ఆమెకు పూజలు చేయడం గొప్ప సంస్కారం అంటూ చేతులెత్తి నమస్కరించాడు కంఠు. అక్కడి నుండి బయలుదేరింది మిత్రబృందం. రిలాక్స్‌డ్‌గా, సరదాగా సిగరెట్ తాగుదామా? అడిగాడు మోహన్. నేను రెడీ అంది వాణి. అతడామెను ఆశ్చర్యంగా చూశాడు. ఎందుకంత ఆశ్చర్యం? నేను మందు కూడా తాగుతాను అంది వాణి. మోహన్‌కి నోట మాట రాలేదు! ఇంతకూ ఆమె అన్నది ఏ మందు గురించి?**

గంటలు గణగణమంటోంటే, గలగలమంటోంది గంగ. తెలియని తన్మయత్వం. చెప్పలేని సంతోషం. బలే ఉందంటే...బలే ఉందంటూ హారతి వేదికకు అభిముఖంగా చేరారంతా. ఒక అద్భుతాన్నీ, ఒక ఆనందాన్నీ కళ్ళ నిండుగా చూసుకోండి అన్నట్టుగా పడవను అక్కడ నిలిపి వేశాడు కుర్రాడు.

పట్టుపంచెలు, పట్టుఉత్తరీయాలు, ఎరుపు రంగు స్వెట్టర్లు, చేతిలో హారతిదివ్వెలు, కళ్ళల్లో భక్తిప్రపత్తులు...చూడముచ్చటగా ఉన్నారు పండిట్‌లు. వారి వెనుకగా సంప్రదాయసిద్ధంగా ఉండి, వీవనలు వీస్తున్నారు యువతులు.

హారతులూ, చల్లని గాలులూ గుండెల్లో పొదువుకుని గంగామాత గంభీరంగా సాగిపోతోంది. అద్దంలా ప్రతిఫలిస్తోంది.

నిత్యావసరమైన నీటిని దేవతను చేసి, ఆమెకు పూజలు చేయడం, ధూప దీప నైవేద్యాలు సమర్పించడం గొప్ప సంస్కారం. ఆ సంస్కారానికి చేతులెత్తి నమస్కరించాడు కంఠు.

హారతి పూర్తి అయింది. పడవ దిగి, పండిట్‌ల దగ్గర అక్షతలు తీసుకున్నారంతా. వాటిని శిరసున ధరించారు. పడవ కుర్రాడికి పదిహేనువందలు చెల్లించాడు బాబు.

"మనం మాట్లాడింది మనిషికి రెండొందలే" అన్నాడు మోహన్.

"కదా! కుర్రాడితో కలిపి ఏడుగురం. నేను వందే ఎగస్ట్రా ఇచ్చాను." అన్నాడు బాబు. నిర్మల నవ్వింది ఆ మాటకి.

అంతా లాడ్జింగ్‌కేసి నడిచారు.

"రిలాక్స్‌డ్‌గా, సరదాగా సిగరెట్లు తాగుదామా?" అడిగాడు మోహన్.

"నేను రెడీ" అంది వాణి. చెయ్యెత్తింది. మోహన్ ఆశ్చర్యంగా చూశాడామెను.

"ఎందుకంత ఆశ్చర్యం? నేను మందు కూడా తాగుతాను." అంది వాణి.

మోహన్‌కి నోట మాట లేదు.

"దగ్గు మందు లెండి." సర్దిజెప్పజూశాడు డాక్టర్‌బాబు.

"ఏం కాదు, విస్కీ, రమ్, జిన్, వైన్...అన్నట్టు మా కంఠుగాడికి రెడ్‌వైనంటే ఇష్టం. ఇక్కడ దొరుకుతుందా?" అడిగింది వాణి.

"రెచ్చిపోకే తల్లీ! నీకో నమస్కారం." అన్నాడు కంఠు. వాణికి నమస్కారం చేశాడు. అతనలా నమస్కరిస్తుంటే దీవిస్తూ నిల్చుంది వాణి.

ఆ దృశ్యాన్ని చూసి నవ్వుకున్నారంతా.

"ఏదన్నా తినేసి లాడ్జికి వెళ్ళిపోవడం బెటర్. ఏఁవంటారు?" అడిగాడు సుబ్బారావు.

"అయ్యర్ హోటల్‌కి వెళ్దాం! ఇడ్లీ దోశె లాంటివి తిందాం." అంది నిర్మల.

"పదండైతే" అన్నాడు మోహన్.

అయ్యర్ హోటల్ లాడ్జీకి దగ్గరగానే ఉంది. అయితే రోడ్డు మీద లేదు. కొద్దిగా లోపలికి ఉంది. వెళ్ళారక్కడికి. కూర్చున్నారు. టిఫిన్లేవీ లేవన్నాడు అయ్యర్. భోజనం మాత్రమే ఉందన్నాడు. అదే ఆర్డర్ చేసి, వెయిట్ చేయసాగారు.

అంతలో సైరన్‌లా చంటిపిల్ల ఏడుపు వినవచ్చింది. విన్న గొంతులా అనిపించింది. వెనక్కి తిరిగి చూశాడు కంఠు. భూతాలపంతులూ, అతని భార్యా కనిపించారు. పాపకి పాలుపడుతోంది భార్య.

"అయ్యయ్యో! పాలు వేడిగా ఉన్నట్టున్నాయి." అందామె. గ్లాసులోని పాలను చల్లబరిచేందుకు నోటితో వాటిని ఊదుతోంది. పాపనీ, పాలనూ చూస్తున్నాడు భూతాలపంతులు. చుట్టుపక్కలెవరినీ పట్టించుకోవట్లేదతను. భూతాలపంతుల్నీ, అతని భార్యనీ చూసి గొంతులో వెలక్కాయపడినట్టుగా గాలిని మింగుతున్న కంఠుకి, మరో పక్క ఆ పిల్ల అసలు తల్లీ, ఆమె తండ్రీ కూర్చుని భోజనం చేస్తూ కనిపించడం మరింత ఉత్కంఠ రేకెత్తించింది.

పిల్ల గొంతును తను గుర్తుపట్టాడు. కన్నతల్లి గుర్తుపట్టలేకపోయిందా? ఒకవేళ గుర్తుపట్టినా గుర్తుపట్టనట్టుగా ప్రవర్తిస్తోందా? అయోమయంలో పడ్డాడు కంఠు. తల వంచుకుని గబగబా పెద్ద పెద్ద ముద్దలు మింగుతున్న తల్లికి పొలమారిందేమో! తలెత్తి దగ్గిందామె. నోటిలోని ఆహారం బయటికి తుళ్ళకుండా చేతిని అడ్డు పెట్టుకుంది. ఆపుకుంది. అయితే ఆమె కళ్ళల్లో గంగాప్రవాహాన్ని ఎవరాపగలరు? ప్రవహిస్తున్న కన్నీరు ఆమె చెంపలు మీద ధారలు కట్టింది.

*(సశేషం)*




**"ఆ ప్రాణాపాయ సమయంలో ఆ సింహగాయత్రి మంత్రం జపించాను. నేను ఊహించని విధంగా ఆ తల్లి నన్ను రక్షించింది! కాదు ఇప్పుడు ఈ స్థితిలో ఉన్నందుకు కారణం ఆ దేవతే!" వీరధర్మ వివరించాడు.**

**"సింహగాయత్రి అనే మంత్రం ఉందా నాయనా? నీకు ఎక్కడ లభించింది?" మహారాణి ఆశ్చర్యంగా అడిగింది.**

**"అది నా మాతృమూర్తికి సంబంధించిన గాథ..."**



"అభ్యంతరం లేకపోతే వినిపించు, వీరధర్మా!" మహారాణి అడిగింది.

"అది రహస్యమూ కాదు; అభ్యంతరమూ లేదు. మహారాజమాతా! ఆలకించండి. నాది వైశాలిక నగరం. మాది వీరతిలక వంశం. నేను హేమాంగినీ ధర్మవీర దంపతుల ఏకైక పుత్రుడిని..." వీరధర్మ చెప్పసాగాడు.

•••

మహారాణీ, రాజూ ఆసక్తిగా విన్నారు.

"వివాహం చేసుకుని స్థిరపడాల్సిన వయసులో కష్టాలు ఎదుర్కొన్నావు. సాహస కార్యాలు చేశావు నాయనా!" మందిరాదేవి మెచ్చుకుంది.

"ఈ ప్రాంతానికి ఎందుకు వచ్చావు వీరధర్మా?" ధీరేంద్ర మహారాజు అడిగాడు.

"అమ్మ పరమపదించింది. ఆమె ఆత్మశాంతి కోసం ప్రార్థిస్తూ, నా మనశ్శాంతి కోసం ప్రయత్నిస్తూ, ప్రయాణం సాగిస్తూ ఇక్కడికి చేరుకున్నాను..." వీరధర్మ నర్మగర్భంగా అన్నాడు.

"వీరధర్మా, నిన్ను రాజ్యరక్షకుడుగా నియమించుకోవాలని ధీరేంద్రుడు ఆశిస్తున్నాడు" మందిరాదేవి అంది.

"రాజ్యరక్షకుడా? సేనాపతి ఉన్నారుగా మాతా?"

"నిన్ను దృష్టిలో ఉంచుకుని 'రాజ్యరక్షకుడు' అనే పదవిని నూతనంగా సృష్టించాను, మిత్రమా!" ధీరేంద్రుడు స్నేహభావనతో ఏకవచనంలో అన్నాడు.

పదవి! మరొక అవకాశం! మరొక ఆహ్వానం! మొదట వజ్రగిరి మహారాజుగారి ఆహ్వానం. అనంతరం వైశాలిక యువరాణి సాగరిక ఆహ్వానం. ఇప్పుడు ధీరేంద్ర మహారాజు ఆహ్వానం! తన

### జరిగిన కథ

వైశాలిక నగర యోధుడు వీరధర్మ. రాజపరివారం కుట్రవల్ల కన్నతల్లిని పోగొట్టుకుంటాడతడు. తిరిగి వారికి తగినశాస్తి చేస్తాడు. సంపూర్ణాయుస్సు సాధించే లక్ష్యంతో బయలుదేరతాడు. మార్గాంతరంలో ఎన్నో కష్టాలు, అనుభవాలు చవి చూస్తూ చివరకు శ్వేత మరాళ మార్గదర్శనంతో పర్వతశిఖరంపై వున్న తాపసి చిరంతనయోగిని ప్రసన్నం చేసుకుంటాడు. యోగి ద్వారా మరణ రహస్యం గ్రహించి పునరాలోచనలో పడతాడు. మదగజనగరంలో వృద్ధ దంపతుల కుమార్తెలను రాజు చెర నుండి విడిపించే యత్నంలో మరణ శిక్షకు గురవుతాడు. సింహగాయత్రీమంత్ర ప్రభావం వల్ల జీవంతకుడు అంతమవుతాడు. ప్రజలు దుష్పరిపాలన నుండి విముక్తులై ధీరేంద్రుడు రాజుగా పట్టాభిషిక్తుడవుతాడు. వీరధర్మ ఇచ్చిన మాట ప్రకారం గిరిజ, గిరిక చెర విముక్తులవుతారు.

ఆ తర్వాత....

## నవ్యవీక్లీ-లక్ష్మీనారాయణ జైని మెమోరియల్ ఛారిటబుల్ ట్రస్ట్ సంయుక్త నిర్వహణలో

# ప్రథమ బహుమతి రూ.50,000 పొందిన నవల

శౌర్య పరాక్రమాలు అందరికీ కావాలి! కానీ తనకు వేరొకటి కావాలి. మరణరాహిత్యం! వీరధర్మ చిరునవ్వు నవ్వుకున్నాడు. వీళ్ళు ఇస్తామన్న పదవులు అశాశ్వతం. తాను ఆశిస్తున్న పదవి శాశ్వతం! వీరధర్మ ధీరేంద్రుడినీ, మందిరాదేవినీ వినయంగా చూశాడు.

"మీరు ప్రతిపాదించిన విషయం ఒక అవకాశం మాత్రమే కాదు! నాకు గొప్ప గౌరవం! నేను... ఒక లక్ష్య సాధనకు సంకల్పించాను. సంకల్పాన్ని సాకారం చేసుకుంటానని ప్రతిజ్ఞ చేశాను. ఆ సంకల్పం సిద్ధించేదాకా ఏ పదవినీ, ఏ బాధ్యతనూ స్వీకరించలేను. చివరికి వివాహం కూడా చేసుకోను. మహారాజుగారూ, రాజమాతగారూ నన్ను క్షమించాలి. రాజమాత గారి ఆజ్ఞ పట్టాభిషేక మహోత్సవం దాకా నన్ను ఆపింది...."

"ఏమిటి నాయనా, నీ సంకల్పం?" మందిరాదేవి అడిగింది. "చెప్పు, మేం సహాయపడగలమేమో ఆలోచిస్తాం."

వీరధర్మ చిరునవ్వు నవ్వాడు. "నిజం చెప్తున్నాను. దయచేసి నమ్మండి. నా సంకల్పం కేవలం దైవాధీనం. మీకు నా సంకల్పాన్ని వివరించలేను కూడా! అందుకు నన్ను మన్నించాలి."

మందిరాదేవి వీరధర్మను నిదానించి చూసింది. "సరే నాయనా...సంకల్ప సిద్ధిరస్తు! అని దీవిస్తాను!"

వీరధర్మ ఆమెకి నమస్కరించాడు.

ధీరేంద్రుడు వీరధర్మ దగ్గరగా వెళ్ళాడు. తన మెడలోని ముత్యాల హారం తీసి, వీరధర్మ మెడలో వేశాడు.

"నిరాకరించకు మిత్రమా! ఇది పారితోషికం కాదు; చిన్నపాటి జ్ఞాపిక!"

వీరధర్మ చిరునవ్వుతో తల ఆడించాడు.

పరిచారిక జలజ లోపలకి వచ్చి వినయంగా తలవాల్చి నిలుచుంది. "మహారాజులకు మనవి....గురుదేవులు మార్తాండుల వారు వేంచేసి ఉన్నారు."



మహారాజు ధీరేంద్రుడు వేగంగా నడుస్తూ ద్వారం వైపు వెళ్ళాడు. ద్వారాన్ని దాటి, క్షణంలో తన గురుదేవుడిని సవినయంగా లోపలికి ఆహ్వానించి తీసుకు వస్తున్నాడు. వీరధర్మ పట్టాభిషేక సందర్భంలో ఆయనను చూసి ఉన్నాడు. ఎత్తైన భారీ శరీరం....ఎర్రటి వర్ణం...నున్నగా గీచిన గుండు...నుదురు మీద విబూది రేఖలు.. మార్తాండుల ముఖంలో, కళ్ళల్లో జ్ఞానం వెల్తురులా వెలికి చిమ్ముతున్నట్టుంది. స్వచ్ఛమైన శ్వేత వస్త్రాలలో ప్రత్యేకంగా అవుపిస్తున్నాడాయన. వివిధ పరిమాణాలలో ఆయన కంఠం నుండీ కిందికి జారిన రుద్రాక్షమాలలు. చెవులకు బంగారు పోగులు..ఎర్రటి శరీరం మీద తెల్లటి గీతలా మెరుస్తున్న యజ్ఞోపవీతం... మార్తాండులు ధీరేంద్రులకు యుద్ధ విద్యలు కూడా నేర్పినట్టు మందిరాదేవిగారు అన్నారు! ఇదం బ్రాహ్మం; ఇదం క్షాత్రమా?

"వీరధర్మా, మా గురుదేవులు మార్తాండ మహాశయులు.." ధీరేంద్ర మహారాజు సగర్వంగా పరిచయం చేశాడు. ధీరేంద్రుడు చూపిన ఆసనం మీద కూర్చున్నాడు మార్తాండుడు.

"గురుదేవా...వీరధర్మ...మహావీరుడు...ఇతని గురించి..."

"రాజమాతగారూ, నువ్వూ, మహామంత్రీ, రాజగురువూ అందరూ చెప్పారు నాయనా! వీర ధర్మ సాహసాలూ, అద్భుతాలూ నాకు తెలిశాయి!" మార్తాండుడు చిరునవ్వుతో అన్నాడు.

రాజమాత ఆయనను పలకరింపుగా చూస్తూ, చిరునవ్వు నవ్వింది.

వీరధర్మ మార్తాండుడి ముందుకు జరిగి వినయంగా చూశాడు. "వీరతిలక వంశస్థుడూ, హేమాంగినీ ధర్మవీర దంపతుల ఏకైక పుత్రుడూ అయిన వీరధర్మ నమస్కరిస్తున్నాడు!" అంటూ వంగి, ఆయన పాదాలను తాకి కళ్ళకు అద్దుకున్నాడు.

"శతాయుష్మాన్ భవ!" మార్తాండుడి గంభీర కంఠం ధ్వనించింది. "సింహగాయత్రీదేవిని ప్రసన్నం చేసుకున్న నీ జన్మ ధన్యం నాయనా! పావనమూ, ప్రభావవంతమూ అయిన మహా సింహ గాయత్రీ మంత్ర ద్రష్ట అయిన నీ గురువుగారికి జోహారు!"

"ధన్యుణ్ణి గురుదేవా!" వీరధర్మ వినయంగా అన్నాడు.

మార్తాండుడు ధీరేంద్రుడి వైపు చూశాడు. "నాయనా, రాజమాత సమక్షంలో నీతో ఒక ఆంతరంగిక అంశం చర్చించాలి.."

"అలాగే.." అంటూ ధీరేంద్ర మహారాజు ఏనుగు బొమ్మ తొండం ఎత్తి పట్టుకున్న కంచు జేగంటను, ఏనుగు బొమ్మ చెవి మీద ఇరుక్కున్న చిన్న కొయ్య సుత్తితో స్పృశించాడు. జేగంట ఖంగుమంది.

ఇద్దరు భటులు ప్రవేశించారు. "విజయోస్తు ప్రభూ!"

**నీవంటి శౌర్యపరాక్రమవంతుడు మా రాజ్య సంరక్షకుడు కావాలి, నిన్ను ఆ పదవిలో నియమించుకోవాలని రాజు ధీరేంద్రుడు ఆశిస్తున్నాడని చెప్పింది రాజమాత. ఆ పదవిని చిరునవ్వుతో తిరస్కరించాడు వీరధర్మ. అతడికి గతం గుర్తుకు వచ్చింది. వజ్రగిరి మహారాజు ఇవ్వజూపిన పదవి, వైశాలిక మహారాణి సాగరిక ఇవ్వజూపిన పదవి అన్నిటినీ అతడు తిరస్కరించాడు. ఇప్పుడతని పయనం ఎటు?**

"మన వీరధర్ముల వారిని, సాదరంగా రథం మీద తీసుకువెళ్ళి ఆనందుడి ఇంటి వద్ద దింపి రండి!"

"ఆజ్ఞ ప్రభూ!"

ధీరేంద్రుడు వీరధర్మ వైపు చిరునవ్వుతో సాభిప్రాయంగా చూస్తూ, అతని చేతిని ఆప్యాయంగా పట్టుకున్నాడు. "మిత్రమా...మనం మళ్ళీ కలుసుకుంటున్నాం..?"

"మహారాజా..?"

"కాదనవద్దు. ఒకటి రెండురోజులు నీతో ఆనందంగా గడపాలి! మా ప్రభు నిన్ను ఇప్పుడప్పుడే వెళ్ళనివ్వడు! స్వల్పకాలమే!" ధీరేంద్రుడు చిరునవ్వుతో అన్నాడు.

"అలాగే.." వీరధర్మ చిరునవ్వు నవ్వి, అందరి వైపూ నమస్కరించి, ద్వారం వైపు నడిచాడు.

•••

ఎవరో తలుపు తట్టుతున్నారు. ఆనందుడు లేచి వెళ్ళి తలుపు తెరిచి, గుమ్మంలో నిలుచున్న రాజభటుడి వైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఏం నాయనా?"

"మహామంత్రిగారూ, రాజగురువుగారూ, ధీరేంద్ర మహారాజు వారి గురుదేవులు మార్తాండుల వారూ విచ్చేస్తున్నారు..." భటుడు వినయంగా అన్నాడు.

"ఎక్కడికి?" ఆనందుడు అర్థం కానట్టు చూశాడు.

"ఇక్కడికే, తమ ఇంటికే!" భటుడు అన్నాడు. "మీకు వర్తమానం అందజేయమన్నారు."

వినయంగా తలవాల్చి వెనుదిరిగి వెళ్ళిపోతున్న భటుడిని నోరు వెళ్ళబెట్టి చూస్తూ ఉండిపోయాడు ఆనందుడు. పెద్దలు ముగ్గురూ తన ఇంటికి ఎందుకు విచ్చేస్తున్నారు? వీరధర్మ కోసం కావచ్చు! రాజ మందిరంలో జరిగిందంతా వీరధర్మ వివరించాడు తనకూ, భార్యకూ, పిల్లలకూ. రాజ్యరక్షక పదవిని తాను వినయంగా తిరస్కరించిన విషయం కూడా చెప్పాడు. వీరధర్మను బలవంతం చేసి, అంగీకరింపజేయడానికి వస్తున్నట్టుంది వాళ్ళు.

ఆనందుడు ఇంట్లోకి వెళ్ళి రాజప్రాసాదం



## చిన్నతనంలో ఇలా ఉండేది కాదట!

టాలీవుడ్‌లో ప్రస్తుతం రాశీఖన్నా హవా నడుస్తోంది. ఆమె సినిమాలు హిట్ అయినా ఫట్ అయినా పట్టించుకోకుండా దర్శకనిర్మాతలు ఆమెకు అవకాశాలు ఇస్తూనే ఉన్నారు. అందుకు కారణం ఆమె అందమే! ఈ విషయాన్ని రాశీ కూడా అంగీకరిస్తోంది. ఇప్పుడంటే నాజూకుగా ఉన్నాను కానీ, చదువుకునేరోజుల్లో చాలా బొద్దుగా ఉండేదాన్ని. అబ్బాయిలు ఎవరూ నన్ను చూడడానికి కూడా ఇష్టపడేవారు కాదు. ఎప్పుడైతే సినిమాల్లోకి రావాలని ఫిక్స్ అయ్యానో అప్పుడే సన్నబడడం మొదలెట్టాను అంటూ ఇటీవల ఓ ఇంటర్వ్యూలో చెప్పుకొచ్చింది.

నుండీ ముగ్గురు పెద్దలు విచ్చేస్తున్న వార్త అందరికీ తెలియజేసి, మళ్ళీ ప్రధాన ద్వారం వద్దకు చేరుకున్నాడు ఆహ్వానం పలకడానికి...

కాస్సేపట్లో రథం వచ్చి ప్రధాన ద్వారం ముందు ఆగింది. మహామంత్రీ, రాజగురువూ, మార్తాండ మహాశయుడూ దిగారు. ఆనందుడు వాళ్ళకు వినయవిధేయతలతో నమస్కరించి, స్వాగతం పలికాడు.

'దయచేయండి; దయచేయండి!"

"ఆనందా, కుశలమా?" మార్తాండుడు చిరునవ్వుతో అడిగాడు.

"తమ ఆశీస్సు! ఎంత కాలమైంది తమరిని దర్శించి?" ఆనందుడు ఆదరణపూర్వకంగా అన్నాడు. అందరూ ఇంట్లోకి ప్రవేశించారు.

గృహమధ్యంలో ఆసనాల మీద కూర్చున్న ముగ్గురికీ పూర్ణమ్మా, గిరిజా, గిరికా నమస్కారాలు చేశారు.

"ఆనందా, వీరధర్మా, కూర్చోండి!" ఇంకా నిలుచునే ఉన్న ఇద్దరినీ చూస్తూ అన్నాడు మహామంత్రి.

"ఆర్యుల ముందా?" ఆనందుడు మర్యాదగా అన్నాడు.

"వయోవృద్ధుడివి. మా ముగ్గురికన్నా పెద్దవాడివి! కూర్చో ఆనందుడూ!" రాజగురువు అన్నాడు. "ధర్మా, నువ్వు కూడా కూర్చో నాయనా!"

ఇద్దరూ కూర్చున్నారు. "అతి సామాన్య గృహస్థుడి ఇంటిని పావనం చేశారు. తమకు..." ఆనందుడు ఆగాడు.

"కోరిన మర్యాదలు అడిగి, అందుకోవడానికే వచ్చాం, ఆనందా!" మహామంత్రి అన్నాడు.

"ఆర్యా, ఆనందుడికి విషయం చెప్పండి!" మార్తాండుడు రాజ గురువును చూస్తూ అన్నాడు. "కుల బ్రాహ్మలు కద!"

"అవశ్యం!" రాజగురువు నవ్వాడు. ఆనందుడి వైపు తదేకంగా చూశాడు. "ఆనందా, వీరుడూ, మీ కుటుంబానికి ఆత్మీయుడూ అయిన వీరధర్మ సమక్షంలో ఒక ముఖ్యమైన విషయం ప్రస్తావించమన్నారు నిన్నటి మహారాణి, నేటి రాజమాత మందిరా దేవిగారు.."

"అలాగా! సెలవీయండి!" ఆనందుడు ఆశ్చర్యాన్ని దిగమింగుతూ అన్నాడు.

"మీ కవల కుమార్తెలను తమ కోడళ్ళుగా చేసుకోవాలని మందిరాదేవిగారు అభిలషిస్తున్నారు.." రాజగురువు అన్నాడు.

ఆయన మాట ఆ ఇంట్లోని వాతావరణాన్ని ఆశ్చర్యంతో గడ్డ కట్టించింది. ఆనందుడూ, ఆయన భార్య మాటలు మరిచిపోయి, శ్వాసక్రియను అసంకల్పితంగా అరికట్టి ఒకర్నొకరు చూసుకుంటూ ఉండిపోయారు. గిరిజా, గిరికా దేవశిల్పి విశ్వకర్మ అందమైన శిలతో రూపొందించిన ఆశ్చర్యప్రతిమల్లా అయిపోయారు! వీరధర్మ తన చెవులను నమ్మలేనట్టు ఆ నలుగురినీ చూస్తూ ఉండిపోయాడు.

ముందుగా ఆనందుడు తేరుకున్నాడు. మెల్లగా, ఆసనం మీద నుండి లేచాడు. "ఆర్యా, తమరు ఏమన్నారు? నేను...నేను...ఏమి విన్నాను...?"

వణుకుతున్న కంఠంతో ప్రశ్నించిన ఆనందుడిని రాజగురువు చిరునవ్వుతో చూశాడు. "నీ కుమార్తెలను ధీరేంద్ర మహారాజుగారి పట్టమహిషులుగా చేయాలని రాజమాత మందిరా దేవి వారు కోరుతున్నారు. ఆ ప్రతిపాదన చేయడానికి మమ్మల్ని పంపించారు."

"....తమరి ద్వారా రాజమాతగారు నాకు అందిస్తున్నది నేను కలలో పట్టుకోలేనంత, నేను మ్రింగలేనంత, జీర్ణం చేసుకోలేనంత పెద్ద ముద్ద..." ఆనందుడు తడబడుతూ అన్నాడు.

"అలా అనుకుని నిన్ను నువ్వు చులకన చేసుకోవద్దు. నీకు ఏం తక్కువ, ఆనందా? నువ్వు సుక్షత్రియుడివే. గతంలో అశ్వ శిక్షకుడిగా కొలువు చేసిన వాడివే. గౌరవ మర్యాదలతో జీవిస్తున్న వాడివే!" మహామంత్రి అన్నాడు. "ఒక రాజు మరొకరాజుగారి పుత్రికలనే స్వీకరించాలన్న నియమం ఏమీ లేదు. నీకు చరిత్ర తెలుసు!"

"ఆనందా, సౌభాగ్యవతులు గిరిజా, గిరికల మాట తీరు, నడక; నడవడిక, అందచందాలు అన్నీ మందిరాదేవిగారి మనసును దోచుకున్నాయి. సహజమైన, సున్నితమైన నేలబారు వాతావరణంలో నీ కుమార్తెలను పెంచారు మీ దంపతులు. నీవు లేదనుకుంటున్న అంతస్తునూ, ఐశ్వర్యాన్నీ, అర్హతనూ నీ పుత్రికల పెంపకం జరిగిన తీరు పూరిస్తోంది. రాజమాత ప్రతిపాదన మా అందరికీ నచ్చింది!" రాజగురువు ధైర్యం చెప్తూ అన్నాడు.

"ఆనందుడూ, నీకొక సత్యం చెప్పనా?" మార్తాండుడు అందుకుంటూ అన్నాడు. "ధీరేంద్రుడు పసిబాలుడుగా ఉన్నప్పటి నుండీ నా ఆశ్రమంలో ఒక నిరుపేద బాలుడిలా పెరిగాడు! రాజమందిర వైభవాలు నీ పుత్రికలకు ఎంత కొత్తో, అతనికీ అంతే! ధీరేంద్రుడు సౌమ్యుడు, ఉత్తముడు. విద్యాబుద్ధులు నేర్చినవాడు. నా శుశ్రూషలో రాజధర్మం, ధర్మసూక్ష్మం-అన్నీ ఆకళింపు చేసుకున్న వ్యక్తి. ముఖ్యంగా, అందాల భరిణలైన నీ పుత్రికలకు తగిన అందగాడు! పట్టాభిషేకం అనంతరం సాగిన ఊరేగింపులో నీ పుత్రికలు ధీరేంద్రుడిని చూసే ఉంటారు. తనకు కూడా నీ పుత్రికలు నచ్చారు!"

ఆయన మాటలతో అందరూ ఒక్కసారిగా తలలు తిప్పి గిరిజా, గిరికల వైపు చూశారు. ఇందాక ఆశ్చర్యప్రతిమల్లా ఉండిపోయిన యువతులు ఇద్దరూ ఇప్పుడు సిగ్గుల మొగ్గలైన శిల్ప సుందరీమణుల్లా ఉన్నారు!

"నాయనా వీరధర్మా, నీ మాటగా ఒక మాట చెప్పు!" మహామంత్రి అన్నాడు.

"నేనా!?" వీరధర్మ కంఠంలో ఆశ్చర్యం పలికింది.

"నువ్వే! నీకు ఆ అర్హత ఉంది!" మహామంత్రి



## రకూల్ ఇల్లు కొనలేదట!

తక్కువ కాలంలోనే స్టార్ హీరోయిన్ స్థాయికి ఎదిగిన రకూల్‌ను చాలా మంది హీరోలు అభిమానిస్తున్నారట! అలా రకూల్‌ని విపరీతంగా ఇష్టపడే ఓ హీరోగారు రకూల్‌కి హైదరాబాద్‌లో ఓ ఇల్లు గిఫ్టుగా ఇచ్చారట! ఆ ఇల్లు తనే కొనుక్కున్నానని రకూల్ చెబుతున్నా...అది హీరోగారి గిఫ్ట్ అని టాలీవుడ్ జనాలు అంటున్నారు. జిమ్‌ను మాత్రమే రకూల్ సొంతంగా ఏర్పాటు చేసుకుందని చెబుతున్నారు. మొత్తానికి ఆ హీరోగార్ని పడేసి ఆయన చేత ఇల్లు కొనిపించిందన్న వార్తలు బాగా హల్ చల్ చేస్తున్నాయి. యథావిధిగా రకూల్ ఈ వార్తలు ఖండించేస్తోంది. అదే వేరే విషయం!

చిరునవ్వు నవ్వుతూ అన్నాడు. "ఈ నలుగురికీ ప్రాణదాతవు నువ్వు. వీళ్ళ ప్రాణాలు కాపాడిన నీకు ధర్మబద్ధంగా ఆ అధికారం, బాధ్యతా సంక్ర మించాయి."

"కన్యలకూ, కన్నవారికీ ఇష్టమైతే, నాకూ ఇష్టమే! అదృష్టం నా సోదరీమణులను వెదు క్కుంటూ వచ్చింది! నేను చెప్పగలిగింది ఇంతే ఆర్యా!"

"చక్కగా చెప్పావు, నాయనా!" రాజగురువు అన్నాడు.

"ఆనందా...నీ అభిప్రాయాన్ని నగరుకు నివే దించాలి, మేము!" మహామంత్రి హెచ్చరించాడు.

ఆనందుడు తన ధర్మపత్ని వైపు చూశాడు. ఆమె భర్త చూపులను అర్థం చేసుకుంది. పుత్రి కల దగ్గరగా వెళ్ళింది. "అమ్మాయిలూ.." అంది సాభిప్రాయంగా. గిరిజా, గిరికా సిగ్గు చిరు నవ్వుల్ని దాచుకునే ప్రయత్నం చేస్తూ తల్లిని ఒకేసారి కౌగిలించుకున్నారు.

ఆనందుడు కొద్దిగా స్పందిస్తూ చలిస్తున్న




శరీరాన్ని అదుపులో పెట్టుకుంటూ పెద్దల వైపు చేతులు జోడించాడు. "రాజమాతగారి ఆదేశాన్నీ, ధీరేంద్రమహారాజుగారి అభిప్రాయాన్నీ ఆనం దుడు శిరసావహిస్తున్నాడు..."

"శుభం!" రాజగురువు అన్నాడు ఉత్సాహంగా.

"తథాస్తు!" మహామంత్రీ, మార్తాండుడూ ఏకకంఠంతో అన్నారు.

•••

"నాయనా, నువ్వు అడుగుపెట్టావు; అదృష్టం అడుగుపెట్టింది!" ఆనందుడు వీరధర్మ చేతిని పట్టుకుని ఉద్రేకంతో అన్నాడు.

"బాబాయిగారూ, మనిషి అదృష్టాన్ని తీసుకు రాడు. అదృష్టమే నన్నిక్కడికి తీసుకు వచ్చింది! నా చేత మీ కుటుంబానికీ, ఈ రాజ్యానికీ మేలు కలిగే కార్యాలు చేయించింది! నేను-మనిషి హస్తంలో ఖడ్గంలాగా-అదృష్టదేవత చేతిలో ఆయుధాన్ని. అంతే!"

"లేదు నాయనా...మా ఇద్దరికీ మా ప్రాణాల కన్నా, మా బిడ్డల మాన ప్రాణాలు మిన్న! ఆనాడు నువ్వు రాకపోయి ఉంటే, ప్రాణాలకు తెగించి సాహసం చేయకుండా ఉంటే-మేమెవ్వ రమూ ఉండేవాళ్ళం కాము!" పూర్ణమ్మ అంది.

"మీరు అలా అనుకోవడం నా అదృష్టం పిన్నీ!" వీరధర్మ నవ్వాడు.

"మా వివాహాలు నీ చేతుల మీదుగా జర గాలి, అన్నాయ్!" గిరిజ అంది.

అంతేకాదు, గిరిజా! చక్కని చుక్కతో మన ఇంట్లో అన్నయ్య పెళ్ళి జరగాలి. అప్పటి దాకా ఇక్కణ్ణుంచీ కదలనివ్వం! ఏం?" గిరిక అంది.

"మహారాణులవుతారు కదా! అప్పుడు రాజు గారి ద్వారా మీ అన్నకు ఆనతి ఇప్పించండి; కట్టడి చేస్తూ!" పూర్ణమ్మ అంది.

అందరూ నవ్వారు. వీరధర్మ తనలో నవ్వు కున్నాడు.

•••

గిరిజా, గిరికా ధీరేంద్ర మహారాజుల వివాహం రాజ మందిరంలో అత్యంత వైభవంగా జరి గింది. కవల సోదరీమణుల కోరిక మేరకు వీర ధర్మ వివాహ కార్యక్రమంలో పాల్గొన్నాడు.

పూర్ణమ్మ, ఆనంద దంపతుల పుత్రికలు అత్తవారింటికి వెళ్ళిపోయారు! పుట్టినింటి నుండి వెళ్ళి పోతూ, తల్లినీ, తండ్రినీ వదలలేక, వదల లేక ఆ యువతులు పడిన ఆవేదన వీరధర్మ హృదయాన్ని ద్రవింపజేసింది. ఇంక-ఆ ఇద్దరు సోదరీమణులూ తన నుండీ వీడ్కోలు తీసు కున్నప్పటి దృశ్యం అతన్ని కుదిపివేసింది. జీవి తంలో మొట్టమొదటి సారిగా తోబుట్టువుల అనురాగ సుధను అతను రుచి చూశాడు. గిరిజ, గిరికల బుగ్గల మీద వాళ్ళ ఆప్యాయత లను కొలత వేస్తున్నట్టు గీతలుగా సాగిన అశ్రు వులు తన కళ్ళను చెమ్మగిల్ల జేశాయి. అదొక దివ్యానుభవం. వాళ్ళు తనకి తల్లిదండ్రులు ఇచ్చిన తోబుట్టువులు కారు, దేవుడిచ్చిన తోబుట్టువులు! నూతన వధువులుగా రాచమర్యాదలతో రథం మీద గిరిజా గిరికలు తరలి వెళ్ళిపోయిన క్షణం నుండీ ఇల్లు బోసిపోయింది! ఇక తను కూడా విడిదికి వీడ్కోలు పలికి బయలుదేరాలి.

పూర్ణమ్మా, ఆనందుడూ తమ సర్వస్వాన్నీ పోగొట్టుకున్న వాళ్ళలా అయిపోయారు. వాళ్ళ ముఖాల మీద ఏదో దిగులు కాపురం ప్రారం భించింది.

"బాబాయిగారూ...మీ అల్లుడుగారు రాచ నగరులో అమ్మాయిలకు తోడుగా ఉండిపొమ్మని మిమ్మల్ని ఆహ్వానించారు కదా! వెళ్ళి అక్కడ ఆనందంగా..." వీరధర్మ ఓదార్పుగా చెప్ప బోయాడు.

ఆనందుడి తల ఉద్రేకంగా అటూ, ఇటూ ఊగింది.

"అది వాంఛనీయం కాదు, నాయనా. మా పిల్లలకి ఎలాగూ రాణివాస వైభవం తప్పదు. మేం అతిసామాన్యమైన నేలబారు జీవితానికి అలవాటు పడిపోయాం; చిన్నపాటి పెరటి తోటలో చిన్న పక్షుల్లా! ఇప్పుడు బంగారు పంజ రాల్లో ఉండలేము! రాజుగారి అత్తమామలుగా మా వ్యక్తిత్వాలను మేం కాపాడుకోవాలి.

మహారాణులైన మా చిట్టితల్లులు అప్పుడ ప్పుడు ఈ సాధారణ జీవితాన్ని రుచి చూడా లనుకుంటారు! వాళ్ళకోసం, మా కోసం- ఇక్కడే ఉంటాం!"

"అవును నాయనా, తాము అక్కడ ఉండడం అమ్మాయిలకు ఆనందం; ఇక్కడ ఉండడం మాకు ఆనందం!" పూర్ణమ్మ నవ్వింది.

తలుపు చప్పుడైంది. వీరధర్మ వెళ్ళి తలుపు తెరిచాడు. గుమ్మం ముందు నిలుచున్న రాజ భటుడు వినయంగా నమస్కరించాడు.

"వీరులకు జయం! ప్రభువులు తమరిని ఉన్నపళాన వెంట తీసుకురమ్మన్నారు. రథం తెచ్చాను.."

ఎందుకు? అని అడగబోయి, వీరధర్మ ఊరు కున్నాడు. ఎందుకో భటుడికి మహారాజు ఎందుకు చెప్తాడు?

"వెళ్ళిరా, నాయనా!" దగ్గరగా వచ్చిన ఆనం దుడు అన్నాడు.

వీరధర్మ గుమ్మం దాటాడు.

•••

ప్రభువులు మంత్రాలోచన మందిరంలో ఉన్నారు. దయచేయండి" అంటూ ఆంతరంగిక సేవకుడు వీరధర్మను ఆహ్వానించి, తీసుకు వెళ్ళాడు.

మూడు కక్ష్యాంతరాలు దాటిన అనంతరం ఆంతరంగిక సేవకుడు ఒక ద్వారం ముందు ఆగాడు. తలుపును కొద్దిగా లోపలికి తోసి, "వీర ధర్ములు విచ్చేశారు, ప్రభూ!" అన్నాడు విన యంగా.

***(ఇంకావుంది)***

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## డయాబెటిస్ నియంత్రణకు సరైన వైద్యం

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్



గత కొన్ని సంవత్సరాలుగా 'డయాబెటిస్' అనే మాట మనం తరచుగా వింటున్నాం. అంతకు ముందు తరాలలో ఈ వ్యాధి చాలా తక్కువ మందిలో కనిపించేది. కానీ నేటి మానవుడి జీవన విధానంలో అనేక మార్పులు రావడం వలన శారీరక శ్రమ తగ్గడం, మానసిక ఒత్తిడి పెరగడం, ఆహారపు నియమాలు పాటించకపోవడం వంటి అంశాలన్నీ 'డయాబెటిస్' వ్యాధికి మూలకారణాలు అవుతున్నాయి. మానవుడి శరీరంలో ఉపయోగించబడకుండా మిగిలిపోయిన చక్కెర పదార్థాలు సాధారణ స్థాయి కంటే ఎక్కువ మోతాదులో రక్తంలో ఉండటాన్ని 'డయాబెటిస్' అంటారు. వైద్య పరిభాష రీత్యా ఇది ఒక మెటబాలిక్ డిజార్డర్.

డయాబెటిస్-రకాలు:-

**(1) టైప్-I డయాబెటిస్ (ఇన్సులిన్ డిపెండెంట్ డయాబెటిస్):** మన శరీర రోగ నిరోధక వ్యవస్థ, క్లోమ గ్రంథిలోని ఇన్సులిన్ ఉత్పత్తి చేసే కణాలను నాశనం చేయడం వలన 'డయాబెటిస్' ఉత్పన్నమవుతుంది. ఎక్కువ శాతం 20 సం॥ల లోపు వయస్కులలో దీనిని గమనించవచ్చు. ఇది ఎక్కువగా చిన్న వయస్సులో వచ్చే అవకాశం ఉంటుంది. దీనినే 'జువెనైల్ డయాబెటిస్' ఉంటారు.

కారణాలు: ఆటో ఇమ్యూన్ వ్యాధులు, క్లోమ గ్రంథికి సిస్టిక్ ఫైబ్రోసిస్, క్రానిక్ ప్యాంక్రియాటైటిస్, పార్షియల్ ప్యాంక్రియాటెక్టమి వంటివి టైప్-I డయాబెటిస్‌కు కారణాలు కావచ్చు.

**(2) టైప్-II డయాబెటిస్ (నాన్-ఇన్సులిన్ డిపెండెంట్ డయాబెటిస్):** మధుమేహ వ్యాధిగ్రస్థులలో 90 శాతం ఈ రకానికి చెందిన వారే. ఇది ఎక్కువగా 30 సం॥లు దాటిన వారిలో వస్తుంది. దీనికి 2 కారణాలు. (1) అవసరమైన మోతాదులో ఇన్సులిన్ ఉత్పత్తి కాకపోవడం. (2) శరీరంలోని కణజాలం ఇన్సులిన్‌ను ఉపయోగించలేకపోవడం.

కారణాలు: వయస్సు పైబడటం, స్థూలకాయం, శారీరక శ్రమ తగ్గటం, అధిక మానసిక ఒత్తిడి, గతంలో జెస్టేషనల్ డయాబెటిస్ వ్యాధిని కలిగి ఉండటం వలన మరియు వంశపారంపర్యం వంటి అంశాలన్నీ టైప్-II డయాబెటిస్‌కు కారణాలు అవుతుంటాయి.

**(3) టైప్-III డయాబెటిస్:** 'జెస్టేషనల్ డయాబెటిస్'గా పిలువబడే ఈ సమస్య గర్భిణులలో కనిపిస్తుంటుంది.

వ్యాధి లక్షణాలు:
- అధిక దాహం, అధిక ఆకలి, అధిక మూత్రస్రావం.
- బరువు తగ్గడం, త్వరగా నీరసించిపోవడం, పిక్కల్లో నొప్పి, ఒళ్ళు నొప్పులు రావడం, గాయాలు నయం కాకపోవడం.
- ఫంగల్ ఇన్ఫెక్షన్స్, చర్మ వ్యాధులు ఎక్కువగా రావడం.
- సెక్స్ కోరికలు తగ్గిపోవడం, కాళ్ళూ చేతులలో తిమ్మిర్లు మరియు మంటలు కలగడం వంటి లక్షణాలు కనిపిస్తాయి.




దుష్ఫలితాలు: డయాబెటిస్ ఉన్న వారికి సరైన చికిత్స లేకపోవటం, జీవన విధానం సరిగా లేకపోవడం వలన ఇది అనేక ఇతర వ్యాధులకు మూలకారణంగా మారే అవకాశం ఎక్కువగా ఉంటుంది.
- డయాబెటిక్ ఫుట్, డయాబెటిక్ నెఫ్రోపతి, డయాబెటిక్ రెటినోపతి, డయాబెటిక్ న్యూరోపతి.
- అధిక రక్తపోటు, శరీరంలో కొలెస్ట్రాల్ స్థాయి పెరగటం, ఛాతీ నొప్పి, గుండె పోటు, పక్షవాతం, క్యాటరాక్ట్, గ్యాస్ట్రిక్ సమస్యలు వంటి దుష్ఫలితాలు కలుగుతాయి.

నిర్ధారణ పరీక్షలు: ఫాస్టింగ్ బ్లడ్ షుగర్ (FBS), పోస్ట్ ప్రాండియల్ బ్లడ్ షుగర్ (PPBS ), HBA1C, గ్లూకోజ్ టాలరెన్స్ టెస్ట్ (GTT), యూరిన్ షుగర్ లెవెల్స్, సీరమ్ క్రియేటినైన్ లెవెల్స్, బ్లడ్ కొలెస్ట్రాల్ లెవెల్స్ మొదలగు పరీక్షలు చేయించుట ద్వారా డయాబెటిస్ సమస్యకు ఖచ్చితమైన చికిత్స అందించేందుకు వీలవుతుంది.

హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స: హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో అందించే జెనెటిక్ కాన్స్టిట్యూషనల్ వైద్య విధానం ద్వారా, కేవలం వ్యక్తిలోని డయాబెటిస్ జబ్బుకు మాత్రమే చికిత్స అనే పద్ధతిలో కాకుండా, ఆ వ్యక్తిని విసిగించే ఇతర డయాబెటిక్ కాంప్లికేషన్లు అన్నింటినీ పూర్తిగా నివారింపజేయటం జరుగుతుంది. డయాబెటిస్‌ను గుర్తించిన వెంటనే హోమియోపతి చికిత్సను ప్రారంభిస్తే సంపూర్ణంగా నయం చేసే అవకాశం కూడా ఉంటుంది. అంతే కాకుండా చిన్న వయస్సులో అధిక ఒత్తిడి వలన సంభవించే 'బ్రైన్ డయాబెటిస్'ను కూడా సంపూర్ణంగా నయం చేయవచ్చు.



# సినీ నారాయణీయం

## (ఎమ్మెస్ నారాయణ జీవితచిత్రం) 15

**అప్పటివరకు మూగవాడు జాషువా. లాస్ట్‌లో మాట్లాడతాడు. అలా మాట్లాడేటప్పటికి థియేటర్ అంతా స్టన్. సైలెన్స్ అయిపోయారు. అందుకే నేను చెప్పాను. పెర్‌ఫార్మెన్స్ బాగుంటే వాళ్ళు వెటకారం చెయ్యరని. కొంతమంది ఇంజనీరింగ్ విద్యార్థులు ఇన్‌స్పైర్ అయిపోయి, ఒరేయ్ జాషువా యేసెయ్ అని అరిచారు. స్టాండింగ్ పొజిషన్.**

నాటిక అయిపోయింది.

అప్పుడు లెక్చరర్ వచ్చి మాట్లాడతాడు. నా పేరు నిబూ ఆగానీ కాదురా, నిప్పు, భూమి, ఆకాశం, గాలి, నీరులో మొదటి అక్షరాలు కలిపి పెట్టుకున్నాను. ఎందుకంటే ఆర్కియాలజీలో గొప్ప ప్రొఫెసర్ అవ్వాలని నా ఆశ రా. అందుకనే ఈ పంచభూతాల్ని నాపేరుగా పెట్టుకున్నానురా. కానీ మిమ్మల్ని భరించలేక అశోకుడికి రెండు పుర్రెలున్నాయని అబద్ధమాడాను. ఈ లెక్చరర్ మాట్లాడుతుంటే థియేటర్ అంతా స్టన్ అయిపోయింది. అయిపోయాక వెళ్ళిపోతారందరూ. అదీ నాటకం.

### ఆరు షీల్డ్స్ సాధించాం

నా స్టూడెంట్స్‌కి నేను చెప్పా. చివరి వరకు ఉందాంరా. ఆఖరిరోజు మనకేదో ప్రైజ్ వస్తుందని ఆశగా ఉంది. రాలేదనుకో నో ప్రాబ్లం అని అన్నా. రిలాక్స్ అవ్వండన్నా. ఈ రెండు రోజులు వాళ్ళకి టిఫిన్లు, భోజనాలు నేనే పంపించటం నా అదృష్టం. అంత డబ్బులేదు ఆ కాలేజీ దగ్గర.

మూడోరోజు వచ్చింది. సర్పయాగం అని ఒక నాటికతో వచ్చారు డీఎన్ఆర్ కాలేజీ వాళ్ళు. దాంట్లో ఒక ఫోక్ డాన్స్ వేశారు. దానికి రాఘవేంద్రరావు గారు వచ్చి డైరెక్ట్ చేశారని చెప్పారు. ఆయన కూడా వచ్చి ఉండవచ్చు. కాని అది డైరెక్ట్ చేసింది, ప్రస్తుతం చలనచిత్రంలో డైరెక్టరుగా ఉన్న రాజా వన్నెంరెడ్డి. ఆయన బీకామ్ స్టూడెంట్. ఆయన డైరెక్ట్ చేస్తే పట్టుకొచ్చారు. రామలింగేశ్వరరావుగారని, ఒక టెక్నికల్ లెక్చరర్ గారు, ఇంజనీరింగ్ కాలేజీనే అయి ఉంటుంది. ఆయన ఫైన్ ఆర్ట్స్ వింగ్ కన్వీనర్. ఆయన చదవటం మొదలెట్టారు. బెస్ట్ ప్రొడక్షన్ 'ప్లస్ అండ్ ఇంటూ ఆర్ ఈక్వల్ కేజీఆర్ఎల్ కాలేజీ అని ఎనౌన్స్ చేశారు. మేం ముందు వరసలోనే కూర్చున్నాం. నన్ను ఎత్తేశారు. ఒకడికి గోళ్ళున్నట్టున్నాయి. మొత్తానికి దిగిపోయింది అక్కడక్కడ బ్లడ్. తుడిచేసుకున్నా. మా మేకప్‌మేన్ గ్రంధి శ్రీరామమూర్తి చాలా హ్యాపీగా ఉన్నారు. బెస్ట్ విలన్ ప్లస్ అండ్ ఇంటూ ఆర్ ఈక్వల్. బెస్ట్ కమెడియన్ నిభూఅగానీ, ప్లస్ అండ్ ఇంటూ ఆర్ ఈక్వల్. బెస్ట్ సపోర్టింగ్ యాక్టర్ జాషువా. ఇట్లా ఆరు షీల్డ్స్. కట్‌చేస్తే అక్కడ కృష్ణా కాలేజీ అని ఒకటుంది. ఆ కుర్రాళ్ళు ఒరేయ్ అన్ని ప్రైజులూ ఒకదానికేనా అంటూ స్టేజి ఎక్కారు. ఎనౌన్స్ చేసిన ఆయన పారిపోయాడు. ఆ నాటకం విషయం అలా ముగిసింది.

### సినిమాల్లోకి వెళ్ళమన్నారు

మళ్ళీ భీమవరానికొచ్చేస్తే, నాకో పర్సనల్ బ్యాచ్ ఉండేది. కాలేజీ అయిపోగానే వాళ్ళతో కూర్చోవడం, స్టోరీ చెప్పడం. నేను వాళ్ళందరికీ స్టోరీలే చెప్పాను తప్పితే వాళ్ళతో ప్రైవేటు మ్యాటర్స్ నేను ఎప్పుడూ మాట్లాడలేదు. 'మీ నాలెడ్జ్ మామూలు నాలెడ్జ్ కాదు. అయ్యబాబోయ్ మీరు సినిమాల్లోకి వెళ్ళిపోండి' అన్నారు వాళ్ళందరూ. అప్పుడు నాకర్థమైందేంటంటే ఫైన్ ఆర్ట్స్‌లో ఒక ఏకపాత్రాభినయమే కాదు, ఒక ఊరి

# రచయితగా సినిమా టార్గెట్ కొట్టాలనుకున్నా

కథ కాదు, ఒక ముగ్గుజాతర కాదు, సినిమా అల్టిమేట్ అన్నమాట! ఓహో! అయితే ఒక రచయితగా నేను దాన్నే టార్గెట్ కొట్టాలి అనుకున్నా. ఎవడు మాట్లాడినా సినిమానే అంటున్నాడు. ఓ నాటిక రాయరా అనడం లేదు. ఓ నాటకం రాయరా అని అనడంలేదు. సినిమా రాయరా అంటున్నారు. సో సినిమా ఈజ్‌ది అల్టిమేట్ అనే భావన నాకు 1985లో వచ్చింది.

అక్కడ నుంచి బయలుదేరా.

### లెక్చరర్‌గా ఫ్యాన్స్‌ని సంపాదించుకున్నది నేనే

మా ఆవిడకి జాబ్ ఉంది. నాకు జాబ్ ఉంది. కాలేజీలో వైశ్యా బ్యాంక్ పెట్టారు. వైశ్యా బ్యాంక్ మేనేజర్ నా ఫ్యాన్. సినిమా నటుడైన తరువాత, లేకపోతే ఒక సైంటిస్ట్‌గా ఎదిగిన తర్వాత, లేదా రచయితయ్యాకా ప్రతివాడికీ ఫ్యాన్స్ ఉంటారు. కానీ ఒక లెక్చరర్‌గా చాలామంది ఫ్యాన్స్‌ని సంపాదించుకున్న వాణ్ణి నేనొక్కణ్ణే అని చెప్పగలను. పాఠం చెబుతుంటే అన్ని క్లాసుల వాళ్ళు నా పాఠం వినడానికే వచ్చేవారు. నేను చెప్పే దాంట్లో పాఠం ఉందా, ట్రాష్ ఉందా అనేది అనవసరం. వాళ్ళందరూ ఎందుకు వచ్చారనేదే పాయింట్.

కానీ ఒకతను నన్ను ఏవన్నాడంటే, దారి తప్పి ఉపన్యాసం ఇచ్చాడు అన్నాడు. తెలుగు లిటరేచర్‌లో అలాంటి ఉపన్యాసాలు ఇవ్వొచ్చు. లెక్కల్లో ఇవ్వలేవు. కేథోడ్‌ను మార్చి ఆనోడ్‌ను పెట్టి, ఆనోడ్‌ను మార్చి కేథోడ్‌ను పెట్టి చెప్పలేవు. ఫైనస్,





ప్లస్ రెండూ వేరు వేరు. యు ఆర్ టెక్నికల్ లెక్చరర్. లెక్కలు లెక్కలే. నువ్వు మాట్లాడకూడదు. కానీ ఐ యామ్ తెలుగు, నువ్వు పక్కదారులు పట్టు, ఏ దారి పట్టు కానీ ఎదుటివాడికి నువ్వే ఒక మంచి దారి. అదెందుకు అర్థం చేసుకోరు, తప్పు కదా.

నువ్వు లిటరేచర్ కాకుండా నీ ఇష్టం వచ్చింది చెప్పు. ఇప్పుడు లెక్కల్లో వందకు వంద వేస్తున్నారు. లిటరేచర్‌లో వందకు వంద ఎందుకు వేయడంలేదు. నువ్వు మొత్తం కష్టపడి లిటరేచర్ అంతా రాసినా వందకు వంద వేయడంలేదు. ఎందుకు వేయడం లేదు. అంటే ఎంత రాస్తే వందకు వంద వేస్తావు నువ్వు. పోనీ వంద రావాలంటే ఎలా రాయాలో అది కూడా చెప్పరు. వంద రాసింది ఎలా ఉంటుందంటే గురజాడ అప్పారావుగారు ఏం రాశారు అని అడిగావు. అవి చెబితే వందకు వంద వేస్తావా. లిటరేచర్‌కి పరిధి లేదు. నీ హృదయమే పరిధి. నువ్వు లిటరేచర్‌ను ద్వేషించే వాడివనుకో, నువ్వు నన్ను ఫెయిల్ చేస్తావు. నువ్వు లిటరేచర్‌ని లైక్ చేసే వాడివనుకో, నన్ను పాస్ చేస్తావు. గ్రామర్ మాస్టారు లిటరేచర్‌కు ఎందుకు మార్కులేస్తాడు. మ్యాథమేటిక్స్ వాడు సాహిత్యానికి ఎందుకు ఓటేస్తాడు. ట్రాష్ ఇదంతానూ. అందుకని 2+2=4 కరెక్ట్. వీడు చెప్పేదంతా ట్రాష్ అంటాడు ఆయన. ఇక్కడే చాలామంది సాహిత్యవేత్తలు, విజ్ఞానులు, సైకాలజిస్టులు కాలేజీల్లో వెనకబడుతున్నారు. కానీ జీవితాల్లో ముందు వాళ్ళే ఉంటున్నారు.

### మళ్ళీ ఏడు షీల్డ్స్ సాధించాం

ఎప్పుడైతే అన్ని ప్రైజులొచ్చాయో భీమవరంలో ఒక సెన్సేషన్. డీఎన్ఆర్ కాలేజి లెక్చరర్స్ వాళ్ళూ వీళ్ళూ అందరికీ ఫైన్ ఆర్ట్స్‌లో ఏజీఆర్ఎల్ అనే ఒక చిన్న కాలేజీకి నేను అన్ని షీల్డ్స్ తీసుకొచ్చి నిలబెట్టడం ఆశ్చర్యం అనిపించింది. నెక్స్ట్ గుంటూరులో యూత్ ఫెస్టివల్ పెట్టారు. అక్కడికి కూడా వెళ్ళాం. అదే టీమ్. అదే నాటిక. నాటిక అయిపోయింది. ఏడు షీల్డ్స్ వచ్చాయి. ఆ కార్యక్రమం పూర్తయ్యాక బయటికొచ్చాం.

**ఆంధ్రాయూనివర్సిటీలో ఎమ్మెస్ టీమ్ ప్రదర్శించిన నాటిక బెస్ట్ ప్రొడక్షన్‌గా ఆరు షీల్డులు గెలుచుకుంది. ఆ తర్వాత గుంటూరులో జరిగిన పోటీల్లో పాల్గొని ఏడు షీల్డులు సంపాదించింది ఎమ్మెస్ టీమ్. దీంతో ఒక లెక్చరర్‌గా ఎమ్మెస్‌కి కాలేజీలోనూ, భీమవరంలోనూ ఫ్యాన్స్ ఏర్పడ్డారు. అప్పుడు అందరూ ఎమ్మెస్‌ని ఏమన్నారు? తర్వాత ఆయనేం చేశారు?**

ఎమ్మెస్‌గారు ఎక్కడున్నారని అక్కడి ప్రిన్సిపాల్‌గారు వచ్చి అడిగారు. మా పిల్లలందరూ నా పక్కనే ఉన్నారు. ఆయనొచ్చారు. మీరేనా ఇది ప్రిపేర్ చేసింది అన్నారు. అవునండీ అన్నాను. అనీ రామానుజం ఎవరన్నాడాయన. లెక్చరర్ వేషం వేశాడాయన. రచయితగా అతని పేరే పెట్టా. ఆ ప్రిన్సిపాల్‌గారు రామానుజాన్ని పిలిచి, నా ఎదురుగానే కౌగలించుకున్నాడు. ఏ తల్లి కన్న బిడ్డవో గానీ ఎంత గొప్ప నాటకం రాశావయ్యా అన్నాడాయన. నా కళ్ళ నుండి నీళ్ళొచ్చాయి. ఇంతలో రామానుజం నేను కాదు...అన బోయాడు. ఏయ్, మాట్లాడొద్దు.

ప్రైజ్ పోద్ది అన్నాను నేను. నేనే రాశానండి అన్నాడు వాడు. ఆ సందర్భంలో నా కళ్ళమ్మట నీళ్ళొచ్చాయి. ఎందుకొచ్చాయంటే చెప్పనా, ఆనందం తోనో, దుఃఖంతోనో కాదు. ఎవడికొస్తే ఏంటీ మన కాలేజీకి ప్రైజ్ కావాలి. సరే, తర్వాత గుంటూరులో ట్రైన్ ఎక్కేశాం. అది జనవరి ఫస్ట్. నా శిష్యులు అంటే ఏడుగురు ఆర్టిస్టులు, మేకప్ మేన్ కలిపి నా టీమ్. వాళ్ళందరూ కలిసి విజయవాడలో చిన్న కేక్ తెచ్చారు. అక్కడ పెట్టారు. ఆ టైంలో నేను నా భార్యాబిడ్డలతో ఉండాలి. కానీ నా టీమ్ అందరితో కలిసి ఉండటం అంటే అంతకంటే ఎక్కువే. విజయవాడ స్టేషన్‌లో అందరం సందడి చేశాం. నేను కేక్ కటింగ్ చేశా. న్యూఇయర్ సెలబ్రేషన్. టీమ్‌లో అందరూ ఉత్సాహంగా ఉన్నారు. ఎంత ఉత్సాహమంటే, ఎవరికీ ఇన్‌ఫీరియారిటీ ఫీలింగ్ లేదు. ఎ గ్రేట్ మ్యాన్ అనే ఫీలింగ్ తప్పితే, టిల్ టుడే వాళ్ళందరికీ నా విషయంలో అదే ఫీలింగ్.

### గురువుకంటే గొప్ప అనుకున్నవాడు అసమర్థుడే

కానీ మా టీమ్‌లో ఒక స్టూడెంట్ డిఫర్ అయ్యాడు. నేను జిల్లా కలెక్టరు అవుతున్నానండి, మీరేముంది? జస్ట్ ఏదో నాటికలు, గీతికలూ అన్నాడు. నేను ఒకటే మాట చెప్పాను. నీవు నా స్టూడెంట్ కదా అని నేను నీ దగ్గరకొచ్చి నేనేమి ఆబ్లిగేట్ చెయ్యను. ఐ యామ్ యాన్ ఆర్టిస్ట్. డైరెక్ట్ ఆర్టిస్ట్. ఆర్టిస్ట్ ఈజ్ ఆర్టిస్ట్. రచయితనీ, ఆర్టిస్ట్‌నీ గనక నేను ఒక మాట చెప్తా. నా దగ్గర చదువుకున్న ఏ స్టూడెంట్‌నీ నేను మరణించే వరకూ ఆబ్లిగేట్ చేయను. ఎందుకో చెప్తా. తన దగ్గర చదువుకున్నవాడు ఎదుగుతుంటే నేను వెధవలాగా ఎందుకుండాలని ఆలోచించుకుని, 'నేను నీకంటే గొప్పోణ్ణి అవుతానా' అని ఆ స్టూడెంట్‌కి చెప్పాను. తల్లి సాక్షిగా ఇంతవరకూ నేనెవరినీ ఆబ్లిగేట్ చెయ్యలేదు. ఏ టీచరైనా, ఎవరైనా ఒక స్టూడెంట్ గొప్పవాడవుతున్నాడంటే అతని కంటే తక్కువైపోడానికే టీచరు సిద్ధపడిపోయి, ఆ ఎదిగిన స్టూడెంట్‌ని ఉపయోగించుకోటానికి ఆలోచిస్తాడు. నాకది ఇష్టంలేదు. అలాంటప్పుడు వాడికి చదువు చెప్పేటంత స్టేచర్ నీకెందుకు? అంటాను నేను.

నీ దగ్గరకు వచ్చి చదువుకున్న ఒక స్టూడెంట్ కలెక్టర్ అయినా, ఇంకా గొప్పోడైనా సరే, నువ్వు వాడికంటే తక్కువ అనుకోవద్దంటాను. నీకు జన్మించిన పుత్రుడు నీకంటే గొప్ప కేడర్‌లో ఉండొచ్చు. కానీ నా తండ్రి వెధవ అనుకున్న ఆ కొడుకు వెధవకాక మరేమవుతాడు? కేడర్ ఈజ్ డిఫరెంట్ ఫ్రమ్ జన్మ. అలాగే నా దగ్గర చదువు నేర్చుకొని నా ఇన్‌స్పిరేషన్‌తో గొప్పోడైన నువ్వు కలెక్టరు కావచ్చు. కానీ ఆ స్ఫూర్తి నీకు నా దగ్గర నుండి వచ్చింది. గురువును మర్చిపోయి 'నేనే గొప్పోడిని' అనుకుంటే నువ్వు అసమర్థుడివే. దట్ ఈజ్ టీచర్. ప్రతివాడు ఒక టీచర్ దగ్గరే గొప్పవాడవుతాడు.

*(ఇంకావుంది)*

**-కూనపరాజు కుమార్**
**సెల్: 99899 99599**

# అటెండర్ ఆదిబాబు

- దూరి వెంకటరావు

**కాలింగ్ బెల్ ఖంగుమంది.**

**ఉలిక్కిపడి లేచాడు బల్లమీద కూర్చుని కునుకు పాట్లు పడుతున్న ఆదిబాబు. వెంటనే యూనిఫారం సరిచేసుకుని బాస్ ఛాంబర్‌కెళ్ళాడు. అతడి చూపుల్లో భయం గోచరిస్తోంది. కొత్తగా వచ్చిన ఆఫీసరు. పైగా యమా స్ట్రిక్ట్ అని అంతా అనుకుంటున్నారు. ఏమంటాడో ఏంటో అనుకుంటూ రెండు చేతులు కట్టుకుని వినయంగా నిలబడ్డాడు.**

"ఏమయ్యా నిన్న కూడా చెప్పాపెట్టకుండా పారిపోయావ్. ఎన్నిసార్లు చెప్పాలి నీకు, ఆఫీసరున్నంత వరకు అటెండర్ ఉండాలని. నీ బిహేవియర్ మార్చుకోదలుచుకోలేదా! ఇంకోమారు ఇదే రిపీటైతే ఊరుకునేది లేదు. సస్పెండ్ చేసి పారేస్తాను జాగ్రత్త. ఏంవనుకుంటున్నావో ఏమో! వెళ్లి కాఫీ పట్టుకురా" మండిపడ్డాడు మహేష్.

కిమ్మనకుండా తలపంకిస్తూ వెళ్ళిపోయాడు ఆదిబాబు.

"నా మాట సైతం లెక్కచేయకుండా టైం అవుతూనే కొంపకుపోయి వీడుచేసే పాటేంటో?" తనలో తను గొణుక్కున్నాడు మహేష్.

"చీకటిపడే సరికి వాడికి చుక్కపడాలి సార్. అరక్షణం ఆలస్యమైనా ఆగలేడు. అందుకే ఆ పరుగు" అన్నాడు అప్పుడే లోపలికొచ్చిన జూనియర్ అసిస్టెంట్ జోగారావు.

"నాకు తెలీక అడుగుతాను వీడు ఎప్పుడూ ఇంతేనా? ఇంతకుముందున్న ఆఫీసర్లెవరూ పట్టించుకునే వారు కాదా" అడిగాడు ముఖం చిట్లిస్తూ.

"ఆదిలో అంతా మీలానే ఆగ్రహించి ఆనక అడ్జెస్టైపోయేవారు సార్. మిమ్మల్నీ అలాగే అనుకుంటున్నాడు" మరింత రెచ్చగొట్టాడు జోగారావు పట్టుకొచ్చిన ఫైలు బాస్ ముందు వినయంగా పరుస్తూ. దొరగారి మెప్పు కోసం అలా అన్నాడేగాని ఆదిబాబు మీద ద్వేషంతో కాదన్నది అతడి అంతరాత్మకు తెలుసు.

ఆ మాటతో అతడి అహం దెబ్బతింది. ఆదిబాబు మీద సివియర్ యాక్షన్ తీసుకుని తన సత్తా ఏంటో అందరికీ చాటాలనుకున్నాడు.

ఉదయం పదకొండవుతోంది. స్టాఫంతా ఎవరి పనిలో వాళ్ళు బిజీగా ఉన్నారు.

మహేష్ సీట్లోంచి లేచి బయటికొచ్చాడు.

అటెండర్ ఆదిబాబు జోగుతూ గోడకి చారగిలబడి ఉండడం గమనించాడు. "రాత్రి డోస్ ఎక్కువైనట్లుంది వెధవకి" అనుకున్నాడు తనలో తను. ఉన్నట్లుండి మస్తిష్కంలో తళుక్కున మెరిసిందో ఆలోచన. అంతే, క్షణం ఆలస్యం చేయకుండా తనతో కాస్తంత సన్నిహితంగా మెలిగే జోగారావును పిలిచి చెవి కొరికాడు. ఫలితంగా అతడి పక్కన అదివరకు లేని బ్రాందీ బాటిలు ప్రత్యక్షమైంది. అదేమి గమనించే స్థితిలో లేడు ఆదిబాబు.

"డ్యూటీలో ఉండగా మద్యం సేవిస్తున్నాడన్న కారణంగా వాణ్ణి సస్పెండ్ చేసినట్లు ఆర్డరు తయారు చేసి తెమ్మని సూపరింటెండెంట్‌ని ఆదేశించాడు. స్టాఫ్ ఎవిడెన్సు తప్పని సరి సుమా! అన్నాడు.

వచ్చి వారం రోజులు కాలేదు. అప్పుడే చర్యలు ఆరంభమయ్యాయన్న మాట. ఇవాళ వీడి మీద, రేపు ఇంకెవరి మీద తీసుకుంటాడో! ఇలా అతగాడి దాష్టీకానికి ఎంత మంది బలికావలసి

వస్తుందో అనుకుని "సార్! నేను మీకు సలహా ఇచ్చేటంతవాడినా అనుకోకపోతే నాదో విన్నపం" అన్నాడు సత్యారావు.

"ఫరవాలేదు చెప్పండి" అన్నాడు మహేష్.

"ఎందుకైనా మంచిది వాడినో మారు మెడికల్ చెకప్‌కి పంపించి రిపోర్టు వచ్చిన మీదట ఆ పని చేస్తే బావుంటుందని నాకనిపిస్తోంది. రోజులు బాగులేవు. యూనియన్ ఊరుకోదు. అకారణంగా వాడికి సస్పెన్షన్ ఆర్డరు ఇష్యూ చేశారని నానా యాగీ చెయ్యొచ్చు. అందుకే ఏం చేసినా పకడ్బందీగా ఉండాలి. అప్పుడు ఎవరూ నోరెత్తలేరు. ఏవంటారు" అన్నాడు సత్యారావు.

ఇదేదో బాగానే ఉన్నట్లనిపించింది మహేష్‌కి. "సరే, అలానే కానివ్వండి. వాడెలాగూ గుర్రం ఎక్కే ఉన్నాడు".

వాళ్ళ మాటలు ఆదిబాబు చెవిలో పడ్డట్టుంది. గభాలున లేచి బాస్ కాళ్ళ మీద పడ్డాడు. "క్షమించండి. పిల్లలు గలవాణ్ణి. ఇంత వరకూ డ్యూటీలో ఉండగా నేనెప్పుడూ తాగలేదు. నన్ను నమ్మండి. ఇక నుంచి మరింత ఎలర్ట్‌గా ఉంటాను" అంటూ వేనోళ్ళ వేడుకున్నాడు.

"నువ్వు తాగకపోతే నీ పక్కన బ్రాందీ సీసా ఎలా వచ్చిందయ్యా" అని అడిగాడు మహేష్.

"ఏమోనండి, అది ఇక్కడికెలా వచ్చిందో తెలీడం లేదు. నేనూ ఇప్పుడే చూశాను దాన్ని" ఆశ్చర్యపోతున్నట్లు అన్నాడు ఆదిబాబు.

"ఇక నీ నాటకాలు కట్టిపెట్టి సూపరింటెండెంట్ గారితో వెళ్ళు" అని చెప్పి చర్రున తన గదిలోకి వెళ్ళిపోయాడు మహేష్.

ఆఫీసర్ ఆదేశానుసారం ఆదిబాబుకి మెడికల్ చెకప్ చేయించి తీసుకొచ్చాడు సత్యారావు.

"రిపోర్టు ఏది?" అడిగాడు మహేష్. త్వరగా అటెండర్ మీద చర్య తీసుకోవాలన్న ఆత్రుత అతడి మాటల్లో వ్యక్తమౌతోంది.

**తాడిని తన్నేవాడుంటే వాడి తలతన్నేవాడుంటాడు, రెచ్చిపోయేవాడుంటే రెచ్చగొట్టేవాడు ఆ వెనకే కాచుకుని ఉంటాడు. పిచ్చుకమీద బ్రహ్మాస్త్రం ప్రయోగించాలని ఉబలాటపడితే ప్రోత్సహించేవాళ్ళు కోకొల్లలు. కొత్తగా వచ్చిన బాసుది కూడా అదే పరిస్థితి. అటెండర్ ఆదిబాబు మీద తన ప్రతాపం అంతా ప్రదర్శించాలనుకున్నాడాయన. అతడి ప్రతాపం పనిచేసిందా? లేదా?**

"రేపిస్తామన్నారు సార్" నమ్రతగా జవాబిచ్చాడు సత్యారావు.

"సరే, మీరు వెళ్ళండి".

తన సీట్లోకెళ్ళిపోయాడు సూపరింటెండెంట్.

విషయం ఆదిబాబు భార్యకి ఎవరు చేరవేశారో తెలీదు. పరుగెత్తుకుంటూ ఆఘమేఘాల మీద ఆఫీసుకొచ్చింది.

వస్తూనే బాస్ రూంలోకెళ్ళి "నా మొగుడికి అన్యాయం సేయకండి బాబయ్యా. మా నోటికాడ కూడు తీసేయకండి. మీకు పుణ్యముంటాది. ఆడెప్పుడూ డ్యూటీలో ఉండగా తాగడు. నన్ను నమ్మండి. కావాలంటే ఎవరినైనా అడగండి" చంకనున్న బిడ్డను కిందికి దింపి ఆఫీసరు కాళ్ళు పట్టుకుంటూ అంది సీతాలు.

ఆమె ఎంత ప్రాధేయపడ్డా అతగాడి గుండె కరగలేదు. మరింతగా రెచ్చిపోతూ "ఏంటమ్మా ఇది, లే ముందు. నువ్వు ఇక్కడికెలా వచ్చావ్? ఏయ్ సెక్యూరిటీ, ఈమెను లోపలకు ఎవరు రానిచ్చారు? ముందు ఈమెని బయటకు ఈడ్చుకెళ్ళండి" హుకుం జారీ చేశాడు మహేష్.

ఆఫీసరు ఆదేశానుసారం సెక్యూరిటీ గార్డు వచ్చి బలవంతంగా ఆమెను బయటకు నెట్టాడు.

అక్కడ జరుగుతున్న తతంగమంతటినీ స్టాఫ్ కళ్ళప్పగించి చూస్తున్నారు. ఎవరి నోటా మాట రావడం లేదు.

"నీకీ రోజుతో ఆఫీసు ఋణం తీరిపోయినట్లుంది ఆది. నీకు సస్పెన్షన్ ఖాయంలానే అనిపిస్తోంది" అంటూ అటెండర్ మీద అందరూ సానుభూతి కనపరిచారు.

వాళ్ళ మాటలు వింటుంటే ఆదిబాబుకి మతిపోయింది. పాపం ఆ రాత్రంతా వాడికి కంటి మీద కునుకు లేదు. రేపు ఏం జరుగుతుందోనన్న టెన్షన్ అతడికి ఊపిరి సలపనివ్వడం లేదు.

మరునాడు అంతా ఎంతో ఉత్కంఠతో ఎదురు చూస్తున్న మెడికల్ రిపోర్టు రానే వచ్చింది.

"ఆదిబాబు రక్తంలో ఉన్నది ముందురోజు రాత్రి తీసుకున్న ఆల్కహాలు అవశేషమే తప్ప ఆ రోజు తీసుకున్నది కాదు. పోతే, బ్రాందీ సీసాలో ఉన్నది బ్రాందీ కాదు, ఆరెంజ్ జ్యూస్" అది దాని సారాంశం.

రిపోర్టు చదివి ఖంగుతిన్నాడు మహేష్. దాని ఆధారంగా ఆదిబాబు మీద ఏ యాక్షను తీసుకోలేడు. దీనికి కారణభూతుడైన జూనియర్ అసిస్టెంట్ జోగారావు మీద పీకల దాకా కోపం వచ్చింది. "ఏంటయ్యా, నేను చెప్పిందేమిటి? నువ్వు చేసిందేంటి? బ్రాందీ బాటిలు కొని వాడిపక్కన పడేయమంటే కూల్‌డ్రింకు పట్టుకొస్తావా? నన్ను ఫూల్ చెయ్యడానికి కాకపోతే మరేంటి?" ఉక్రోషంతో ఊగిపోతూ అతడి మీద విరుచుకు పడ్డాడు.

"సారీ సార్, నేను మీ ఆదేశాన్ని ధిక్కరించాలని కాదు అలా చేసింది. బ్రాందీ బాటిలు కొందామంటే అందుకు సరిపడా డబ్బులు ఆ టైంలో నా దగ్గర లేకుండా పోయాయి. ఎవరినైనా అడిగి బదులు తీసుకుందామన్నా అంత టైం లేదు. మీరేమో అర్జంటుగా బాటిలు పట్టుకు రమ్మన్నారు. ఆలస్యమైతే అతగాడు స్పృహలోకి రావచ్చు. అప్పుడు మందు పట్టుకొచ్చినా ప్రయోజనం ఉండదు. ఆ క్షణం ఏం చెయ్యాలో తోచక ఓ ఖాళీ బ్రాందీ సీసాలో ఆరెంజ్ జ్యూస్ పోయించి పట్టుకొచ్చాను. అందులో ఏముంటే ఏంటి అది బ్రాందీ బాటిలే కదా అనుకున్నానే తప్ప ఇలా జరుగుతుందనుకోలేదు" సంజాయిషీ ఇచ్చుకున్నాడు జోగారావు.

జూనియర్ అసిస్టెంట్ సమాధానాన్ని విన్న మహేష్‌కి ఒళ్ళు మండిపోయింది. పనికిరాని వెధవ. ఉన్న పళంగా వాడి పీక నులిమి పారేయాలన్నంత కోపం వచ్చింది. ప్చ్... ఇప్పుడు బాధపడి ఏం లాభం? పిచ్చుక మీద బ్రహ్మాస్త్రం ప్రయోగించాలనుకున్నాడు... ఛ... ఆ పిచ్చుకే తనని ముప్పతిప్పలు పెడుతోంది. తను అల్లిన పథకం అట్టర్‌ఫ్లాప్ కావడంతో దిగాలుగా సీట్లో కూలబడిపోయాడు.

బాస్‌ని ఆ స్థితిలో చూస్తుంటే స్టాఫ్ ఆనందానికి అవధుల్లేవు. ఇకనైన వాడెవరి మీదా ఇది వరకులా పెత్తనం చెలాయించలేడు. ఏ చర్యా తీసుకోలేడనుకున్నారు. జోగారావు చేసిన పనిని శ్లాఘిస్తూ అతణ్ణి ఆకాశానికెత్తేశారు.

మరునాడు కొత్త యూనిఫారం ధరించి టింగురంగామని ఆఫీసుకొచ్చిన ఆదిబాబుని చూసి గిల్టీగా ఫీలయ్యాడు మహేష్. కనీసం ఓ అటెండర్ మీద యాక్షన్ తీసుకోలేక పోవడంతో సిబ్బంది ముందు తలతీసేసినట్లైంది. ఇంత జరిగాక మరి అక్కడ ఉండబుద్ధి కాలేదు. ఆ రోజే ట్రాన్స్‌ఫర్‌కి దరఖాస్తు మెయిల్ చేశాడు. బదిలీ అయ్యేంతవరకు లీవులో కొనసాగాలని నిర్ణయించుకున్నాడు.

ఉన్నపళంగా బాస్ మెడికల్ లీవు పెట్టడంతో మేనేజ్‌మెంట్ వారు సూపరింటెండెంట్ సత్యారావుని ఫుల్ ఎడిషనల్ ఆఫీసు ఇన్‌చార్జ్‌గా నియమించారు. తాత్కాలికంగానైనా తమలో ఒకరు ఆఫీసరవడంతో స్టాఫ్‌లో పండగ వాతావరణం నెలకొంది.

*సెల్: 96669 91929*



## మరోసారి నోరు జారింది

ఎప్పుడూ ఏదో ఒక వివాదస్పద వ్యాఖ్యలు చేయడం, ఎదుటి వారి ఆగ్రహానికి గురి కావడం సీనియర్ నటి ఖుష్బూకు అలవాటే! తాజాగా హిజ్రాల ఆగ్రహానికి గురైంది ఖుష్బూ. గతంలో హిజ్రాలు ఎన్నికల్లో పోటీ చేయడంపై వివాదాస్పద వ్యాఖ్యలు చేసింది ఖుష్బూ. దానిపై మండిపడ్డ హిజ్రాలు చెన్నై మేజిస్ట్రేట్ కోర్టులో ఖుష్బూపై కేసు వేశారు. ఎవరిమీద నైనా వ్యాఖ్యలు చేసేటప్పుడు నిజానిజాలు తెలుసుకుని మాట్లాడాలనీ, హిజ్రాలకు తగిన రాయితీలు హక్కులు ఇవ్వాలన్న సుప్రీంకోర్టు తీర్పును ఖుష్బూ ఒకసారి చదివి తెలుసుకుంటే మంచిదని వారు ఆమెకు సలహా ఇచ్చారు.

# అందానికి భాష్యం చెప్పే రంగేది?

**అందంగా ఉండాలని కోరుకోనివాళ్లు ఎవరుంటారు చెప్పండి? పిల్లల నుండి వృద్ధుల వరకు అందరి ఆశా అందంగా కనిపించాలనే. ముఖ్యంగా మగువల సంగతి చెప్పనక్కర్లేదు. కానీ అసలు అందమంటే అర్థమేంటి? లిప్‌స్టిక్ పూసుకున్న పెదాలా లేక ఐ లైనర్ వేసుకున్న కన్నులా? కర్లీ హెయిరా? మెరుపుల దుస్తులా? లేక తెల్లటి మేని ఛాయనే అందం అని పిలుస్తారా? అందానికి సరైన నిర్వచనం ఏది? దీనికి సరైన అర్థం తెలియక తెల్లగా ఉండడమే అందమనే భావనలో కూరుకుపోయారు చాలామంది. నలుపు అందానికి చిహ్నం కాదన్న భ్రమలో కొట్టుమిట్టాడుతున్నారు.**

తెలుపు రంగు ఉంటేనే అందం అనే భావన చాలామందికి! 'అమ్మాయికేం తక్కువ! తెల్లగా జాం పండులా ఉంటేనూ!' అంటుంటారు. అందానికి క్రైటీరియా తెల్లదనమనే భావన ఎంతవరకు వెళ్ళిందంటే ప్రతీ విషయాన్ని శరీర రంగుతో ముడిపెట్టి మాట్లాడేంతవరకు. తెల్లటివాళ్ళు చదువులో ముందంజలో ఉంటారనీ, తెలివిగా ఆలోచిస్తారనే వితండవాదం పెరిగిపోయిందంటున్నారు మానసిక పరిశోధకులు. తెల్ల చర్మాన్ని ఆరాధించడానికి సమాజం ఎడిక్ట్ అయిపోయిందట! ఫలితంగా తెల్లగా లేమనే మానసిక సమస్యతో చాలామంది ఆత్మహత్యలు చేసుకుంటున్నారట.

### తారల అందాలు

మహానటి సావిత్రి, కళాభినేత్రి వాణిశ్రీ వంటివారు చామనచాయలో ఉండీ అందాల తారలుగా, ఆరాధనీయులుగా వెలుగొందారు. మిల్కీ బ్యూటీ తమన్నా అందగత్తే, చామనచాయ రంగులో మత్తెకించే బిపాసాబసూ అందగత్తే. మరి వీళ్లిద్దరూ ఒకేరంగులో లేనప్పుడు అందానికి రంగు ఎలా ప్రాధాన్యం అవుతుంది? అందుకే శరీరరంగు అందానికి నిర్వచనం ఎంతమాత్రం కాదు.

### శరీర రంగే ప్రధానమా?

శరీరానికి రంగే ప్రధానమైతే అది ఏ రంగు? నలుపా, తెలుపా, గోధుమ వర్ణమా, చామన చాయా అనేవి కూడా ఆలోచించాలి కదా! ఇప్పటి వరకు ప్రపంచ అందగత్తెల పోటీల్లో గెలిచిన వాళ్లలో ఎనభై శాతం యూరోపియన్ జాతీయులు, పది శాతం అమెరికన్లు, నాలుగు శాతం నల్ల జాతీయులు, ఆసియన్లు ఆరు శాతం ఉన్నారు. మరి వీళ్లలో ఏ రంగు అందమైనది?



### ఫెయిర్‌నెస్ క్రీముల మాయ

ఉద్యోగం కోసం ఎదురు చూసున్నారా? పెళ్లి కావట్లేదా? మంచి కాలేజీలో సీటు కావాలా? జాబ్‌లో ప్రమోషన్ పొందాలనీ, కెరీర్‌లో విజయం సాధించాలనీ ఉందా? లాంటి కాన్సెప్ట్‌లతో ఫెయిర్‌నెస్ క్రీం అడ్వర్టయిజ్‌మెంట్లు ఊదరగొడుతుంటాయి. ఫలానా క్రీం వాడండి మీరు ఇద్దైపోతారు అద్దైపోతారు అన్న లెవల్‌లో ఉంటాయా ప్రకటనలు. వాటిని చూస్తుంటే విచిత్రంగా అనిపిస్తుంది. ఒక్కోసారి నవ్వొస్తుంది. కానీ మార్కెట్లో వాటిదే హవా! అందానికి ఆత్మవిశ్వాసానికి ముడిపెడుతూ కంపెనీలు కోట్ల రూపాయలు ఆర్జిస్తున్నాయి. సమాజంలో వెర్రిపోకడలు పెరగడానికి ఇలాంటివి కూడా ఓ కారణమే.

### కోట్ల వ్యాపారం

ప్రపంచంలో అందం పేరుతో కోట్లాది రూపాయల వ్యాపారం నడుస్తోంది. ఒక్క మనదేశంలోనే సంవత్సరానికి 85 వేల కోట్ల రూపాయలు అందం కోసం ఖర్చుపెడుతున్నారట. ఇది ఒక పెద్ద రాష్ట్ర బడ్జెట్‌తో సమానం. ఒక సర్వే ప్రకారం భారతీయ మహిళ తన జీవిత కాలంలో అందం కోసం కనిష్టంగా 60 వేల రూపాయలు, అబ్బాయిలు 45 వేలు ఖర్చు పెడతారని లెక్క తేల్చారు!

### అందం లేదని ఆత్మహత్య?

నలుపురంగు మహిళలు చాలామంది తమ చర్మం రంగుపట్ల  ఆందోళన చెందుతున్నారన్నది సర్వేల సారాంశం. మహిళలను తీవ్ర ఒత్తిడికి గురిచేసే అంశాలలో చర్మ రంగు ప్రధాన సమస్యగా ఉంటుందట. ఈ కారణంగా చాలామంది మహిళలు ఇన్‌ఫీరియారిటీకి గురవుతున్నారట. తెల్లగా ఉన్నవాళ్లు కూడా కాస్త నల్లబడగానే ఎక్కడలేని టెన్షన్ పడుతున్నారు. ఇది వారిని నిద్రలేమికి గురిచేస్తోంది. ఫలితంగా పనులపై శ్రద్ధ పెట్టడంలేదని ఇటీవలి సర్వేల్లో వెల్లడైంది. అంతే కాదు ఆత్మన్యూనతవల్ల చాలామంది చావుకు వెనుకాడడం లేదట. సగటున పదిమంది యువతుల్లో ఒకరు అందంగాలేమన్న కారణంతో మరణిస్తున్నారని తేలింది.

### ఫీలింగ్ మాత్రమే

అందం ఓ ఫీలింగ్ మాత్రమే. రకరకాల అంశాల కారణంగా మనిషికి కలిగే ఓ మానసిక భావనే 'అందం' అంటున్నారు సైకాలజిస్టులు. పరిస్థితులు, పరిసర వాతావరణం

కూడా అందం అంటే ఇదే అనే మానసిక భావనకు గురిచేస్తాయట. అబ్బాయి లేదా అమ్మాయి అంటే ఇలా ఉండాలనే ఆలోచనా విధానం కూడా ఒక రకమైన కారణమే. మనసులో ఫిక్స్ అయిపోవడం వల్ల అందం అంటే ఫలానా రంగులోనో, రూపులోనో ఉంటుందన్న భావనకు లోనవుతున్నారు. మనిషిలో కలిగే ఈ భావనలు నేటి సమాజ వికృత రూపాన్ని చాటిచెబుతున్నాయి.

## స్నేహంలో రంగు కాలుష్యం!

సమాజంలో పిల్లల నుంచి పెద్దల వరకూ అంతా కలర్ ఫోబియాలో మునిగి తేలుతున్నారన్నది నిజం. చివరికి స్నేహం చేయడానికి కూడా కలర్ కాంబినేషన్ చూసుకుంటున్నారు. తెల్లరంగువారు నల్లవారితో స్నేహానికి ఇష్టపడడం లేదట. ఇదో సంప్రదాయంగా మారితే సమాజంలో మరింత ఆందోళన చెలరేగుతుందని పరిశోధకులు హెచ్చరిస్తున్నారు.

## సోషల్ మీడియాలో పోరాటం

రంగు భేదాలపై అవగాహన కల్పించడం ఎలా? అని చాలామంది బుద్ధిజీవులు ఆలోచిస్తున్నారు. దీనికి తగిన పరిష్కారం లేదా అంటే ఉందంటున్నారు టెక్సాస్ యూనివర్సిటీ విద్యార్థులు. దీనిపై వారు ఇప్పటికే పోరాటం ప్రారంభించారు! సోషల్‌మీడియానే తమ పోరాటానికి ప్రధానవేదికగా, ప్రధాన మాధ్యమంగా ఎన్నుకున్నారు. అన్‌ఫెయిర్ అండ్ బ్యూటీఫుల్ పేరిట ఓ హాష్‌ట్యాగ్ రూపొందించారు. ఈ ట్యాగ్ పేరు మీద నలుపు రంగుకు సంబంధించిన అనేక రకాల పోస్టులు పెట్టడంతో పాటు ప్రజల్లో అవగాహన కల్పించేందుకు చర్చాకార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. ప్రపంచవ్యాప్తంగా ఇప్పుడు ఈ ట్యాగ్‌మీద చర్చలు జరుగుతున్నాయి. కలరిజంపై నిరసన జ్వాల రగిలింది.

వాస్తవానికి ఈ ట్యాగ్ ఏర్పాటు చేయడం వెనుక ఒక చిన్న ఫొటో కారణం. పాక్స్ జోన్స్ అనే ఆఫ్రికన్ అమెరికన్ విద్యార్థిని. .యూనివర్సిటీ ఆఫ్ టెక్సాస్‌లో తన తోటి భారతీయ విద్యార్థినులతో కలిసి ఒక ఫొటో షూట్ స్టార్ట్ చేసింది. దానికి అన్‌ఫెయిర్ అండ్ లవ్లీ అని పేరు పెట్టారు. అది కాస్తా సోషల్ మీడియాలో చేరి హాష్‌టాగ్ పేరు మీద రచ్చరచ్చవుతోంది. ఈ హాష్‌ట్యాగ్‌లో సోషల్‌మీడియా కమ్యూనిటీలో ప్రధానంగా నల్లటి మేని చాయ ఉన్న మహిళలు తమ ఫోటోలను సందేహంలేకుండా పోస్ట్ చేయవచ్చు. అంతేకాదు వారు ఎదుర్కొంటున్న సమస్యలను కూడా ఇక్కడ ప్రస్తావించవచ్చు. దానికి తగిన పరిష్కారాన్ని కూడా వాళ్లు సూచిస్తారు. వారిలో ఆత్మస్థైర్యం పెంపొందిస్తారు. ఇప్పటికి వేయిమంది మహిళలు ఈ కమ్యూనిటీలో మెంబర్లుగా చేరారు. కేవలం ఫేస్‌బుక్ ద్వారా మాత్రమే కాకుండా ట్విట్టర్, ఇన్‌స్టాగ్రామ్‌ల ద్వారా కూడా ప్రజల్లో చైతన్యం తీసుకురావాలన్నదే వారి ఆశయం.

## ఆత్మ సౌందర్యం

అందమంటే బాహ్య సౌందర్యం కాదు. అందం అంటే చర్మం రంగు కాదు, మనిషి తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవాలి. మంచి వ్యక్తిత్వంతో జీవితంలో ముందుకు వెళ్లడమే అసలైన అందమనేది ఎక్కువమంది అభిప్రాయం. అదే కదా నిజం. 'మా ఇంట్లో ఇదొక్కత్తే నల్లగా పుట్టింది' అంటూ అవమానిస్తూ ఉంటారు కొందరు. కానీ వారిలోని ప్రతిభాపాటవాలను మాత్రం గుర్తించడం మరిచిపోతారు. నలుపు రంగులో గొప్ప సౌందర్యం లేదన్నదెవరు? అలాంటి వారిని ఈ సోకాల్డ్ సౌందర్య ప్రపంచమే 'బ్లాక్ డైమండ్స్' అని పిలుస్తూ ఉంటుంది. అనవసరమైన రంగుల, హంగులు అద్ది చర్మాన్ని కాపాడుకోవడం ఎంత వరకూ సమంజసం? క్రీముల్లో ఏముంది క్రిములు తప్ప.

## పెళ్లిళ్ళ మార్కెట్‌లో సమస్య

నా కూతురికేం తెల్లగా మిసమిసలాడిపోతుంది, రాజకుమారుడు వెతుక్కుంటూ వస్తాడు అని కొందరు తల్లితండ్రులు గర్వపడితే, పిల్ల కొంచెం రంగు తక్కువ అంటున్నారండీ, కట్నం ఎక్కువ ఇమ్మంటున్నారు అని మరికొందరు బేరాలు ఆడుతూ ఉంటారు. మన దేశంలోని పెళ్ళిళ్ళ మార్కెట్‌లో ఉన్న సమస్యల్లో ఇదే ప్రధానమైనది. పిల్ల పేదరాలైనా పర్లేదు, తెల్లగా ఉంటే చాలని ఆదర్శవాదం ప్రకటిస్తారు ఇంకొందరు. దేహ సౌందర్యం కంటే ఆత్మసౌందర్యమే భారతీయ వ్యక్తిత్వ వికాసానికి సోపానమని, అదే ఆర్థికంగా సామాజికంగా మనల్ని అగ్రదేశంగా నిలబెడుతుందనేది బుద్ధిజీవుల ఉవాచ. యువతరం ఇప్పటికే దీన్ని అంది పుచ్చుకుంది. అందుకే దీనిపై సామాజిక ఉద్యమం బయలుదేరింది.

- సంతోషిలక్ష్మి

## తారల క్యాంపెయిన్



ఫెయిర్‌నెస్ క్రీం యాడ్స్‌లలో చాలా మంది మోడల్స్, హీరోయిన్స్ నటిస్తుంటారు. అందులో చాలామంది రెమ్యునరేషన్ కోసమే పనిచేస్తారు. వాటి సంగతి పక్కనపెడితే కొందరు సెలబ్రిటీలు మాత్రం ఇలాంటి ప్రకటనల ద్వారా ప్రజలను మోసం చేయడం ఇష్టంలేక వాటికి దూరంగా ఉన్నారు. అలాంటి వారిలో ముందు వరుసలో నిలిచిన ప్రఖ్యాత నటి నందితా దాస్. నందితా ఏకంగా స్టే ఆన్ ఫెయిర్ స్టే బ్యూటిఫుల్ పేరిట ఒక క్యాంపెయిన్‌లో పాల్గొంది. ఈ క్యాంపెయిన్ ద్వారా వేలాది మంది అభిప్రాయాలు సేకరించింది. వారికి రంగు విషయంపై అవగాహన కల్పిస్తోంది. మరో నటి కంగనా రనౌత్ కూడా బ్యూటీ ప్రోడక్టులకు యాడ్స్ చేయనని ప్రకటించింది. అసలు ఎవరి మేని చాయ వారిష్టం ఒకరు అందంగా ఉన్నారని ఒకరు లేరని తీర్పు ఇవ్వడం తప్పుడు అభిప్రాయం అంటారామె.



## నలుపే రక్షణ కవచం

శీతోష్ణ పరిస్థితులు కూడా శరీర రంగును నిర్దేశిస్తాయని చెప్పవచ్చు. తెల్లగా పసిమి చాయలో ఉండేవాళ్లలో వేసవి చర్మ సమస్యలు మరింత ఎక్కువ. చర్మంలో ఉండె మెలనిన్ అతి నీలలోహిత కిరణాలు చర్మ కణాల లోపలికి చొచ్చుకుపోకుండా కాపాడుతుంది. తెలుపు వర్ణంలో ఉండేవాళ్లు తక్కువ మెలనిన్‌ను కలిగి ఉండడం వల్ల అతినీలలోహిత కాంతి చాలా సులువుగా కణంలోపలికి వెళ్తుంది. ఫలితంగా వీళ్లు చర్మ సమస్యలకు గురయ్యే అవకాశం చాలా ఎక్కువ. ఇలాంటి వారిలో చర్మ క్యాన్సర్ వచ్చే అవకాశం ఉంటుంది. చర్మంలోపలికి చొచ్చుకుపోయే అతి నీలలోహిత కిరణాలు కణాల్లోని జన్యువులపై ప్రభావం చూపి క్యాన్సర్‌కు కారణమవుతాయి. ఇటీవల ఓజోన్ పొర బాగా పలుచబడుతున్న కారణంగా మన దేశంలోనూ చర్మ క్యాన్సర్ల సంఖ్య పెరుగుతోంది.

# డేర్ డెవిల్



**-మధుబాబు** 27

**‘ఏమిటి నీ ఆలోచన? ఎంతసేపు ఇక్కడ నిలబడటం?’ క్షణ క్షణానికి అధికం అయిపోతున్న అసహనాన్ని అదుపులో పెట్టుకోవటం అసాధ్యమై, చిరాకుగా అడిగాడు ఘనీసుల్తాన్.**

**పూర్తి అయిపోయింది జాబిల్లి ఆలోచన. అవతల ఉన్నది ఎవరైనాసరే, అర్జంటుగా పోయి వాళ్ళ కళ్ళ పడటమే చాలా బాగుంటుంది. తనకు ప్రమాదం వాటిల్లినా, వాటిల్లకపోయినా, ఘనీసుల్తాన్ ఆట కట్టు అయిపోతుంది.**

‘పదండి... అందరూ అటుకేసి నడవండి’ తనకు వెలుగు కనిపించిన దిశకు చేయి చూపిస్తూ గబగబా కొండ దిగటం మొదలు పెట్టింది.

పలుగులూ పారలూ భుజాల మీద వేసుకుని పరుగులాంటి నడకతో ఆమెకు వంద అడుగుల ముందుగా కదిలారు ఘనీసుల్తాన్ అనుచరులు.

తన దట్టీలో ఉన్న పిడిబాకు మీద చేతిని కొద్దిగా కూడా పక్కకు జరపకుండా, నీడ మాదిరి జాబిల్లిని అనుసరించాడు ఘనీసుల్తాన్.

ఎయిర్‌కండిషన్డ్ వ్యాన్‌లో నుంచి బయటికి వచ్చేటప్పుడు ఎండ తన ఒంటికి సరిపడదని అతన్ని అల్లరి పెట్టటం కోసమే చెప్పింది జాబిల్లి. కానీ ఒక ఫర్లాంగు దూరం కూడా పూర్తిగా పోక ముందే ఆ మాటలు అక్షరాలా యదార్థం కాబోతున్న సూచనలు అగుపించటం మొదలు అయ్యింది.

సంపంగి పూరంగులో ఉండే ఆమె ముఖం కుంకుమ అద్దినట్లు ఎర్రగా కందిపోయింది. కళ్ళ ముందున్న ప్రపంచం అంతా గిర్రున గింగిరాలు తిరగటం స్టార్ట్ అయింది.

‘ముఖం వాష్‌చేసుకో. తల మీది క్లాత్‌ని టైట్‌గా ముఖానికి చుట్టుకో’ కంగారుగా చెప్పి తన నీటి సంచిని ఆమెకు అందించాడు ఘనీసుల్తాన్.

నీటి సంచీ మూత తీసి ముఖం మీద జల్లుకుంటున్న సమయంలో ఝుల్లుమన్నది జాబిల్లి శరీరం.

నడుము ఎత్తున ఉన్న ఒక బండరాయి దగ్గర నిలబడింది ఆమె. ఆ బండకు అవతలివైపున మోకాలి ఎత్తున ఎదిగి ఉన్నాయి ఏవేవో పిచ్చి పొదలు. ఆమె ఘనీసుల్తాన్‌కి చెప్పిన తామర పూవు ఆకారం ఆ పొదల్లో ఉన్నది.

‘వెర్రిచూపులు చూస్తావేమిటి? ముఖంమీద నీళ్ళు పోసుకో’ కోపంగా హెచ్చరించబోయిన ఘనీసుల్తాన్, ఆమె ఆ దృశ్యాన్ని చూపించేసరికి ఆనందాన్ని అణచుకోవటం చేతకాక సింహనాదం చేసినట్లు పొలికేక ఒకటి పెట్టాడు.

తమ కంటికి కనిపించని ప్రమాదం ఏదో తరుముకుంటూ వచ్చేస్తున్నట్లు భ్రమపడి చత్రాతి మీద కొట్టిన చిల్లపెంకుల మాదిరి తలా ఒక పక్కకు చెల్లాచెదురు అయిపోయారు అతని అనుచరులు.

ఎండుకారం అద్దినట్లు భగభగమంటున్న ముఖం మీద నీళ్ళు చల్లుకోవాలనే మాట మరిచిపోయి బండరాయి అవతలిపక్కకు పరుగుతీసింది జాబిల్లి. పిచ్చిపొదల మీద ముళ్ళు తన చేతుల్ని గాయపరుస్తాయని ఆలోచించకుండా వాటిని పీకి అవతల పడవేయటం మొదలు పెట్టింది.

‘నువ్వు మాకు దేవతవి. దారి చూపించాల్సిన మార్గదర్శివి. ఇటువంటి గొడ్డుచాకిరీ నువ్వు చేయకూడదు. ఇందుకు మేం ఉన్నాం’ అంటూ ఆమెను ఆపి, మరోసారి ఇంకో కేక పెట్టాడు ఘనీసుల్తాన్.

శత్రువులు ఎవరూ తరుముకు రావటం లేదని అప్పటికి అర్థమై, తిరిగి ఒకచోటికి చేరుకుంటున్న అతని అనుచరులు అర్జంటుగా వచ్చేశారు. రెండే రెండు నిమిషాల్లో ఆ ప్రదేశంలోని చెత్తనంతా అవతలికి గిరాటు వేశారు.

జాబిల్లి పనికట్టుకుని చెప్పవలసిన అవసరం లేకుండానే, అందరికీ అతిస్పష్టంగా అగుపించింది తామరపువ్వుల ఆకారంలో మలచబడి ఉన్న పెద్ద పెద్ద బండరాళ్ళు.

‘చాలాసార్లు ఇటుగా వచ్చాం. ఎన్నోసార్లు ఈ బండ దగ్గిరే మకాం పెట్టాం. ఈ బండలు ఇంత చక్కగా చెక్కిఉన్నట్టు ఎన్నడూ గమనించలేదు’ గుండెల మీద చెయ్యి వేసుకుంటూ అన్నాడు ఒక అనుచరుడు.

ఆ మాటల్ని వినిపించుకోలేదు జాబిల్లి. అంతకు ముందు తాను తీసుకున్న నిర్ణయాన్ని కూడా మర్చిపోయినట్లు, ఆ బండల మధ్యలోకి పోయి నిఠారుగా నిలబడింది.

ఎడమ చేతివైపు తల తిప్పి చూసింది.

‘ఏం కనిపించాలి? ఇక్కడి నుంచి మనం ఎటుపోవాలి?’ ఆత్రుతగా అడిగాడు ఘనీసుల్తాన్.

‘రెండు వందల నలభై మూడు గజాల దూరం పోవాలి. ఒక్క అడుగు కూడా తగ్గటానికి వీలు లేదు. పెరగటానికి అంతకంటే వీలుపడదు’ అంటూ ఎడమచేతివైపు నడక మొదలు పెట్టింది జాబిల్లి.

●●●

‘అయిపోయింది సాబ్. ఇక నడవదు ఇది. బలవంతం చేస్తే కాళ్ళు ఆరజాపి కింద పడుకుంటుంది’ తెల్లవారిన ఒక గంట తర్వాత శ్యామ్‌సుందర్‌కి చెప్పాడు మహాసుల్తాన్ బాడీగార్డు.

అతని మాటల్లో అతిశయం ఏమీలేదని శ్యామ్‌సుందర్‌కి తెలుసు. నడిచి నడిచి కాళ్ళు చచ్చుబడిపోయినట్లు ఈడుస్తోంది ఆ ఒంటె.

చీకటి సమయంలో విపరీతమైన జ్వరం వచ్చినట్లు సెగలు పొగలు వెలువర్చిన మహాసుల్తాన్ ఒళ్ళు వెలుగు వచ్చిన దగ్గర్నించీ చల్లబడిపోతూ ఉండటం శ్యామ్‌సుందర్‌కి భయాన్ని కలిగించటం మొదలు పెట్టింది.

‘నీళ్ళు నీళ్ళు చూడు’ ఎండి బీటలు వారినట్లు

## జరిగిన కథ

జుబ్బా కొండల్లో నిక్షిప్తమైన నిధికోసం జుబ్బా రాజ్య మహాసుల్తాన్ అన్వేషిస్తూ ఉంటాడు. ఫిలోలజి సబ్జెక్టు చదివే జాబిల్లికి పురాతన లిపిలో ఉన్న పత్రాలిచ్చి అధ్యయనం చేయమంటాడు మహాసుల్తాన్. అతడి సోదరుడు రహంతుల్లా ఆ నిధిని కాజేసేందుకు జాబిల్లిని కిడ్నాప్‌చేస్తాడు. అతడి చెరనుంచి తప్పించుకున్న జాబిల్లి ఘనీసుల్తాన్ మనుషులకు దొరికిపోతుంది. గూఢచారి శ్యామ్‌సుందర్, నఫీజు ఇద్దరూ జాబిల్లిని వెతుక్కుంటూ ఘాడీ పట్టణం వస్తారు. రహంతుల్లా జుబ్బారాజ్య నేతగా బాధ్యతలు చేపడతాడు. ఎడారిలో రహస్యంగా తల దాచుకున్న మహాసుల్తాన్‌ను శ్యామ్‌సుందర్ కలుసుకుంటాడు. జాబిల్లి సహాయంతో ఘనీసుల్తాన్ నిధి కోసం జుబ్బా కొండల్లోకి ప్రవేశిస్తాడు.

ఆ తర్వాత....

తయారయిన తన గొంతును తడుముకుంటూ చెప్పాడు బాడీగార్డుకి.

మరో పాతిక అడుగుల దూరంపోయి ఉన్నట్లుండి ఎగిరి గంతేశాడు అతను. 'దిగండి దిగండి' అంటూ అరిచాడు.

ముందు తను దిగాడు శ్యామ్‌సుందర్, అతని సాయంతో సుల్తాన్‌ని కిందికి దించాడు.

పది మూరల వైశాల్యంలో బెత్తెడు లోతున కనిపిస్తున్నాయి బాడీగార్డు గమనించిన నీటి గుంటలోని నీళ్ళు.

మహాసుల్తాన్‌ని దాని పక్కన పడుకోబెట్టి, ఒంటె దగ్గరికి తిరిగి వచ్చాడు శ్యామ్‌సుందర్. తనను మళ్ళీ ప్రయాణం చేయించటానికి వస్తున్నాడని భ్రమపడినట్లుంది. అంతకు ముందు బాడీగార్డు హెచ్చరించినట్లు గబుక్కున ఇసుకలో పడుకున్నది ఆ ఒంటె.

'ఓ.కే. ఓకే డియర్. నీ జోలికి ఇప్పుడప్పుడే వచ్చే ఆలోచన నాకులేదు. నీ నడుముకు వేలాడుతున్న సామాన్లు కావాలి' అంటూ దాని మూపురానికి వేలాడతీసి ఉన్న రెండు మూటల్ని ఇసుకలోకి దొర్లించాడు అతను.

తాము ఉపయోగించే ఆయుధాలకు అవసరమైన బుల్లెట్ పాకెట్లని ఒక మూటలో స్టోర్ చేసుకున్నారు రహంతుల్లా అనుచరులు. తాము ఆహారం తీసుకోవటానికి వీలుగా ఉండే ప్లేట్లను చిన్నచిన్న సత్తుపాత్రలను మరో మూటలో పెట్టుకున్నారు.

తన అవసరానికి తగిన సామాగ్రిని అంత త్వరగా, అంత తేలికగా అందించిన రహంతుల్లాకి మనసులోనే కృతజ్ఞతలు తెలియజేసుకుంటూ నీటి గుంట దగ్గరికి పోయాడు శ్యామ్‌సుందర్.

అతను చేయబోయేది ఏమిటో అర్థం అయిపోయింది బాడీ గార్డుకి. అటూఇటూ పరిగెత్తి దూరం దూరంలో కనిపించిన ఎండుపొదల్ని తీసుకువచ్చాడు. వాటిని అంటించి మంటవేశాడు.

పాత్రలో నీరు నింపి ఆ మంటమీద పెట్టాడు శ్యామ్‌సుందర్. బాడీగార్డు దగ్గర ఉన్న పిడిబాకును ఆ నీళ్ళలో ముంచి పట్టుకున్నాడు.

పావుగంట పాటు బుసబుసలాడుతున్న నీటిలో మునిగి ఉండడం వల్ల, స్టెరిలైజ్ అయింది బాకు మొన.

'ఫలిస్తుందా సాబ్, మీ ప్రయత్నం సక్సెస్ అవుతుందా?' గద్గద స్వరంతో అడుగుతున్న బాడీ



గార్డు మాటల్ని వినిపించుకోకుండా, అచేతనంగా పడి ఉన్న మహాసుల్తాన్ ఎడమ భుజం గాయం మీద కాన్సన్‌ట్రేట్ చేశాడు శ్యామ్‌సుందర్.

అప్పటివరకూ ఒక ఇంచుకూడా కదలని సుల్తాన్ ఉన్నట్లుండి కదిలి, అతనిచేతిని విదిలించి కొట్టటానికి ప్రయత్నించాడు.

చటుక్కున బాకును దూరంగా జరిపి పట్టుకున్నాడు శ్యామ్‌సుందర్.

'ఎవర్రా నువ్వు, ఏం చేస్తున్నావురా?' అస్పష్టంగానే అయినా చాలా కోపంగా వినవచ్చింది సుల్తాన్ కంఠం.

'సాబ్ మీ భుజంలో దిగిన బుల్లెట్లని..' అంటూ అనునయించబోయిన బాడీగార్డుని 'నువ్వు ఎవడివిరా?' అని అడిగాడు సుల్తాన్.

బిత్తరపోయాడు బాడీగార్డు. నీళ్ళు నిండిన కళ్ళతో శ్యామ్‌సుందర్ వైపు చూశాడు.

'ఫీవర్ టాప్ పిచ్‌లో ఉంది. బహుశా నూట ఆరు డిగ్రీల వరకూ వెళ్ళిపోయి ఉండవచ్చు. అంత ఉష్ణోగ్రతను మెదడు తట్టుకోలేదు, పిచ్చిమాటలు వచ్చేస్తాయి' అంటూ చటుక్కున ముందుకువంగి బాకుతో భుజం మీది గాయాన్ని కెలికాడు శ్యామ్‌సుందర్.

టప్‌మని వినవచ్చింది చిన్నపాటి శబ్దం. ఎగిరి ఇసుకలో పడింది ఒక బుల్లెట్. ఎర్రటి రక్తం గాయంలోనుంచి వెల్లువలా బయటికి వచ్చేసరికి తట్టుకోలేక కళ్ళు తేలేశాడు సుల్తాన్.

బాడీగార్డుకు మతిపోయినంత పని అయింది. బావురుమని ఏడ్వటానికి రెడీ అయిపోయాడు.

రెండో భుజం మీది గాయాన్ని కూడా బాకు మొనతో కదిలించాడు శ్యామ్‌సుందర్. అందులో ఉన్న బుల్లెట్‌ని కూడా బయటికిలాగి, 'కట్టు కట్టాలి, సిద్ధం అయినాయా?' అని బాడీగార్డుని అడిగాడు.

తన తలపాగాని చిన్నచిన్న పీలికలు చేసి, నీటి గుంటలో శుభ్రంగా జాడించి, బాకును స్టెరిలైజ్ చేసిన పాత్రలోనే ఉడికించి ఎండలో పెట్టి



ఒక్క ఐర్లాండ్ దేశంలో మినహా విండ్‌మిల్స్ ఎప్పుడైనా, ఎక్కడైనా గడియారానికి వ్యతిరేక దిశలోనే తిరుగుతాయి.

పట్టుకున్నాడు బాడీగార్డు.

చురచురమంటోంది ఎండ. అధికం అవుతోన్న వేడికి ఆరిపోయి ఉన్నాయి ఆ పీలికలు.

నెత్తురు వెలువరిస్తున్న గాయాలమీద వాటిని వేసి కట్టుకట్టాడు శ్యామ్‌సుందర్.

'చెడు నెత్తురు వెళ్ళిపోయింది. గాయాలు ఫ్రెషప్ అయ్యాయి. లెక్కప్రకారం యాంటీబయాటిక్ ఇంజక్షన్లు, చేయాలి. సెలైన్ ఎక్కించాలి. వాటన్నిటికీ బదులుగా ఎంతో కొంత నీడ ఏర్పాటు చేద్దాం. జ్వరం అధికం కాకుండా నీటితో శరీరాన్ని చల్లబరుద్దాం' అంటూ ఆ ఏర్పాట్లు మొదలు పెట్టబోతూ - అదిరిపడి ఆగిపోయాడు.

దుమ్ముతెరలు రేపుతూ కొందరు అశ్వికులు అటుగా వస్తూ ఉండటమే అందుకు కారణం.

ఆయుధాలు లేవు. అవతలికి పారిపోయేందుకు అవసరం అయిన ఓపిక కూడా లేదు. రహంతుల్లాదే అంతిమ విజయం అయినట్లు తోచింది అతనికి.

**జుబ్బా కొండల్లో ఉన్న నిధికి సంబంధించిన ఆధారాన్ని బండరాళ్ళ మధ్యలో అనుకోకుండా గమనించింది జాబిల్లి. ఆశ్చర్యపోయింది. ఘనీసుల్తాన్‌కి చూపించింది. అతడు ఎగిరి గంతేశాడు హుషారుగా. మరింత ఉత్సాహంతో ఆ ప్రాంతంలో మిగిలిన గుర్తులకోసం వెతకడం మొదలెట్టారు. ఇంతకూ జాబిల్లికి నిధి జాడ దొరికిందా? లేదా?**

'మనం పడిన శ్రమంతా వేస్ట్ అయిపోయింది మై ఫ్రండ్' అని బాడీగార్డుతో చెపుతూ, పక్కకు పడవేసిన పిడి బాకును పట్టుకుని, నిటారుగా లేచి నిలుచున్నాడు.

అరే... మీరా.. మీరు ఇక్కడికి ఎలావచ్చారు? ఎందుకు వచ్చారు?' ముందుగా దగ్గరికి వచ్చిన గుర్రం మీది నుంచి కిందికి దూకుతూ, ఆశ్చర్యంగా అడిగాడు మొట్టమొదటి అశ్వికుడు.

ఎండ అధికం అవుతూ ఉండడం వల్ల, తనకు కూడా టెంపరేచర్ ఎక్కువై మైండు పనిచేయటం మానేసిందేమో అనిపించింది శ్యామ్‌సుందర్‌కి.

'నువ్వు నువ్వు దాసోబువి కదూ! నువ్వు కనిపించిన మరుక్షణం నిన్ను, నీ చంచాలని కాల్చి చంపమని మా సుల్తాన్ ఆజ్ఞ' పళ్ళు బిగిస్తూ అన్నాడు శ్యామ్‌సుందర్ వెనుక నిలబడిన బాడీగార్డు.

అతను అరవటాన్ని చూసి బిగ్గరగా నవ్వాడు ఆ మనిషి. 'ముఖం మూసిఉన్నప్పటికీ చిటికెలో కనిపెట్టేశాడు ఇతను. మాకు ఎంతో కావాల్సిన వాళ్ళు అయి ఉండి కూడా మీరు పోల్చుకోలేకపోయారు' శ్యామ్‌సుందర్‌తో అంటూ తన ముఖానికి అడ్డుగా ఉన్న తలపాగా అంచు పక్కకు తొలగించాడు.

కాల్షియం ఇంజక్షన్ చేసినట్లు ఒక్కసారిగా పొంగి పోయింది శ్యామ్‌సుందర్ శరీరం.

'దాసోబూ.. ఈ సమయంలో నువ్వు కనిపిస్తావని అనుకోలేదు. ఎలా వచ్చావ్? ముందుకు అడుగు వేసి ఆప్యాయంగా కరచాలనం చేస్తూ అడిగాడు.

'మీకు ముందుగానే చెప్పాను. జుబ్బాకొండల దగ్గిర మా జాతులన్నీ చేరి పండుగ చేసుకుంటాయని' నవ్వుతూ అన్నాడు దాసోబూ.

అంతకుముందు సుల్తాన్‌ని, అతని బాడీగార్డుని చూసినప్పుడు తమకు గుర్తుకు రాబోయి - మధ్యలోనే మాయం అయిన మాట అదేనని అప్పుడు స్ఫురించింది శ్యామ్‌సుందర్‌కి.

'సరైన సమయానికి దేవుడి మాదిరి వచ్చావు. మాకు నీ సహాయం కావాలి" అంటూ అచేతనంగా పడిపోయి ఉన్న మహాసుల్తాన్‌ని చూపించాడు. జరిగింది ఏమిటో క్లుప్తంగా చెప్పాడు.

'మేము మహాసుల్తాన్ దృష్టిలో ఎడారి దొంగలం. కనిపించగానే కాల్చి చంపాల్సిన పాపాత్ములం. ఎందుకు సాయం చెయ్యాలి' నడుం మీద చేతులు వేసుకుంటూ గంభీరంగా అడిగాడు దాసోబూ.

ఎటువంటి శత్రువు అయినా నమ్మకద్రోహం వల్ల ప్రాణాలు పోగొట్టుకోవటం మంచిదికాదు. వీరుడు ఎప్పుడూ తన శత్రువుల్ని తనే నాశనం చేస్తాడు. వేరే వాళ్ళు ఆ పని చేస్తుంటే చూస్తూ నిలబడటం వీరత్వం అనిపించుకోదు' తను కూడా గంభీరంగానే అన్నాడు శ్యామ్‌సుందర్.

'మా దగ్గర ఇంతకంటే మంచిమాటలు చెప్పగల పెద్దలు చాలామంది ఉన్నారు. ఇప్పుడు ఈ పెద్దమనిషికి సాయం చేయడం అంటే దారిన పోయే ఎడారి భూతాన్ని సాదరంగా గుడారంలోకి ఆహ్వానించడమే. బతికి బయటపడిన రెండో నిమిషంలో తన సైనికులతో వచ్చి మమ్మల్ని నిలువునా నరికించి వేస్తాడు' అన్నాడు దాసోబూ.

'మహాసుల్తాన్ ప్రాణాపాయస్థితిలో ఉన్నాడు. మూడు వంతులు బతికి బైట పడకపోవచ్చు. మీ కష్టాలు తీరిపోతాయని భావిస్తున్నారా? ఎడారి భూతం వంటి ఇతని సోదరుడు రాజు కాబోతున్నాడు, అతగాడు మిమ్మల్ని వదిలి పెడతాడా?' సూటిగా అడిగాడు శ్యామ్‌సుందర్.

తన పద్ధతిలో తిరిగి తన అనంగీకారాన్ని తెలియచేయటం కోసం నోటిని తెరవబోయి చటుక్కున ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నాడు దాసోబూ.

'పవిత్రమైన మా పండుగ జరిగే ప్రదేశంలోకి మా శత్రువును తీసుకుపోవడం నాకు ఇష్టం లేదు. మీకు అభ్యంతరం లేకపోతే ఇక్కడే సరైన ఏర్పాట్లు చేస్తాను' అంటూ సమాధానం కోసం ఎదురు చూడకుండా తన అనుచరులకు సైగ చేశాడు.

తమ గుర్రాలను వెనక్కితిప్పి వచ్చిన దారినే పరుగులు తీయించారు వారిలో నలుగురు. అరగంట తరువాత ఒక వయోవృద్ధుడిని, చిన్న గుడారం నిలబెట్టటానికి అవసరమైన సామాగ్రిని తమతో తీసుకువచ్చారు.

పదేపది నిమిషాల్లో ఎండలో నుంచి గుడారంలోకి ట్రాన్స్‌ఫర్ చేయబడ్డాడు మహాసుల్తాన్.

ఆయన భుజాలకు శ్యామ్‌సుందర్ కట్టినకట్లు విప్పి, గాయాలను నిశితంగా పరిశీలించాడు వయోవృద్ధుడు.

'బుల్లెట్లను బయటికి తీయడమే కాకుండా చెడు రక్తాన్ని పిండివేయటం చాలా బాగుంది. చక్కటి చర్య..' అని మెచ్చుకుంటూ, తనతోపాటుగా తీసుకువచ్చిన చిన్నసంచీలో నుంచి ఏదో మందు గాయాలమీద వేసి మళ్ళీ కట్టుకట్టాడు. ఎరుపు రంగులో ఉన్న ఇంకో పొడి తీసి తేనెలో రంగరించి

సుల్తాన్ పెదవులకు అడ్డాడు.

'గాయాలై రోజులు గడిచిన తర్వాత కూడా ఇంకా ప్రాణాలు వదలలేదంటే ఈ మనిషికి కండ బలంతో పాటు గుండెబలం కూడా ఎక్కువేనని తెలుస్తోంది. జ్వరం తగ్గిపోయిందంటే ప్రమాదం నుంచి బైట పడినట్లే...' అంటూ తన అభిప్రాయం వెల్లడించాడు.

విపరీతమైన ఆందోళనతో ఉన్న బాడీగార్డు వదనం నవ్వులమయమై పోయింది ఒక్కసారిగా.

'ఎవరికీ ద్రోహం చెయ్యలేదు మా ప్రభువు. తప్పకుండా కోలుకుంటాడు' తడి కనులను తుడుచుకుంటూ గద్గద స్వరంతో అన్నాడు.

'మా వాళ్ళు ఇద్దరు ఇక్కడే ఉండి మీకు సాయం చేస్తారు' అంటూ తన అశ్వం దగ్గరికి బయలు దేరాడు దానోబూ.

అతను చెప్పిన ఇద్దరు కాకుండా మిగిలిన వారందరూ అతనితో పాటు గుర్రాలు ఎక్కటాన్ని చూసేసరికి ఆశ్చర్య మనిపించింది శ్యామ్‌సుందర్‌కి.

'పండుగ రోజుల్లో మీ తండాలను వదిలి ఎడారిలో చక్కర్లు కొట్టటం దేనికి? ఇది కూడా పండుగలో భాగమా?' అని అడిగాడు.

రెండు క్షణాలు తటపటాయించి, సమాధానం ఇచ్చాడు దానోబూ.

'పరాయివారు ఎవరూ పాలు పంచుకోకూడని పండుగ మాది. ఈ సమయంలో సామాన్యంగా పరాయివారెవరూ ఈ కొండల దగ్గరికి రారు. కాని ఈ రోజు ఉదయం ఒక గుంపు మాకు కనిపించింది. ఎవరో తెలుసుకోవాలి. ఎందుకు వచ్చారో అడిగి అవతలకి పంపించేయాలి' అంటూ తన వాహనాన్ని అదిలించి వేగంగా పరుగు తీయించాడు.

దుమ్ముతెరలు రేపుతూ పోతున్న అతన్ని, అతని అనుచరుల్ని చూస్తూ శిలా విగ్రహం మాదిరి గుడారం దగ్గరే నిలుచుండిపోయాడు శ్యామ్‌సుందర్.

ఒంటెల్ని తాము దూరంగా తరమటంవల్ల, రహంతుల్లా సైనికులు కొండల్లోకి వచ్చి ఉంటారు? దానోబుకి కనిపించింది ఆ గుంపే అయి ఉంటుందా?

ఎంతగా ఆలోచించినా సమాధానం లభించక పోవడంతో విసుగ్గా తల విదిలించి, నీటిగుంట దగ్గరికి పోయాడతను. దోసిటతో నీటిని తలమీద పోసుకున్నాడు. దాహం తీర్చుకున్నాడు. తిరిగి వచ్చి గుడారం ద్వారం దగ్గర నీడలో కూర్చు న్నాడు.

•••

మిట్ట మధ్యాహ్నం అవుతుండగా ఖాళీ అయి పోయింది నఫీజు దగ్గర ఉన్న నీటి సంచీ. ఆహారపు మూటను అతిథి సత్కారాలకు వినియోగించటం వల్ల, ఆకలి మాత్రం అధికం అవడం ప్రారంభించింది.

'ఏ పని చేసినా ముందు వెనకలు ఆలోచించుకుని చేయాలని పెద్దలు ఊరికే కాలక్షేపం కోసం చెప్పలేదు. నాలాంటి వాడిని క్షుణ్ణంగా గమనించిన తర్వాతనే ఆ మాటల్ని వెలువర్చారు.' తనలో తాను అనుకుంటూ కనులు చిట్లించుకుని చూశాడు.

రహంతుల్లా అనుచరులు ఎవరూ అగుపించ లేదు గాని, అల్లంత దూరంలో జుబ్బా గుట్టలు దర్శనం ఇచ్చాయి.

'కొండల్లో గుట్టల్లో ఏదో ఒక జీవం మనకి కనిపించకుండా ఉండదు. ఒక్కటంటే ఒక్కటి కనిపిస్తే చాలు ఈ రోజుకి మన అవసరం తీరిపోతుంది' అని అనుకుంటూ వేగంగా నడక మొదలు పెట్టాడు.

గుట్టలు ఇంకో ఫర్లాంగు దూరంలో ఉన్నాయనగా అతని దృష్టి పథంలోకి వచ్చింది ఒక మోటార్ వెహికల్.

నిలబడి ఉన్నవాడు కాస్తా చటుక్కున బోర్లా పడిపోయాడు ఇసుకలో. కనులు చిట్లిస్తూ తదేక దీక్షగా చూశాడు అటుకేసి.

ఎటువంటి ఇసుక నేలమీద అయినా హాయిగా ప్రయాణం చేయగల వెహికల్ అది. ఎడారి వేడిమిని తట్టుకోవటానికి వీలుగా ఎయిర్ కండిషన్ చేయబడింది.

'తప్పకుండా అది రహంతుల్లాకి చెందినదే అయి ఉంటుంది' అనుకున్నాడు అతను. అవతలికి వెళ్ళిపోవటం మంచిదని కూడా భావించాడు.

అంతలోనే అసలు తను ఎడారిలోకి ఎందుకు వచ్చాడో గుర్తుకు వచ్చేసరికి అర్జంటుగా ఆ ఆలోచన అదిమేసుకున్నాడు.

'ఎవరూ చూడకుండా వెహికల్‌లో కూర్చుని ఉంటారు బద్మాష్‌లు. దగ్గరికిపోయి చూస్తేగాని వివరాలు తెలియవు' అని నిర్ణయించుకుని, పాము మాదిరి మోచేతులమీద పాకుతూ వెహికల్‌కి వందఅడుగుల దూరంలోకి పోయాడు.

తాను ఊహించిన విధంగా రహంతుల్లా అనుచరులు వెహికల్‌లోనే ఉండి ఉంటే.. మిట్ట మధ్యాహ్నపు ఎండలో సినిమా హీరో మాదిరి పాకుకుంటూ వస్తున్న తనను ఎప్పుడో గమనించటం జరిగిపోయి ఉండేదని తోచింది అతనికి. తన అతి తెలివికి తనే సిగ్గుపడుతూ పైకిలేచి పదే పది అడుగుల్లో వెహికల్‌కి దగ్గరగా పోయాడు.

అప్పుడుకూడా తనను ఎవరూ గమనించక పోవడం ఆశ్చర్యం కలిగించింది అతనికి. 'నిద్రపోతూ ఉండాలి. ప్రాణాలు వదిలి పెట్టయినా ఉండాలి' అనుకుంటూ వెహికల్ చుట్టూ రెండు రౌండ్లు కొట్టి, అతి నెమ్మదిగా డోర్ హేండిల్‌ని పట్టుకున్నాడు.

వెంటనే తెలిసిపోయింది అతనికి. లాక్ చేయబడి ఉంది అది. అంటే వెహికల్‌లో ఎవరూ లేనట్టు లెక్క.

అది రహంతుల్లా అనుచరులు ఉపయోగించే వ్యానని కన్‌ఫర్మ్ అయిపోయింది అతనికి. వెహికల్‌ని అక్కడ వదిలి గుట్టల్లోకి పోయి ఉంటారు అందరూ. బహుశా మహాసుల్తాన్ ఆ గుట్టల్లోనే తల దాచుకుని ఉండి ఉండవచ్చు.

ఆకలిని మర్చిపోయాడు నఫీజు. రెట్టించిన ఉత్సాహంతో ఎదురుగాఉన్న గుట్టమీదికి పరుగు తీశాడు.

## బాలకృష్ణకి తల్లి దొరికింది

హీరో బాలకృష్ణకి ఇప్పుడు తల్లి దొరకడం ఏమిటి? అని ఆశ్చర్యపోకండి. 'గౌతమి పుత్ర శాతకర్ణి' సినిమాలో బాలకృష్ణ తల్లిగా బాలీవుడ్ డ్రీమ్‌గర్ల్ హేమమాలిని చేయబోతోందట! ఈ పాత్రకు చాలా మంది సీనియర్ నటీమణుల్ని అనుకున్నారు. కానీ హేమమాలిని అయితే బాగుంటుందన్న ఉద్దేశంతో ఆమెను అప్రోచ్ అవగా ఆమె దీనికి అంగీకరించిందని అంటున్నారు. అయితే ఇంకా అధికారికంగా ప్రకటన రావలసి ఉంది. ఇదే నిజమైతే దాదాపు నాలుగున్నర దశాబ్దాల తరువాత హేమమాలిని తెలుగుతెర మీద ప్రేక్షకులకు కనిపించనుంది.



ఎడారిలో తిరిగే పొడలపాము తోక మాదిరి మొండిగా కనిపించింది అతనికి ఆ గుట్ట. పాతిక అడుగుల ఎత్తుకు పోయిన తర్వాత - కనిపించారతనికి ఎక్కడో దూరంలో ఒక ఎత్తయిన కొండ దగ్గర గుంపుగా నిలబడి ఉన్న కొంతమంది జనం.

దుస్తుల్లో జాగ్రత్త చేసుకున్న కత్తిని ఒకసారి తడుముకుని, క్షణం కూడా ఆలస్యం చేయకుండా గుట్టదిగాడు అతను. తాను గమనించిన జనం తనను చూడకుండా జాగ్రత్తలు తీసుకుంటూ అటుకేసి నడవటం మొదలు పెట్టాడు.

•••

'ఇంకా ఎంతసేపు ఆలోచిస్తావ్? రెండు గంటల్లో చీకటి పడిపోతుంది. చీకటి సమయంలో ఈ బండల మధ్య తిరగటం ప్రమాదకరం' కచ్చాగా జాబిల్లిని హెచ్చరించాడు ఘనీసుల్తాన్.

ఎత్తుగా ఉన్న కొండ దగ్గర, అనువుగా ఉన్న ఒక బండరాయిని ఎంచుకుని, చాలా తీరికగా కూర్చుని ఉంది ఆమె.

'మహాసుల్తాన్ కంటే ముందుగా ఎంతమంది ఈ నిధికోసం వెతుకులాడి ఉంటారని నీ అభి ప్రాయం.' అతని మాటలకు కొంచెంగా కూడా బెదరకుండా అడిగింది తియ్యగా.

'అబ్బో ఒకళ్ళా ఇద్దరా వందలువేల మంది ప్రయత్నం చేసి ఉంటారు. నిన్న మొన్నటిది కాదు గదా అది. వేల సంవత్సరాల కిందటిది' ఇష్టం లేక పోయినా చెప్పక తప్పలేదు అతనికి.

'అంతమంది నెత్తీ నోరూ కొట్టుకున్నా కని పించని ఆ నిధి నాకు ఒకే ఒక రోజులో కనిపి స్తుందని ఎలా అనుకుంటున్నావు?' అతన్ని సూటిగా అడిగింది జాబిల్లి.

'అది... దాని రహస్యాన్ని నువ్వు కనిపెట్టావు. అందుకే రహంతుల్లా నీవెంట పడ్డాడు' అన్నాడు




ఘనీసుల్తాన్.

'రహస్యం కనిపెట్టటం లేదు. ప్రత్యక్షంగా వెతికి పట్టుకోవడం లేదు. నేను చూసిన పుస్తకంలో గుర్తులు ఉన్నాయి. ఇంతంత ఎత్తులో లేవు అవి' తన వెనకున్న కొండను చూపిస్తూ ఓపికగా చెప్పింది జాబిల్లి.

'పాము తోక, తామరపువ్వు అని చెప్పావు. కనిపించాయి. తర్వాతి గుర్తు ఏమిటో ఇంత వరకూ బయట పెట్టలేదు. తీసుకువచ్చి ఇక్కడ కూర్చోబెట్టావు గోళ్ళు గిల్లుకోవటానికి' కోపంగా అన్నాడు ఘనీసుల్తాన్.

'సింహం తల, ఒంటె మూపురం కనిపించాలి' అన్నది జాబిల్లి.

ఘనీసుల్తాన్ పని కట్టుకుని ఆర్డర్ ఇవ్వవల సిన అవసరం లేకపోయింది. చెవులు రిక్కించి వింటున్నారు అతని అనుచరులు. ఛెంగున లేచి తలా ఒక పక్కకు పరుగు తీశారు.

తాను కూడా వారిని అనుసరించబోయి కదలకుండా కూర్చుని ఉన్న జాబిల్లిని గమనించి ఆగిపోయాడు ఘనీసుల్తాన్.

'నేను ఇక నడవలేను. నా కాళ్ళు నొప్పులు పుడుతున్నాయి. ఆ గుర్తులు కనిపించిన తర్వాత చెప్పండి' అంటూ అప్పటి వరకూ బండకు చేర గిలబడి కూర్చున్నది కాస్తా తలకింద చేయి పెట్టు కుని కటికనేల మీద పడుకున్నది జాబిల్లి.

ముంచుకువచ్చేసింది కోపం ఘనీసుల్తాన్‌కి. 'మర్యాదగా లేచి నువ్వు కూడా ఆ గుర్తుల్ని వెతుకు. లేకపోతే గొంతు పిసికి చంపేస్తాను' కరుకు కంఠంతో హెచ్చరించాడు.

'నా గొంతు పిసికితే ఆ గుర్తుల తర్వాత ఏం చేయాలో నీకు తెలుసా?' పడుకున్న ప్రదేశంలో నుంచి లేవకుండానే అడిగింది జాబిల్లి.

పటపటమని శబ్దం బయటికి వినిపించే టంత గట్టిగా పళ్ళు కొరికాడు ఘనీసుల్తాన్.

'నా మంచితనాన్ని నువ్వు బలహీనతగా భావిస్తున్నావు' అన్నాడు.

'నువ్వు ఏమని అనుకున్నా ఐ డోన్ట్ కేర్. నా బలహీనతని ఆధారం చేసుకుని ఇక్కడి దాకా తీసుకు వచ్చారు మీరు. ఇప్పటిదాకా మీరు చెప్పి నట్టు చేశాను. ఇకమీదట చేయను' అంటూ అవ తలి పక్కకు తిరిగింది జాబిల్లి.

ఫెడీఫెడీమని పాదాలతో నేలను తన్నాడు ఘనీసుల్తాన్. రెండు అడుగులు వేశాడు ఆమె వైపు. అంతలోనే ఆమె హెచ్చరిక గుర్తుకు వచ్చింది కాబోలు. వెనక్కి జరిగి, తను కూడా కింద చతి కిల పడ్డాడు.

చీకట్లు చుట్టుముట్టబోతూ ఉండగా వెనక్కి వచ్చారు తలా ఒక పక్కకుపోయిన అతని అనుచ రులు.

నోళ్ళు తెరచి చెప్పకముందే, వారి ప్రయత్నాలు వృథా అయినట్టు అర్థం అయింది ఘనీసుల్తాన్‌కి.

'ఇవాళ పని పూర్తి అయిపోతుందని ఆశ పడ్డాం. తిండికి తాగటానికి వెంట తెచ్చుకున్న వన్నీ నిండుకున్నాయి. వెనక్కి పోవటానికి ఆరు గంటలు, వాళ్ళు రావటానికి ఆరు గంటలు. మన జీవితం ఇక్కడే తచ్చట్లాడటానికి సరిపోతుంది' అన్నాడు ఒక అనుచరుడు.

అప్పటికప్పుడు ఆలోచించి తన దుస్తుల్లో భద్ర పరుచుకున్న వెహికల్ తాళం చెవుల్ని అతని వైపు విసిరాడు ఘనీసుల్తాన్

'వెహికల్‌ని స్టార్ట్‌చేసి సాధ్యమైనంత దగ్గరికి తీసుకురా' అన్నాడు.

'ఆ తామరపువ్వు రాళ్ళవరకే వస్తుంది. ఆపైన రాదు' అన్నాడు ఆ అనుచరుడు.

'అయితే అక్కడే ఆపండి. లోపలున్న మన సరంజామానంతా మోసుకు వచ్చేయండి' మరి కొంతమందిని సెలక్ట్ చేస్తూ చెప్పాడు ఘనీ సుల్తాన్.

అలసిపోయి ఉన్నారు అందరూ. అయినా వేరే మార్గం లేదని తెలియటంవల్ల నీరసంగా నడుస్తూ ఎడారిలోకి బయలుదేరారు.

ఒకరి వెనుక ఒకరుగా మిలటరీ వాళ్ళ మాదిరి వస్తున్న ఆ దృఢకాయుల్ని అల్లంత దూరంలో ఉండగానే గమనించి ఒక బండచాటుకు జంప్ చేశాడు నఫీజు.

ఆరు అడుగుల దూరంలో నుంచి పోయారు అందరూ. ఆఖర్లో ఒకే ఒక మనిషి తప్ప.

'ఏమయింది నీకు? ఎందుకు ఆగిపోయావు?' అసహనంగా అడిగాడు ఘనీసుల్తాన్ దగ్గర్నించి వెహికల్ తాళం చెవులుతీసుకున్న దృఢకాయుడు.

'వాసన... ఏదో పరాయివాసన. అర్థం కావడం లేదు' తోడేలు మాదిరి ముఖాన్ని పైకి ఎత్తి గాలి వాసన చూస్తూ అన్నాడు ఆ మనిషి.

ముడుచుకు కూర్చుని ఉన్నాడు నఫీజు బండ రాయిచాటున. తలను ఆ బండకేసి కొట్టుకోవాల న్నంత నిర్వేదం ఆవరించుకున్నది అతన్ని.

ఏ ముహూర్తంలో సముద్రాన్ని దాటి వచ్చారో గాని, తమ శరీరాలు ఆ ఏరియాకి సంబంధించి నవి కావని తెలిసిపోతున్నది అందరికీ. ఎలా అధిగమించాలి ఈ ప్రాబ్లెమ్‌ని.

తన సందేహానికి సరైన సమాధానం లభిం చకముందే, మరో అడుగు ముందుకు వేశాడు ఆ మనిషి.

'మీరు నడుస్తూ ఉండండి. నేను వచ్చి కలుసు కుంటాను' అన్నాడు తన వారితో.

తమలో తాము ఏదో గొణుగుకుంటూ నడక ప్రారంభించారు వాళ్ళు. మరో అడుగు వేశాడు ఆగిపోయిన మనిషి.

మండిపోయింది నఫీజుకి. 'తలవంచుకుని ప్రతి అడ్డమైన వాడికీ భయపడుతూ బ్రతకటం ఎక్కువైపోయింది ఈ మధ్య. ఇంక లాభం లేదు. వీళ్ళ వాలకం మిలటరీ వాళ్ళ మాదిరిగా కనిపిం చడం లేదు కాబట్టి తెగించడం చాలా బెస్టు' అంటూ అమాంతం బండచాటునుంచి లేచాడు.

అతను అలా ప్రత్యక్షం అవుతాడని ఊహించ లేదు ఆ మనిషి. అదిరిపడి వెనక్కి దూకాడు. గంగాళం మాదిరి నోరు తెరిచి గయ్‌మని అరవ టానికి ట్రై చేశాడు.

లావుపాటి కొండరాయి పట్టుకునే పైకి లేచాడు నఫీజు.

*(ఇంకావుంది)*

# కిడ్నీలో రాళ్ళు

మూత్రపిండాల్లో రాళ్ళు ఏర్పడటం అనేది ఈ మధ్యకాలంలో చాలా ఎక్కువగా జరుగుతుంది. ఒక సర్వే ప్రకారం భారతదేశంలో పురుషుల్లో 10.6% మందిలో మరియు స్త్రీలలో 7.1% మందిలో ఈ సమస్యతో బాధపడుతున్నారు. దీనికి మారిన జీవనశైలి, ప్రపంచ ఆధునీకరణ, మారిన ఆహార అలవాట్లు, స్థూలకాయం వంటివి ప్రధాన కారణాలుగా భావించవచ్చు. ఇది మన శరీరం యొక్క భారీ కర్మాగారం. ఇందులో నిరంతరం రకరకాల జీవక్రియలు జరిగిపోతూనే ఉంటాయి. వీటిని బయటకు పంపించంటంలో మూడు అవయవాలు కీలకపాత్ర పోషిస్తుంటాయి. మూత్రపిండాలు, ఊపిరితిత్తులు, చర్మం ఈ మూడు ముఖ్యమైన విసర్జక అవయవాలు. మళ్ళీ వీటిలో కూడా 90% మలినాలను విసర్జించేవి మూత్రపిండాలే. మూత్రపిండాలు రక్తంలోని విషపదార్థాలను అదనంగా ఉన్న నీటిని క్రమంగా తొలగిస్తుంటాయి. మన కిడ్నీలు ప్రతీరోజు 200 లీటర్ల రక్తాన్ని వడపోస్తాయి.

నేటి ఉరుకు పరుగుల జీవితాల్లో చాలామంది సరిపడా నీళ్ళు కూడా తాగలేకపోతున్నారు. ఫలితంగా ఈ కిడ్నీ రాళ్ళతో సతమతమయ్యే వారి సంఖ్య నానాటికీ పెరిగిపోతుంది. చాలా సందర్భాల్లో ఈ రాళ్ళు చాలా చిన్నవిగా ఉంటూ మూత్రంలో విసర్జింపబడతాయి. కొన్ని సందర్భాల్లో రాళ్ళు పరిమాణం పెద్దగా ఉండటం కాని, మూత్రనాళాల్లో చిక్కుకొని తీవ్రమైన నొప్పిని కలిగిస్తాయి.

**కారణాలు:** అధిక బరువు, ద్రవపదార్థాలు తీసుకోకపోవటం. మూత్రఅవయావాల్లో వచ్చే ఇన్‌ఫెక్షన్. నీరు తగినంత తాగకపోవడం. జన్యుపరమైన ఇన్‌ఫెక్షన్‌లు. ఎక్కువగా వేడి వాతావరణంలో ఉండటం. వంశపారంపర్యం. కొన్ని రకాల మందులు వాడటం.

**లక్షణాలు:** పొత్తికడుపులో తీవ్రమైన నొప్పి, నీరసం, వికారం, తీవ్రమైన జ్వరం. విపరీతమైన చమటలు, బరువు తగ్గడం. మూత్రంలో రక్తంపడటం (దీన్ని హిమచ్యూరియా అంటారు) మూత్రంలో మంట రావటం. మూత్రంలో చీము రావడాన్ని పైయూరియా అంటారు.




**జాగ్రత్తలు:** నీటిని ఎక్కువగా తాగాలి, నీరుగాని ఇతర ద్రవ పదార్థాలు గాని మొత్తంగా కలిపితే రోజుకు 4 లీటర్లు తగ్గకుండా తీసుకోవాలి. కిడ్నీలో అప్పటికీ ఆక్సలేట్ రాళ్ళు ఉంటే, ఆక్సలేట్ ఉండే పదార్థాలు అంటే చాక్‌లేట్, పాలకూర, సోయా, ఎండు చిక్కుడు ధాన్యాలాంటివి తీసుకోకుడదు. కాల్షియం సిట్రేట్‌కు కిడ్నీలో రాళ్లు ఏర్పడకుండా నివాలించే లక్షణం ఉంది కాబట్టి అవి శరీరానికీ అందేలా ఆహార నియమాలను పాటించడం మంచిది. కూల్‌డ్రింకులను అస్సలు తాగకూడదు.



డా. మురళి అంకిరెడ్డి
M. D (Homeo)
స్టార్ హోమియోపతి

**నిర్ధారణ పరీక్షలు:** కిడ్నీ ఎక్స్‌రే, అల్ట్రాసౌండ్ స్కాన్ & కిడ్నీ పరీక్ష, రక్తపరీక్ష, మూత్ర పరీక్ష,

**హోమియో చికిత్స:** హోమియోపతిలో శారీరక, మానసిక, లక్షణాలను పరిగణలోకి తీసుకొని ఎలాంటి సర్జరీ అవసరం లేకుండానే కిడ్నీలోరాళ్ళు పరిమాణం మరియు అవి ఏ వైపున ఏర్పడ్డాయో వాటి ఆధారంగా మంచి మందులు అందుబాటులో ఉన్నాయి. ముఖ్యంగా బెరిబెరి వల్గరీస్, సరసపరిల్ల, కల్కేరియకార్బ్, కోలోసింత్ మందులను డాక్టర్ పర్యవేక్షణలో వాడాలి.



# సయాటికా (గుధ్రసీ వాతము)

ప్రస్తుత పరిస్థితిలో మానవుని జీవితం చాల యాంత్రికంగా మారిపోయింది. ముఖ్యంగా ఆహారపు అలవాట్లు, దినచర్య స్వప్న విపర్యయం (పగటి నిద్ర, రాత్రి సమయానికి నిద్రపోకపోవటం) లాంటి విషయా లలో అనేక మార్పులు రావటం వలన, ఆందోళన, మానసిక ఒత్తిడి లాంటిసమస్యల వలన మానవులు అనేక వ్యాధుల బారిన పడు తున్నా రు. అందులో అతి ముఖ్యమైనది (నడుము నొప్పి) కటిశూల. నూటికి 90 మంది తమ జీవిత కాలంలో ఎప్పుడో ఒకసారి ఈ నడుమునొప్పి సమస్యతో బాధపడుతున్నారు. ఆయుర్వేదశాస్త్రం లో చరక, సుశ్రుత, వాగ్భటులు ఈ సమస్యను గుధ్రసీవాతం (సయాటికా)గా పేర్కొంటూ ఎంతో విపులంగావివరించారు. దీనికి సాధారణ కారణాలు పరిశీలించినట్లయితే... ఎక్కువగా ఒకే పొజిషన్‌లో కూర్చోవటం, స్థూలకాయం, అధికశ్రమతో కాడిన పనులుఎక్కువసేపు చేయటం, అధిక బరువులను మోయుటం, ఎక్కువదూరం ద్విచక్ర వాహనాలు, కార్లలో ప్రయాణించటం, కొన్ని దీర్ఘకాలికవ్యాధుల వలన, కొన్ని వంశపారంపర్య వ్యాధుల వలన, మరి కొన్ని రోడ్డు ప్రమాదాలవలన ఈ నడుము నొప్పి సమస్య వస్తుంటుంది. ముఖ్యంగా పైన వివరించిన కారణాల వలన శరీరంలో వాతప్రకోపం జరిగి, ముందుగా పిరుదులకు పైభాగాన స్తబ్ధతను, నొప్పిని కలిగించి తరువాత కటి ప్రదేశం (నడుము), తొడలు, మోకాళ్ళు, పిక్కలు, పాదాలలో క్రమంగా నొప్పి కలుగుతంది. దీనినే గుద్రసీవాతాము (సయాటికా)అని అంటారు. ఈ సమస్య శీతాకాలం లో ఎక్కువ అవుతుంది. ముఖ్యంగా నడుముకు సంబంధించిన ఎల్4-ఎల్5, ఎస్1-ఎస్2 వెన్నుపూసల మధ్యగల సయాటికాఅనే నరంపై ఒత్తిడి పడటం వల్ల ఈ నొప్పి వస్తుంది.

**డిస్క్‌లో వచ్చే మార్పులు:** ఈ వ్యాధిలో వెన్నుపూసల మధ్య ఉండే డిస్క్‌లో కొన్నిమార్పుల జరుగుతాయి. అవి డిస్క్ మీద ఒత్తిడి పెరగటం, వాపు రావటం లేదా డిస్క్‌కి రక్తప్రసరణ సరిగా లేకపోవటం, అరిగి పోవటం అనే సమస్యల వల్ల ఈ నొప్పి వస్తుంది. డిస్క్‌లో వాపు వస్తే దానిలో ఉండే చిక్కని ద్రవం బయటకు వచ్చి మేరుదండం లేదా దాన్నుంచి వచ్చే నరాలపై ఒత్తిడి కలిగంచటం వల్ల నొప్పి వస్తుంది.

**లక్షణాలు:** నడుములో నొప్పి కలగటం, వాపు, కొంచెం శారీరక శ్రమ చేయగానే నొప్పి తీవ్రత పెరగటం, ఈ నొప్పి సూదులతో గుచ్చినట్లుగా, ఒక్కోసారి తిమ్మిర్లు, మంటలతో కూడి ఉంటుంది. సమస్య తీవ్రమైనది అయితే స్పర్శహాని కూడా కలుగ వచ్చు. ఒక్కోసారి మల మూత్రాల మీద నియంత్రణ కూడా పోయే ప్రమాదం ఉంది. వెన్నునొప్పి బాధఅనగానే సాధారణం గా పెయిన్‌కిల్లర్స్‌తో కాల యాపన చేస్తుంటారు. దీని వల్ల తాత్కాలికఉపశమనం కల్గుతుంది. కాని మలబద్ధకం, జీర్ణాశయసమస్యలు మొదలవుతాయి. కావున ఇలాంటి సమస్యలను ప్రారంభదశలోనే గుర్తించి, జాగ్రత్తపడటం వల్ల ఈ వ్యాధిని సమూలంగా నయం చేయువచ్చు.

**ఆయుర్వేద చికిత్స:** ఆయుర్వేదం లో ఇలాంటి సమస్యలకు సమగ్రమైన చికిత్సా పద్ధతులు ఉన్నాయి. అందులో 1. శమనచికిత్స 2.శోధన చికిత్స. శమన **చికిత్స:** ఇదిదోషాలను బట్టి అభ్యంతరంగా వాడే ఔషధ చికిత్స ఇందులో వేదన, కాయకంగా ఔషదాలు ఉంటాయి. అలాగే వాతహర చికిత్సా పద్ధతులు ఉంటాయి.

**శోధన చికిత్స:** శమనచికిత్స వలన ఒక్కోసారి మళ్ళీ వ్యాధి తిరగబెట్టవచ్చు. అందుకే ఆయుర్వేదంలో పంచకర్మ అనే ఒక ప్రత్యేక చికిత్సా పద్ధతి ఉంది. ఈ చికిత్సా పద్ధతీ ద్వారా ప్రకోపించిన వాతాది దోషాలను సమూలంగా తగ్గించవచ్చు.

**1.స్నేహకర్మ:** ఈ ప్రక్రియ ద్వారా వెన్నెముకలోని వెన్నుపూసల మధ్య స్నిగ్ధత్వాన్ని పెంపొందించి, తద్వారా జాయింట్స్‌లో కదలికలను తేలికగా చేయవచ్చును. **2. స్వేదకర్మ:** ఈ పద్ధతిలో గట్టిగా అతుక్కొని ఉండే జాయింట్స్‌ను మృదువుగా అయ్యేటట్లు చేయ వచ్చును. కటివస్తి, ఈ ప్రక్రియద్వారా అరిగిపోయిన మృదులాస్థికి రక్తప్రసరణను పెంచి తద్వారా నొప్పి తీవ్రతను తగ్గించవచ్చును. అలాగే సర్వాంగధార, వస్తికర్మ అనే విశిష్ట చికిత్సా పద్ధతుల ద్వారా నాడీ కణాలలో కలిగిన లోపాలను సరిచేయవచ్చు. అదే విధంగా ప్రకోపించిన వాతాన్ని సమస్థితికి తీసుకురావచ్చు. **జాగ్రత్తలు:** సరిఅయిన పోషక ఆహారాలు తీసుకోవడం. నిదాన పరివర్జనం అనగా పైన చెప్పిన ప్రత్యేక వ్యాధి కారణాలను మళ్ళీ చేయకుండా జాగ్రత్తపాటించినట్లయితే ఈ సమస్యనుంచి శాశ్వత విముక్తి పొందవచ్చును.

డా. మనోహర్. M. D (Ayurveda)
స్టార్ ఆయుర్వేద

# విజయ విలాసం

**స్టెప్స్ టు సక్సెస్ 18**

- ఎం. వెంకటేశ్వరరావు, సెల్: 90307 07037



# పోలిక ఓ పెనుభూతం

**"నీ వెనక ఉన్నదానికి, నీ ముందు దానితో పోల్చుకుంటూ కూచుంటే.. నీ లోపల ఉన్నది నశించిపోతుంది"**

-ఎమర్సన్

'ఏ విషయంలోనూ, ఎట్టి పరిస్థితుల్లోనూ ఇతరులతో పోల్చి చూసుకోకండి. ఎందుకంటే పోలిక విషతుల్యమైనది. అలా పోల్చుకోవటం అంటే మనకే ప్రత్యేకమైన, మనలోవున్న అద్భుతమైన, సృజనశక్తిని కించ పరుచుకున్నట్టే. పోలికను త్యజించి మనలోని విలక్షణ ప్రతిభా సామర్థ్యాల్ని మన శక్తిమేర వినియోగించుకోవాలి. ఆ ప్రతిభా సామర్థ్యాల్ని వికసించనివ్వాలి. ఇలా ప్రతి ఒక్కరిలో ఏదో ఒక సృజనాత్మకత ఉంటుంది".

•••

మంజుల డిగ్రీ రెండో సంవత్సరం చదువుతోంది. క్లాసులో ఎప్పుడూ డల్‌గా నిద్రమత్తులో ఉన్నట్టు ఉంటుంది. ఫస్టియర్ సబ్జెక్టులు కొన్ని మిగిలాయి. ఇలా అయితే డిగ్రీ పాసవడం కష్టం అని సివిక్సు, ఎకనామిక్సు లెక్చరర్స్ ప్రిన్సిపాల్‌కి కంప్లయింటిచ్చారు. ప్రిన్సిపాల్ మంజులని పిలిచి అడిగాడు. 'ఫైనల్ ఎగ్జామ్‌కి బాగా ప్రిపేరై, రాసి పాసవుతాను సార్!" అందామె. కానీ మంజుల చదవటం లేదనే కంప్లయింట్ మళ్ళీమళ్ళీ రిపీటెడ్‌గా ప్రిన్సిపాల్‌కు వస్తోంది. లాభంలేదు, ఆమె తల్లిదండ్రులతో మాట్లాడాలని ఆమె ఇంటికి వెళ్ళాడు. రెండుగదుల ఇల్లు. గోడల నిండా అద్భుతమైన వాల్ హేంగింగ్స్ ఉన్నాయి. 'ఎక్కడ కొన్నారని' అడిగాడు ప్రిన్సిపాల్. 'ఇవన్నీ మా మంజులే తయారుచేసిందని' తండ్రి చెప్పాడు. 'నీలో ఇంత టాలెంట్ ఉందని నాకు తెలియదు. ఎక్సలెంట్' అన్నాడు. ఆమె కళ్ళలో మెరుపు. 'ఇంకా ఉన్నాయ్ సార్!' అని లోపలికెళ్ళి అట్టపెట్టెనిండా ఉన్న హ్యాంగింగ్స్ తెచ్చి చూపించింది. ప్రిన్సిపాల్ వాటిని చూసి 'వీటిని రేపు కాలేజీకి తీసుకురా!' అని వెళ్ళిపోయాడు.

మర్నాడు మంజులకు ఇద్దరు అటెండర్లను తోడిచ్చి కాలేజీ ఆడిటోరియం గోడలకి ఆ హేంగింగ్స్ డెకరేట్ చేయించాడు. అన్ని క్లాసులకు ఒక సర్క్యులర్ పంపాడు. సాయంత్రానికి కాలేజీ ఆడిటోరియం కిక్కిరిసి పోయింది.

'వాల్ హేంగింగ్స్ చూసిన వాళ్ళంతా ఆశ్చర్యపోయారు. అరగంటలో ఆమె సెలబ్రిటీగా మారిపోయింది. ఆమె గురించి ప్రిన్సిపాల్‌కి కంప్లైంట్ ఇచ్చిన లెక్చరర్లే ఆమెను అభినందించసాగారు. కాలేజీలో ఆమెకు ప్రత్యేక గుర్తింపు వచ్చింది. దానిని కాపాడుకోవటం కోసం శ్రద్ధగా చదివి, ఫస్ట్‌క్లాస్‌లో పాసయి అందర్నీ ఆశ్చర్యపరిచింది మంజుల. పదేళ్ళు గిర్రున తిరిగిపోయాయి.

ఓరోజు తన గదిలోకి అపరిచిత స్త్రీ వచ్చి తనపేరు మంజుల అనీ, కేంద్ర మానవ వనరుల శాఖలో డిప్యూటీ సెక్రటరీగా పనిచేస్తున్నాననీ చెప్పేసరికి ప్రిన్సిపాల్‌కి ఆనందం, ఆశ్చర్యం కలిగాయి. 'ఇదంతా ఎలా సాధించావు?' అనడిగాడు. 'మీరిచ్చిన ప్రోద్బలం వల్లే నా మీద నాకు కాన్ఫిడెన్స్ పెరిగింది, ఇతరులతో పోల్చుకోవడం మానేశాను. డిగ్రీ తరువాత డిజైన్స్‌లో డిప్లమో చేస్తూ, టెర్రకోట మోడల్ తయారుచేశాను. ఇంటర్నేషనల్ ఎగ్జిబిషన్‌లో దానికి ప్రథమ బహుమతి లభించింది. తర్వాత డిజైనర్ ట్రైనీగా 70 దేశాలు తిరిగి, ప్రస్తుతం ఈ జాబ్ చేస్తున్నా' చెప్పింది.

ఎక్కువ మార్కులు తెచ్చుకునే తన అక్కతో పోలుస్తూ, తల్లిదండ్రులు నిరుత్సాహపరచడం వల్ల ఇన్ఫీరియారిటీ పెరిగి చదవలేకపోయేదాన్ననీ, ఆ సమయంలో మీరు నా టాలెంట్ గుర్తించి, ప్రోత్సహించడంతో నాలో కాన్ఫిడెన్స్ పెరిగిందనీ, అదే టర్నింగ్ పాయింట్ అయిందనీ, కృతజ్ఞత చెప్పింది మంజుల.

ఇది ఒక మంజుల కథే కాదు. ప్రతి ఇంట్లో మంజుల లాంటి వాళ్ళుంటారు. ఏదో ఒక ప్రత్యేక టాలెంట్ వారిలో ఉంటుంది. ప్రతిభకి పోలిక ఉండదు. స్వేచ్ఛనిస్తే ఇష్టమైన రంగాల్లో వాళ్ళు రాణించి శిఖరాగ్రాలు అధిరోహిస్తారు. చదువు, మార్కుల పేరిట పక్కవారితో పోల్చడం లేదా వాళ్ళకి వాళ్ళే ఎప్పుడైతే ఇతరులతో పోల్చుకుంటారో అప్పుడే విజయం చతికిలబడుతుంది.

**'పోలిక ప్రమాదకరం. అది సంతోషాన్ని చంపేస్తుంది'.**

-మార్క్ ట్వైన్.

## మందులేని మాయదారి రోగం

"మీరు ఫలానా వారిలా ఎందుకు ప్రవర్తించరు?" అనే ఈ పోలిక ఇంటి నుండే మొదలవుతుంది. మార్కులు ఎక్కువవచ్చిన వాడితో పోలిక. అది ఫలితాన్నివ్వడం కంటే ప్రమాదాన్నే మిగు

లుస్తుంది.

"ఫలానా వారిలా!" అనే పదం క్రియేటివిటీని చంపేసి, కాన్ఫిడెన్స్‌ని కిల్ చేస్తుంది. ఎందుకూ పనికిరాని వాళ్ళలా మార్చేస్తుంది. ఇది ఎయిడ్స్ కంటే ప్రమాదకరమైన వ్యాధి.

ఎవరైనా మిమ్మల్ని ఇతరులతో పోల్చి, కించ పరిస్తే, వారి మాటలు విని, మీలో ఉన్న సహజ శక్తుల్ని చంపుకోకండి. చదువు మార్కులే జీవితం కాదు. ఇతరులతో పోలిక జీవిత పరమార్థం అంతకంటే కాదు. చదువు అందరూ చదివేదే. కానీ మనలోని టాలెంట్ మరొకరితో పోల్చ లేనిది. పోలిక అనే భూతం మనకు కన్పించి నప్పుడో, విన్పించినప్పుడో వెంటనే మనదైన టాలెంట్‌ని మననం చేసుకోవాలి. డబ్బుతో దాన్ని మరొకరు కొనలేరనీ, దొంగిలించలేరనీ మనం గుర్తుంచుకోవాలి. అప్పుడే మనలో ఈ పోలిక భూతం వల్ల కలిగే డిప్రెషన్ దూరంగా పారిపోతుంది.

### వాళ్ళని దూరంగా పెట్టు

అలాగే మిమ్మల్ని ఇతరులతో పోలుస్తూ అనుక్షణం మీ టాలెంట్‌ని దెబ్బతీయాలని ప్రయ త్నించే వాళ్ళని దగ్గరకి రానీయకండి. ఎందుకంటే ఆ పోలికకి మీ టాలెంట్ తలొంచాల్సిన అవసరం లేదు. ఆత్మన్యూనత చెందాల్సిన అవసరం లేదు. ఈ 'పోలిక'ని లైట్ తీసుకుంటేనే మన టాలెంట్ వెలుగు చూస్తుంది. పోలికని అనుమతిస్తే పతనం మొదలయినట్టే.

### నిన్ను నువ్వు ప్రేమించు

కొంతమంది అనుక్షణం తమను ఇతరులతో పోల్చుకుంటారు. వాళ్ళలా ఉండలేక పోతున్నా మనే ఆత్మన్యూనతతో డిప్రెషన్‌కి గురై మానసిక రోగులుగా మారిపోతారు. మనల్నిమనం అలా పోల్చుకుంటూ గుర్తింపులేని వ్యక్తిగా జీవించడం కంటే మించిన శాపం లేదు.

నిన్ను నువ్వు ప్రేమించుకోవటం ప్రారంభించు. పోలికకి అదే ప్రథమ చికిత్స.

### నీకు నువ్వే రోల్‌మోడల్

"ఫలానా వ్యక్తి నాకు రోల్ మోడల్, వారి బాటలో నడుస్తా' అని చెబుతారు. అది సాధ్య మేనా? ఆలోచించండి. భౌతికంగా ఒకేలా కని పించే కవలల్లో అంతర్గతంగా పోల్చలేని అంశం ఒక్కటైనా ఉంటుంది.

- మహాత్మాగాంధీలా ఉండటం వీలవుతుందా?
- సత్యహరిశ్చంద్రుడి తమ్ముడిలా జీవించడం సాధ్యమవుతుందా?
- ఎవరో సాధించిన విజయాల్ని స్మరించడం అనుకరణేగానీ సృజన కాదు. అది ఒక మాన సిక దౌర్బల్యం.
- పది మందిలో ఒకడిలా కాదు, పదిమందిలో ప్రత్యేకంగా కన్పించే ప్రయత్నం చేస్తే నీ ప్రతిభ నీకు బోధపడుతుంది.

### రోజూ ఈ మంత్రం జపించు

"నాకు నేనే రోల్‌మోడల్. నా విజయ మార్గాన్ని నేనే అన్వేషించాలి. నాకు ఎవరితోనూ పోలికలేదు" అని దృఢంగా ఒక మంత్రాన్ని ప్రతి రోజూ మీకు మీరు చెప్పుకుంటే మనలో నూతన శక్తి జీవం పోసుకుని పోలిక బదులు క్రియేటివిటీ ప్రవేశిస్తుంది.

### ఎవరిపంథా వారిదే

గొప్ప విజేతలు తమను ఇతరులతో పోల్చు కోరు. ఇళయరాజా దగ్గర కీబోర్డు ప్లేయరుగా పనిచేశాడు దిలీప్‌కుమార్. తనను తాను ఇళయ రాజాతో పోల్చుకుంటూ కూచుంటే అతడు ఆస్కార్ అందుకోగలిగేవాడా?" ఒకే రంగంలో ఉన్నా ఎవరి పంథా వారిదై ఉండాలి.

## హేట్సాఫ్

అతని సంగీతం ఓ ఉత్తుంగ తరంగం. కొత్త ఒరవడికి శ్రీకారం. పోలికకి అందని నిత్య నూతనం. అందరూ నిద్రించే వేళల్లో అతను మేల్కొని తనలోని సృజనకి జీవం పోస్తాడు. పిన్న వయసులోనే తన ప్రతిభతో ప్రపంచం తనవైపు చూసేలా చేసుకుని "జయహో" అనిపించుకున్న మౌన మేధావి, సంగీత చక్ర వర్తి, ఆస్కార్ అవార్డు అందుకుని వేదికమీద 'ఎల్లా పుగళం ఇరైతనుక్కే" (ఈ కీర్తి అంతా దేవునికే) అని చెప్పిన వినయశీలి ఎ.ఆర్.రెహ్మాన్.

1967 జనవరి 6న చెన్నైలో జన్మించిన రెహ్మాన్ అసలు పేరు దిలీప్‌కుమార్. తండ్రికి సంగీత ప్రవేశం ఉండటంతో పిన్నవయసు నుండీ పియానో నేర్చుకునేవాడు. 11 ఏళ్ళ ప్రాయంలో ఇళయరాజా వద్ద కీ బోర్డు ప్లేయరుగా చేరి ఎన్నో దేశాలు పర్యటించాడు. తబలా మేస్త్రో జాకీర్ హుస్సేన్‌తో విదేశాల్లో ప్రోగ్రామ్‌లిచ్చాడు. ట్రినిటీ కాలేజీ స్కాలర్‌షిప్ పొంది, ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీలో సంగీతం డిగ్రీ పొందాడు. అల్లా రఖా రెహ్మాన్‌గా పేరు మార్చుకున్నాడు. 1987 నుండి అడ్వర్‌టైజింగ్ కంపెనీలకు 300కి పైగా జింగిల్స్ అందించాడు. 1989లో పంచాత్తన్ రికా ర్డింగ్ స్టూడియో ప్రారంభించాడు. మణిరత్నం



ఆయన ప్రతిభ గుర్తించి 1992లో 'రోజా' సినిమా సంగీత బాధ్యతలు అప్పగించారు.

అంతే...నేటి వరకు రెహ్మాన్ వెనుదిరిగి చూడలేదు. దేశాన్ని ఉర్రూతలూగించటంలోనే కాదు అనేక హాలీవుడ్ చిత్రాలకూ పనిచేశారు. 2008లో స్లమ్‌డాగ్ మిలియనీర్ చిత్రానికి సంగీతం అందించిన రెహ్మాన్‌కు ఆస్కార్ గౌరవం లభించింది. గోల్డెన్ గ్లోబ్ అవార్డు, పలుమార్లు ఫిలింఫేర్ అవార్డు, 2010లో 'పద్మభూషణ్' పొందారు. ఎందరో సంగీత దిగ్గజాల మధ్య అసాధ్యాలను సుసాధ్యం చేసిన ఎ.ఆర్.రెహ్మాన్ విజయాలకు కారణం తనను తాను ఎవరితోనూ పోల్చుకోకుండా నమ్మిన మార్గంలో సాగటమే. 'జయహో'.

## పంచసూత్రాలతో విజేతగా...

- పోలిక పతనం... పోటీ విజయం.
- వివేకవంతుడు ప్రతి ఒక్కర్నుంచీ నేర్చు కుంటాడు. శక్తిమంతుడు తనని తాను సంపాదించుకుంటాడు. మూర్ఖుడు ఇతరు లతో పోల్చుకుంటాడు.
- పిరికివాడు గుంపులో కలిసిపోతాడు. ధైర్యవంతుడు ఒంటరిగా నిలబడి అందర్నీ చూస్తాడు.
- విజేతలతో పోల్చుకోకు. ఆ స్థాయికి ఎదగ డానికి ఏం చెయ్యాలో ఆలోచించు.
- తెలివి తక్కువవాళ్ళు ఇతరుల లోపాలు వెతికి కాలం కరగదీస్తారు.

పోలిక స్ఫూర్తినివ్వాలితప్ప అసూయ రగల్చ కూడదు. పోలిక ప్రేరణనిచ్చి, పాజిటివ్ థింకింగ్ వైపు మళ్ళించాలి. నెగటివ్ ఫీలింగ్స్ అసూయకు ఆజ్యం పోస్తాయి.

**"అసూయ కట్టెకి అంటుకున్న నిప్పులాంటిది. తనని తానే దహింపజేసుకుంటుంది".**

-చినజీయర్ స్వామి

### ఆరోగ్యకరమైన పోటీ

పోలిక పోటీ తత్వాన్ని పెంచాలి. పందెంలో ముందుండాలన్న 'కసి' పెంచాలి. పోటీ లేకపోతే మనుగడ ఆగిపోతుంది. అనవసర పోటీవల్ల పోలిక ముందుకొచ్చి అపజయం వెంటాడుతుంది.

***'పోటీ' భయాన్ని పారద్రోలి, అవరోధాల్ని ఎదుర్కొని విజయాన్నందిస్తుంది.***

***'పోలిక' భయాన్ని నూరిపోసి, అసూయ రగి లించి.. అపజయాన్ని మిగులుస్తుంది'***

-మార్టిన్ లూథర్‌కింగ్

'నీ లోని నిన్ను నిరూపించుకోవడమే నీ వృత్తి. వేరొకరి వెలుగు అరువు తెచ్చుకుని బ్రతుకు పయనానికి ఆపాదించుకోవడం ప్రతిభా పతనానికి నాంది'.

***'పోలికకి అలవాటుపడ్డవాడు, ప్రతి అవకాశం లోనూ కష్టం చూస్తాడు. పోటీకి అలవాటు పడ్డ వాడు, ప్రతి కష్టంలోనూ విజయం చూస్తాడు.***

-చర్చిల్

**(ఇంకావుంది)**








# ఐదారు కప్పులు చాలు

ప్రతిరోజూ ఐదారు కప్పుల కాఫీ తాగితే నాన్ ఆల్కహాలిక్ ఫ్యాటీ లివర్ డిసీజ్ (ఎన్ ఎఫ్ ఎల్ డి) నుంచి తప్పించుకోవచ్చని ఇటలీలోని నపోలి యూనివర్సిటీ పరిశోధకులు చెబుతున్నారు. ఎన్ఎఫ్ఎల్‌డి కారణంగా కొన్నిసార్లు ప్రాణాపాయం సంభవించే అవకాశం ఉందనీ, దీని నుంచి తప్పించుకోవడానికి కాఫీ సేవనం చాలా వరకూ ఉపయోగపడుతుందనీ వారు చెబుతున్నారు. ఇదే విషయంపై కొన్ని ఎలుకలను రెండు గ్రూపులుగా విభజించి, ఒక గ్రూపు ఎలుకలకు ప్రతిరోజూ ఐదు నుంచి ఆరు కప్పుల ఎస్‌ప్రెసో కాఫీనీ, దానితో పాటు కొద్దిగా కొవ్వు కలిగిన ఆహారాన్ని ఇచ్చారు. మరొక గ్రూపుకు కేవలం కొవ్వు కలిగిన ఆహారాన్ని మాత్రమే ఇచ్చి అనంతరం వాటి బరువును పరిశీలించారు. మొదటి గ్రూపు ఎలుకల బరువులో ఏమాత్రం తేడా కనిపించకపోవడంతో పాటు కొవ్వు కలిగిన ఆహారం వాటి లివర్ మీద ఎలాంటి ప్రభావాన్ని చూపకపోవడం వీరు గమనించారు. రెండో గ్రూపు ఎలుకల్లో బరువు పెరగడంతో పాటు ఫ్యాటీ లివర్ సమస్యను కూడా గుర్తించారు. కాఫీలోని జొనులిన్ (Zonulin) పదార్థం లివర్‌ను ఆరోగ్యంగా ఉంచడానికి దోహదపడి ఉండవచ్చన్న అభిప్రాయాన్ని వీరు వ్యక్తం చేస్తున్నారు.

# రొమ్ము క్యాన్సర్‌ను ఇలా అడ్డుకోవచ్చు

మహిళల్లో గుండెజబ్బుల తర్వాత అత్యధిక మరణాలు సంభవించేది రొమ్ము క్యాన్సర్‌గానే కారణం అనే విషయాన్ని ఇప్పటికే పలు సర్వేలు వెల్లడిచేశాయి. రొమ్ము క్యాన్సర్ నుంచి తప్పించుకోవడానికి రకరకాల పద్ధతులను వైద్యులు సూచిస్తూనే ఉన్నారు. అయితే లోఫ్యాట్ డైట్‌తో రొమ్ము క్యాన్సర్‌ను సమర్థంగా అడ్డుకోవచ్చు అంటున్నారు అమెరికాలోని లూసియానా పరిశోధకులు. మెనోపాజ్ దాటిన తరువాత మహిళలు లోఫ్యాట్ డైట్‌ను క్రమం తప్పకుండా కొన్ని సంవత్సరాలపాటు తీసుకుంటే దీని బారి నుంచి చాలా వరకూ తప్పించుకోవచ్చని వీరు అంటున్నారు. 50 నుంచి 70 సంవత్సరాల లోపు వయస్సు గల 48 వేల మంది మహిళల మీద వీరు పరిశోధనలు నిర్వహించారు. 18 వేల మందికి లోఫ్యాట్ డైట్ ఇచ్చారు. మిగతావారికి మామూలు కొవ్వు కలిగిన ఆహారాన్ని ఇచ్చారు. కొన్ని సంవత్సరాల అనంతరం వీరి ఆరోగ్యాన్ని పరిశీలించారు. కొవ్వు కలిగిన ఆహారం తీసుకున్న వారిలో కొందరికి రొమ్ము క్యాన్సర్ లక్షణాలు కనిపించగా, లోఫ్యాట్ డైట్ తీసుకున్న వారిలో ఆ లక్షణాలు కనిపించలేదు. కేవలం లోఫ్యాట్ డైట్ తీసుకున్నంత మాత్రాన రొమ్ము క్యాన్సర్‌ను అడ్డుకోవచ్చా? అన్న విషయాన్ని వీరు స్పష్టం చేయలేదు.

# అధిక బరువు తగ్గించే మెడిటేషన్



టీనేజర్లలో అధికబరువు సమస్యకు మెడిటేషన్ చక్కని పరిష్కారాన్ని సూచిస్తుంది అంటున్నారు అమెరికాలోని జార్జియా యూనివర్సిటీ పరిశోధకులు. 40 మంది ఊబకాయులైన టీనేజర్ల మీద సుమారు పన్నెండు వారాల పాటు పరిశోధనలు నిర్వహించారు. వీరిని రెండు గ్రూపులుగా విభజించి ఒక గ్రూపు వారికి ప్రతిరోజూ ఉదయం కొద్దిసేపు మెడిటేషన్ ప్రాక్టీస్ చేయించారు. వీరికి కొద్దిగా కొవ్వు కలిగిన ఆహారం కూడా అందించారు. మరో గ్రూపువారికి అంతే కొవ్వు కలిగిన ఆహారాన్ని ఇచ్చారు. పన్నెండు వారాల అనంతరం వీరి బరువును పరిశీలించగా మెడిటేషన్ చేయని పిల్లలు బరువు పెరగడాన్ని గుర్తించారు. మెడిటేషన్ చేసిన పిల్లల బరువులో ఎలాంటి మార్పు కనపడలేదు. మెడిటేషన్ కారణంగా ఎక్కువ ఆహారం తీసుకోవాలన్న కోరిక పిల్లల్లో నశించిందని వీరు అంటున్నారు. పిల్లలకు చిన్నతనం నుంచే మెడిటేషన్ అలవాటు చేస్తే అధికబరువు అన్న సమస్య తలెత్తదని కూడా వీరు సూచిస్తున్నారు.

# కంటి పొరను కాపాడే విటమిన్ సి

కంటిలో పొర, శుక్లాలను అలక్ష్యం చేస్తే శాశ్వత అంధత్వానికి దారితీయవచ్చు. ఇవి వచ్చిన తరువాత వైద్యం చేయించుకోవడం కన్నా రాకుండా ముందు జాగ్రత్తపడవచ్చు అంటున్నారు లండన్‌లోని కింగ్స్ కాలేజీ పరిశోధకులు. క్రమం తప్పకుండా ఆహారం ద్వారా విటమిన్ సి తీసుకున్నట్టయితే 33 శాతం వరకూ కంటిలో పొర, శుక్లాల బారినుంచి తేలికగా తప్పించుకోవచ్చనే విషయం వీరి పరిశోధనల్లో వెల్లడైంది. ముఖ్యంగా షుగర్ పేషెంట్లు, ధూమపానం ఎక్కువగా చేసే వారిలో పై సమస్యలు కనిపించే అవకాశాలు ఎక్కువ. వీరే సమతుల ఆహారంతో పాటు విటమిన్ సి క్రమం తప్పకుండా తీసుకోవాలని వారు చెబుతున్నారు. 324 మంది కవలల మీద సుమారు పది సంవత్సరాల పాటు అధ్యయనం నిర్వహించి ఈ విషయాన్ని స్పష్టం చేస్తున్నారు. కేవలం ఆహారం ద్వారా విటమిన్ సిని తీసుకున్నప్పుడే మంచి ఫలితం పొందుతారనీ, విటమిన్ సి టాబ్లెట్ల రూపంలో తీసుకుంటే ఎలాంటి ఫలితం ఉండకపోవచ్చని వారు అంటున్నారు.

-అవినాష్

# సంగమము

- జయంతి వెంకటరమణ



**ఆ సాయంత్రం నేను సోమేశు ఇంటి డాబామీదికి వెళ్ళేసరికి శ్యామసుందరం నలుగురు యువకుల మధ్య కూర్చుని ఏదో చెప్తున్నాడు. అతనితో నాకు పెద్ద పరిచయం లేదు కాబట్టి పేపరు పట్టుకుని, వాళ్ళకు కాస్త దూరంగా ఓ పెద్దాయన పక్కన కూర్చుని వాళ్ళ మాటలు వింటున్నాను. శ్యామసుందరం చెప్తున్నాడు.**

"మీరందరూ అడుగుతున్నారు కాబట్టి చెప్తున్నా, ఆనాటి మొదటి రాత్రి అనుభవం. ఈనాటికి ఎన్నో సోర్సెస్ నుండి మీకు తెలిసే ఉంటాయి, ఈ విషయం గురించి" అలా చెప్తుంటే నలుగురూ అతనికి దగ్గరగా జరిగారు.

"ఆడపిల్ల ఆత్రంగా ఎదురుచూసే సంఘటనల్లో మొదటిది తన మెడలో మంగళసూత్రం పడటం. వరుడు తన మెడలో మంగళసూత్రం కడుతూ ఉంటే, వధువు ఎంతగా మురిసిపోతుందో వర్ణనాతీతం. లోకాన్ని జయించినంత గర్వాతిశయం. ఈనాటికీ ఆ సంఘటన గుర్తుకు రాగానే, వధువు బుగ్గలు ఎంత రాగరంజితమవుతాయో, అనుభవించిన ఆమెకే తెలుస్తుంది.

ఇక రెండవది మొదటి రాత్రి.

ఈ సన్నివేశం గురించి వరుడు ఎంతగా ఊహల్లో విహరిస్తాడో, వధువూ అంతే. ఒకరి గురించి, మరొకరు ఎన్నో ఊహలు చేస్తారు. వాళ్ళ ఊహలననుసరించి ప్లాన్లు వేసుకుంటారు. నేనూ అలాగే ప్లాన్ చేసుకున్నాను.

మొదటిరాత్రి గురించి ఆడపిల్లకి బిడియం, అంతకన్నా భయం ఉంటాయి. వాటిని పోగొట్టడం కోసం వరుడు చాలా సున్నితంగా వ్యవహరించాలి. ఆమె శరీరమెంత సున్నితమో, అంతకన్నా పదిరెట్లు ఆమె మనసు సున్నితం. శృంగారమంటే శారీరకంగా ఏకం కావడం కాదు. మానసికంగా దగ్గరవడం. శృంగారాన్ని ఆమె నుండి 'డిమాండు' చేయడం కాదు. ఆమె మనసును వరుడు తన వైపు తిప్పుకోవడం.

ఆమె పాల గ్లాసుతో అప్పుడే పాల సముద్రం లోంచి ఉద్భవించిన శ్రీ మహాలక్ష్మిలా అలంకృతమై పడకగదిలోకి ప్రవేశిస్తుంది. మధురమైన అగరొత్తుల పరిమళాల మధ్య ఆమె సిగ్గు పడుతూ, భర్తవేపు చూడాలా, మానాలా అన్నట్టుగా ఓరచూపులతో పూలపాన్పు దగ్గరకి వస్తుంది. ఆ సమయానికి ఎవరో బయటినుండి గడియ పెట్టేస్తారు.

అప్పుడలాగే జరిగింది.

లాలనగా పిలవగానే వచ్చి ఓ పక్కగా పడక మీద కూర్చుంటుంది. తలవంచుకునే చేతిలోంచి పాల గ్లాసును అందుకుని "నీకు పాలంటే ఇష్టమా?" అని అడిగితే.

ఔనో, కాదో, అన్నట్టుగా తలూపుతుంది. తలవంచుకునే "సగం, సగం తాగాలని మనకు ఈ పాలిచ్చారు. ముందు నీవు తాగుతావా? లేక నేనా?"

"మీ ఇష్టం" మెల్లగా, మెత్తగా తలదించుకునే.

"లేడీస్ ఫస్టు అన్నారు కదా. ముందు నీవు, తరువాత నేను".

"ముందుగా మీరే" అంతే సన్నగా... మధురంగా.

"అలా కాదు గాని ముందు కొద్దిగా నీవు, తరువాత నేను. మళ్ళీ నీవు, మళ్ళీ నేనూ. ఇక్కడ మొహమాటాలు, సిగ్గు, భయం ఉండకూడదు. తరువాత పళ్ళు, మిఠాయిలూను".

లాలనగా పాల గ్లాసు అందిస్తే, భర్తకు మిగలవేమో అన్నట్టు కొద్దిగా తాగి "ఇక మీరు".

"అలాగే" అంటూ కాస్త పాలు తాగి "అయ్యబాబోయ్, ఈ పాలు, నీ పెదవులు తాకి ఎంత మధురంగా మారాయో!" నీ పెదవులెంత తియ్యనో; ఓసారి నా పెదవులని అడగ మననా?"

"పోదురూ బడాయి. మా అమ్మ కాస్త పంచదార ఎక్కువేసిందేమో! తల వంచుకుని.

"అమ్మో! నీకూ మాటలు వచ్చే! అంతేకాదు. ఈ పాలు ఎంత సుగంధ భరితంగా ఉన్నాయో, నీ పెదవులు తాకి".

"మళ్ళీ బడాయీ! మా పిన్ని ఏలకులు, పచ్చకర్పూరం కాస్త వేసుంటుందేమో!" కాస్త చొరవగా.

"అయినా ఇంత మధురమా? ఇంత సుగంధ భరితమా? నీవు కాస్త తాగియ్యి. ఇంకా ఏమైనా మజా ఉంటుందేమో. ఈ పాలపై మీగడ ఉంది. మరగ కాచిన పాల మీగడ నీ బుగ్గల ఎఱ్ఱందనాలతో పోటీ పడుతోంది. అవునూ నీకు మీగడ ఇష్టమా?"

"మీ కిష్టమైతే నాకూనూ" తలవంచుకునే, ఒడిలో రెండు చేతులుంచుకుని. "అలా రాజీ పడకూడదు. ఎవరి ఇష్టాలు వాళ్ళవి. నిర్భయంగా చెప్పుకోవచ్చు".

"అయితే... అయితే... నాకు మీగడ ఇష్టం ఉండదు".

"నాకూ ఇష్టముండదు. కానీ నీ బుగ్గల ఎఱ్ఱందనాలు చూచిన తరువాత ఇష్టమేర్పడింది. నీ బుగ్గలను కొరికి తినేయాలని ఉంది".

"ఇది పొగడ్త కదా?"

"కాదు, నిజంగానే. నీ మీద ఒట్టు".

"ఒట్టు చేతుల్లో వేస్తారు. తల మీద చెయ్యి పెట్టి వేస్తారు. మరి మీరేంటి నా గుండెను తాకి ఒట్టు వేస్తున్నారు".

"మరి మనం పాల గురించేగా మాట్లాడుకుంటున్నాం" అందుకే ఎద పుట్టువులపై ఒట్టు".

"అయినా ఇప్పటికిప్పుడు పాలు రావుగా".

"పాలను పండించాలనే కదా, ఈ సంబరం".

"అవునా?"

"కాదా" గదిలో ప్రతిధ్వనించేలా నవ్వులే నవ్వులు".

"నీవిలా నవ్వితే, నీ గుండెలెలా ఎగసి పడుతున్నాయో తెలుసా? చంద్రుని కోసం సంద్రంలా".

"పొండీ! మీరు చమత్కారంగా మాట్లాడతారు".

"అంతా నీ సావాస ఫలితమే! ఇంకా నీ నుండి ఏం నేర్చుకోవాలో".

"నాకేం తెలుస్తుంది. మీరడిగేవాళ్ళు. నేను ఇచ్చేదానిని. నేనేం నేర్పగలను మీకు".

"అబ్బో! ఏమీ తెలుసుకోకుండా వచ్చావా ఇక్కడికి".

"అన్నీ మీరు నేర్పుతారని, మీరు చెప్పినట్టు వినాలని అమ్మమ్మ చెప్పింది".

"మరి మీ నాన్నమ్మ ఏం చెప్పలేదా?"

"చెప్పింది. కాస్త బెట్టు చెయ్యాలంది. అప్పుడు అమ్మమ్మ ఏమందంటే" అది కాదే పిల్ల. ఇప్పుడు

**మేడమీద అతడిచుట్టూ చేరారు వాళ్ళంతా. తన భార్యతో తొలిరేయి అనుభవాల్ని ఏదీ దాచిపెట్టకుండా వర్ణించి మరీ చెప్పేశాడతను. పరవశించిపోయారు. వెంటనే ఆమెను చూడాలని వాళ్ళంతా తెగ ఆరాటపడిపోయారు!**

నీవు అతని మాట వింటే - జీవితాంతం అతను నీ మాటే వింటాడని" కనురెప్పలు పైకెత్తి అంటూంటే.

"అమ్మ బాబోయ్. ఎంత కుట్ర!"

"ఇందులో కుట్రేముందమ్మా! వాళ్ళన్న మాటే నేనన్నాను. మీరు చెప్పండి. నేను వింటాను. తేడాలుంటే సావకాశంగా చర్చించుకుని పరిష్క రించుకుందాం".

"ఈ చర్చలు, పరిష్కారాలు వద్దు. నీవు చెప్తూ ఉండు. నేను వింటూ ఉంటాను. నేను నీకూ, నీ అందానికీ దాసుడిని. జీవితాంతం నీ వాడిని" చేతి గాజులు సవరిస్తూ, ఆమె ఒడిలో చేతులందు కుని.

"ఛా! అలా అనకూడదు. మిమ్మల్ని కొంగు చాటు మొగుడు - హెన్ పెక్‌డ్ హజ్‌బెండు" అంటారు.

"అంటే భర్త భార్యకు బెండై ఉండాలనే కదా!"

"చమత్కారాలు చాలు గాని, మీరు మగా డిలా నేను ఆడదానిలా ఉండాలి. సమయం వచ్చినప్పుడు ఇద్దరం ఒక్కటి కావాలి. పంతాలు, పట్టింపులకు పోకూడదు. అధికారాలు చెలా యించకూడదు".

"ఓకే! ఎగ్రీడు. కష్టాలు కన్నీళ్ళు మన దగ్గరికి రాకూడదు".

"సుఖసంతోషాల్ని పంచుకుంటూ పెంచుకోవాలి. రెండు చేతులు ఒకటి కావాలి. రెండు మనసులు ఒకటి కావాలి. ఒకరికొకరు తోడు నీడగా ఉండాలి".

"నిజం నిజం" "గోరింటాకుతో పండిన నీ చేతులు ఎంత అందంగా ఉన్నాయి. మంచి భర్త వస్తాడని కదా!"

"ఏమిటిర్రా ఇంకా ఆలస్యం. కబుర్లతోనే కాలం గడిపేస్తారా" బయట తలుపు దగ్గర ఎవరో, మెల్లగా తలుపు తడుతూ.

"అమ్మ బాబోయ్, మనమాటలు వాళ్ళకు వినిపించేస్తున్నాయి".

"వినిపించవా మరి. మనమేమన్నా గుసగుస లాడుకుంటున్నామా?"

"అయితే మరేం చేద్దాం! మాటలాపేద్దామా?"

"ఆపేయొచ్చు గాని గోడలకు చెవులే కాదు కళ్ళు ఉంటాయి మరి".

"అయితే ఒక పని చెయ్యనా? మా మాటలు వినకండి. అయినా ఇక్కడ మీకేం పని? పొండి ఇక్కడనుండి" అని చెప్పనా తలుపులు బార్లా తెరచి.

"వద్దులే. నిద్రొస్తే వాళ్ళే పోతారు వాళ్ళ పడక గదుల్లోకి. ఇంతకీ ఈ మంచం కింద ఏ ఆడ దయ్యం లేదుకదా!"

"ఉండదులెండి. మా వాళ్ళు ముందే 'చెక్' చేశారు".

"మరుగు గురించి ఒక విషయం గుర్తు కొస్తోంది. చెప్పనా?"

"చెప్పండి" నడుము చుట్టూ చేతులేసి, కాస్త మరి కాస్త దగ్గరగా జరిగి.

"మా ఊళ్లో ఒక ప్రౌఢ ఏం చేసిందో చెప్పనా! నాలుగు వాటాలుండే ఆ ఇంటిలో చివరి వాటాలో అద్దెకు దిగిందావిడ, భర్త ఇద్దరు మగ పిల్లలతో. ఆ వాటాల్లో అందరికీ ఒకే పెరటి వరండా, అక్కడే స్నానాలు చెయ్యాలి. ఆ వరండా వెనుక చిన్నచిన్న వంటిళ్ళు, వాటి వెనుక చిన్నచిన్న టాయ్‌లెట్లు. పెరటిలో అక్కడెక్కడా స్నానాలకి వీలుండదు. మిగతా మూడు వాటాల్లో అందరూ మగవాళ్ళే. భార్య మరుగుకోసం భర్త ఒక తడిక అడ్డంగా పెట్టించాడు. తడిక వెనుక ఆమె స్నానం చేస్తుంటే, ఈ మగాళ్లు ఏదో పనున్నట్టు పెరటిలో అటూఇటూ తచ్చాడేవాళ్ళు, ఆ మరుగు వేపే చూస్తూ. భర్త ఉదయాన్నే డ్యూటీకి వెళ్ళేవాడు. అతడో చిరుద్యోగి. ఈ మగాళ్ళ తీరు చూచిన తరువాత ఆమె ఏం చేసిందో తెలుసా?"

"ఏం చేసింది. ఇల్లు ఖాళీ చేసిందా."

"అబ్బే! అదేం చేయలేదు. అడ్డుగా ఉన్న ఆ తడికను తీయించేసింది. అప్పటినుండి ఒక్క మగమహారాజు ఆమె స్నానం పూర్తి చేసేంత వరకు, తలుపులు తీసి బయటికి వస్తే ఒట్టు".

"కథ బాగానే ఉంది. ఏమైనా సిగ్గు సిగ్గే కదా. ఏ ఆడదీ అంతగా సాహసించదు".

"ఇందులో సాహసం ఏముంది? ఇది కూడా ఒక రకమైన మరుగే కదా".

"ఇప్పుడు మనమేం చేద్దాం. తలుపులు పూర్తిగా తెరిచేయనా?"

"అలా చెయ్యొచ్చా! కాని సిగ్గు సిగ్గే కదా. దేని కైనా మరుగు, దాపరికం ఉండాలి కదా!"

"అయితే ఇప్పుడు ఒప్పుకుంటారా? మీరు చెప్పింది ఒక కల్పిత కథని".

"ఒప్పుకుంటాను. నిజంగా నీ వాదన ముందు నేను ఓడిపోయాను".

"అలా అనకూడదు. గెలుపు ఓటములు మనిద్దరివి. అప్పుడే దాంపత్యంలో మాధుర్యం".



'చూశావా? ఏమీ తెలియదంటూ ఎన్నెన్ని విషయాలు చెప్పేస్తున్నావో? ఇంకా చెప్పు. నేనో మాట చెప్పనా? భార్య ఎప్పుడూ భర్తకు కొత్తగా కనిపించాలట. నిజమా?"

"అది పెద్ద విషయమేమీ కాదు. భర్త భార్యకు బట్టలు నగలు వెరైటీగా కొనిపెడుతుంటే, వాటిని ధరించి ఆమె నిత్యనూతనంగా కనిపిస్తుంది".

"చమత్కారివే. మరి భర్త భార్యకు కొత్తగా కనిపించాలంటే".

"అది మీరే తెలుసుకోవాలి కదా!" అది మీ మగాళ్ళ పని".

"నీతో గెలవడం కష్టమే సుమా! మరి మీవాళ్ళు బయటికి వెళ్ళేటప్పుడు అందంగా సింగారించు కుంటారు. మరి ఇంట్లో ఏ ముస్తాబు లేకుండా పాత బట్టలతో ఉంటారెందుకు?"

"అదీ మీ మగాళ్ళ కోసమే. ఇంట్లో ఉన్నట్టుగా ఏ ముస్తాబు లేకుండా, పాత బట్టలతో బయటికెళ్తే! ఏమ్మా! ఈవిడ భర్తగారు ఈమెకు కొత్తచీరలు, నగలు కొనిపెట్టరా?" అని మిమ్మల్ని హేళన చేస్తారు. అది మీకూ నాకూ అవమానం కదా. ఏదైనా మీ కోసమే".

"గడుసు దానివే. ఎలాగైనా నీవే గెలుస్తున్నావు".

"చెప్పానుగా. ఇందులో గెలుపు ఓటములు ఎక్కడున్నాయి. అసలు విషయం చెప్పనా? ఏ భర్త భార్యను నగలు, చీరలు చూసి ప్రేమించడు; దగ్గరకు రాడు. నిజానికి ఏ భర్తకీ ఇవేమీ అక్కర లేదు. మంచి మనసు కావాలి. ప్రేమించే మన సుతో భార్య, భర్తను చేరుకోగలిగితే చాలదా? ఈ నగలు, చీరలు, ముస్తాబు అవసరమా? అసలు ఈ రాత్రి మనకు ఇవన్నీ అవసరమా? దగ్గరకు రండి. మీ చెవిలో చెప్పాలి. చెవి బాగా దగ్గరకు




తెండి" అంటూ ఆమె గుసగుసలాడితే పులకించిన అతను, 'నీవు సహకరిస్తే నేనే చేస్తానా పని".

"ఎక్కడ నుండి ప్రారంభించను" కాలి పట్టెలు సవరిస్తూ.

"మీ ఇష్టం. తాళి, కాలి పట్టీలు ఉండాలి మరి, మట్టి గాజులు ఉండాలి".

"కాలి మువ్వలు ధ్వని చేస్తాయేమో, గాజులతో కలిసి"

"ఆ మువ్వల ధ్వని మధురంగా ఉంటుంది కదా" కాని ఆ గదిగోడలు మనల్ని చూడకూడదు".

"అయితే గదిని చీకటి చేద్దాం".

"చంద్రుడు, నక్షత్రాలు కూడా మనల్ని చూడ కూడదు మరి".

"కిటికీలు ఎప్పుడో మూసేశాం కదా".

"కాని ఆ చీకటిలో నేను మిమ్మల్ని మీరు నన్ను చూడటం ఎలా?" నాకు వెలుగు కావాలి".

"కళ్ళ వెలుగులు చాలవా? చేతుల స్పర్శలు చెప్పవా? మాటలాడి పెదవులు పెదవులు పరా మర్శించుకోవా? ఏమీ లేకపోతే నీవెలా ఉంటావో తెలుసా? వికసించిన మొగలి పొత్తులా ఉండవూ!

వెంటనే గది చీకటైంది. తనువులు పెనవేసు కున్నాయి. మనసకపుభానులయ్యాయి.

మెత్తని మధురమైన ధ్వనులతో గది పుల కించింది. మల్లెలు మురిసిపోయాయి.

ఉచ్ఛ్వాస నిశ్వాసాలు, తనువులతో పాటు వేడెక్కాయి. పాన్పు సహకరించింది.

నిమిషాలు దొర్లిపోయాయి. నిశ్శబ్దం తరువాత.

"నీవే గెలిచావు" "కాదు మీరే గెలిచారు" -ప్రశంసలు.

గడియారం పన్నెండు కొట్టింది. పెద్దముల్లు, చిన్నముల్లు పెనవేసుకున్నాయి.

సగం రాతిరి దాటింది. ఇంకా సగం రాతిరి మిగిలి ఉంది. ఇంకా ఇంకా.

"ఇక్కడికి ఆపేద్దాం" అంటూ శ్యామసుందరం డాబా దిగిపోయాడు. అతడలా వెళ్ళగానే "బాబాయి మహా రసికుడిలా ఉన్నాడు - అతని లాగే అతని భార్య మంచి మాట కారే" ఎవరో అన్నారు. "అవును అలాగే అనిపిస్తోంది" ఇంకోరన్నారు.

"ఆమెనోసారి చూడాలని ఉంది" అన్నారు మరొకరు.

"అయినా అంతేసి సంభాషణలు మొదటి రాత్రి సమాగమం వేళ సాగుతాయా?" ఇంకొక రన్నారు. "ఎవరి తొందర వాళ్ళకుండదు? ఎన్నాళ్ళ నిరీక్షణో కదా?"

నా పక్కన కూర్చున్న పెద్దాయన లేచి వాళ్ళ దగ్గరికెళ్తూ "ఆ తొందరపాటు కూడదనేకదా, ఆయన చెప్పేది" అన్నాడు. "తనువుల కన్నా ముందు మనసులు సంగమించాలని కదా!"

"అంటే ఆయన మీకు బాగా తెలుసునా?"

"చెప్పండి చెప్పండి మీకేం తెలుసో".

"చెప్పడానికేమీ లేదు. స్త్రీ హృదయం తెలిసిన మనిషి. స్త్రీలో జంకు ఉండకూడదనే మనిషి. అంతే".

"అంటే? అతని భార్య అతనికి ఎన్నో నేర్పి ఉండాలి. దాంపత్య జీవితంలో మాధుర్యం అందించి ఉండాలి"

"అతనికి భార్యలేదు. పిల్లలు లేరు. అసలా యన పెళ్ళే చేసుకోలేదు".

"మరి?"

"అతనో వాత్స్యాయనుడు. వాత్స్యాయనుడు బ్రహ్మచారి అని చెప్తారు. ఇతనూ అంతే".

"కాని చాలా మంచి విషయాలు చెప్పాడు" అంటూ అందరూ అంగీకార సూచకంగా మౌనంగా ఉండిపోయారు. ఎక్కడో కోయిల కూసింది, మావి గున్నమాటున.

సెల్: ***76750 00279***



# కొత్త జంటలకు కూల్ కూల్ యాత్రలు

**ఎండలు మండిపోతున్నాయి. మరీ అత్యవసరమైతే తప్ప ఇంటి నుంచి బయటకు వెళ్లే పరిస్థితి లేదు. నలబైఅయిదు డిగ్రీల ఎండ, ఉక్కపోతలో కొత్తగా పెళ్లయిన జంటల పరిస్థితి ఏమిటి? బయటకు వెళ్లి సరదాగా గడపాలనుకునేవారికి ఈ ఎండాకాలం కోరికలను ఎండగట్టే కాలమే! మరి వారు ఈ సరదాలకు దూరం కావాల్సిందేనా! రొమాంటిక్‌గా గడుపుతూ బెరుకుతనం దూరం చేసుకోవడం ఎలా? నూతన దంపతులు మాత్రమే కాదు ఆలుమగలు కూడా ఈ వేసవిలో ఎటైనా వెళ్లాలనుకుంటారు. మరి వారి అనురాగాన్ని శాశ్వతం చేసే క్షణాల్ని ఈవేసవిలో ఎలా ఎంజాయ్ చేయవచ్చో తెలుసుకుందాం రండి!**

కొత్త దంపతులు కొన్ని రోజులు ఏకాంతంగా, ఆనందంగా గడపడానికి ఎంచుకునే యాత్ర హనీ మూన్. ఈ మధుర యాత్ర దంపతుల మధ్య బంధాన్ని మరింత దృఢపరిచి మరపురాని జ్ఞాపకాలు పంచుతుంది.

### ట్రిప్ ఎన్ని రోజులు?

ఎంత కొత్త దంపతులైనా వారం రోజుల ట్రిప్ అంటే కుదరకపోవచ్చు. వ్యక్తిగతమైన, వృత్తిపర మైన సమస్యలతో హనీమూన్ వాయిదా వేసు కుంటారు కొందరు. కానీ వారం రోజులు వీలు కాకపోతే రెండు మూడురోజుల్లో పూర్తయ్యేలాగా ప్లాన్ చేసుకోవచ్చు. ఋతువును బట్టి ఏ ప్రాంతా నికి వెళితే బాగుంటుందో టూరిస్టుల సలహా తీసు కోవడం కూడా మంచిదే. దంపతులిద్దరికీ ఇష్ట మైన ప్రదేశాన్ని ఎంపిక చేసుకోవడం కూడా కీలకమే. ఇలా అన్ని వివరాలూ తెలుసుకుని వెళితే సంతృప్తితో పాటు మరింత ఆనందంగా హనీమూన్ గడపవచ్చు.

### ఎక్కువ టైమ్ లేదా?

హనీమూన్ యాత్ర ఎంజాయ్ చేయడానికి మీకు ఎక్కువ టైమ్ లేదా? నో ప్రోబ్లమ్! మనకున్న తక్కువ సమయంలోనే దాన్ని ప్లాన్ చేసు కోవడం దగ్గర్లో ఉండే ప్రదేశానికి ప్రాముఖ్యం ఇవ్వడం మంచిది. లేదంటే సమయం అంతా ప్రయాణానికే సరిపోతుంది. మన సిటీకి దగ్గర్లో ఉండే ప్రదేశాలు అంటే మీరే స్వయంగా కార్లో లేదా బైక్‌లో వెళ్లేంత దూరంలో ఉన్నవి ఎంపిక చేసు కుంటే మరీ మంచిది. దీనివల్ల రెండు లాభా లున్నాయి. అవేంటంటే ఇద్దరూ కలిసి లాంగ్ డ్రైవ్‌కి వెళ్లినట్లు ఉంటుంది. దాంతో పాటు మినీ హనీమూన్ కూడా గడిపిరావచ్చు.

### చల్లని ప్రదేశాలే

కొత్తగా పెళ్లయిన జంటలు హనీమూన్‌కి వెళ్లడం సహజమే. ఆ తర్వాతకూడా చాలామంది ట్రిప్స్ పేరుతో ఏదో ఒక ప్రదేశాన్ని చుట్టి వస్తుం టారు. ఈ ఎండల్లో ఎక్కడికి వెళ్లాలో తెలియని డైల

## ఇంట్లోనే ఉంటారా

అసలు హనీమూనూ వద్దూ, ఏదీ వద్దు. ఈ ఎండల్లో అసలు బయట తిరగాలనుకోవ ట్లేదు అనుకునేవాళ్లు ఇంట్లోనే ఉంటూ కూడా ఎంజాయ్ చేయవచ్చు. సాయంత్రం మేడపైన ఇద్దరూ చల్లని గాలిని ఆస్వాదించవచ్చు. గార్డెన్ లోకి వెళ్లి మొక్కలకు నీళ్లు పట్టడం వంటివి చిన్న పనులు కూడా ఎంతో ఆహ్లాదం, ఆనందం కలిగిస్తాయి. సూర్యాస్తమయ దృశ్యాలను తిల కిస్తూ నచ్చిన చిరుతిళ్లు తింటూ దంపతులు హాయిగా కబుర్లు కలబోసుకోవచ్చు. రాత్రిపూట మేడపైనే మీకిష్టమైన సంగీతాన్ని పెట్టుకుని, మూన్‌లైట్ డిన్నర్‌ని కలిసి ఆస్వాదించండి. ఇలా ఇంట్లోనే ఉన్నా సరే మీకు నచ్చిన పద్ధతుల్లో ఓ వైపు ఎండ నుంచి



ఉపశమనం పొందుతూనే రొమాంటిక్‌గా మీ జీవిత భాగస్వామితో కలిసి మీ దాంపత్యబంధాన్ని దృఢపరుచుకునే ప్రయత్నం చేయండి.

మాలో ఉంటారు చాలామంది. మీరు కూడా ఇలాంటి డైలమాలో ఉంటే వెళ్లడానికి బీచ్, హిల్‌స్టేషన్ లాంటి చల్లని ప్రదేశాలు ఎంచుకోండి. మీరు వెళ్ళే ప్రాంతంలో ఉష్ణోగ్రతలు, తీసుకోవాల్సిన జాగ్రత్తలు వంటివన్నీ ముందే తెలుసుకుని వెళ్లడం మంచిది. దీనివల్ల అక్కడికి వెళ్లిన తర్వాత ఎలాంటి ఇబ్బంది లేకుండా ఆనందంగా గడిపే అవకాశం లభిస్తుంది.

### ఏకాంత సమయం

హనీమూన్‌కి కొత్త ప్రదేశాలకు వెళ్లాం కదా కాబట్టి అక్కడ ఉన్న ప్రదేశాలన్నీ చూసేయాలనే ఆత్రుతతో ఉంటారు. అలా అని చూడవద్దని కాదు కానీ ఎక్కువ సమయం అక్కడే గడపడం వల్ల ఇద్దరికీ ఏకాంత సమయం దొరక్కపోవచ్చు. కాబట్టి మీరు వెళ్లే ప్రదేశంలో ఎక్కువ ప్రాధాన్యం ఉన్న ప్రదేశాలను చూసేందుకు మాత్రమే ముందుగా అనుకుని వెళ్లాలి. అలాగే బోటుషికారు, సాహస కృత్యాలు చేయడం వంటివాటి ద్వారా బోలెడంత ఆనందంతో పాటు ఇద్దరి మధ్య అనుబంధం కూడా దృఢపడుతుంది.

### ఒకరికొకరు జతగా

దంపతులు కాకముందు ఇద్దరూ వేరు వేరుగా వివిధ ప్రదేశాలకు వెళ్లి ఉంటారు కానీ పెళ్లయిన తర్వాత దంపతులిద్దరూ వెళ్లే మొదటి యాత్ర ఇదే కదా! అందుకని వారి మధ్య బంధం మరింత బలపడాలని కోరుకుంటారు ఎవరైనా. అందు కోసమే ప్రత్యేకంగా కొన్ని హనీమూన్ స్పాట్స్ శాశ్వత ప్రాతిపదికపై వెలుస్తున్నాయి. ఇలాంటి చోట్ల కొత్త జంటల కోసం ప్రత్యేక కార్యక్రమాలు ఏర్పాటు చేస్తున్నారు. వాటిల్లో కపుల్ గేమ్స్, కపుల్ మసాజ్, సోనా బాత్, డేట్‌నైట్ వంటివి ఏర్పాటు చేస్తున్నారు. ఇలాంటి ప్రదేశాల గురించి ముందుగానే తెలుసుకుని ఆ ప్రదేశాలకు వెళ్లడం ద్వారా సంతోషాన్ని మూటగట్టుకోవడంతో పాటు రొమాంటిక్ ఫీలింగ్‌ను కూడా ఆస్వాదించవచ్చు. అయితే ఎండాకాలంలో ఇంట్లో ఉండే జంటలు కూడా కాస్తంత రొమాంటిక్ టచ్ జోడించి వేడిని దూరం చేసుకుంటే బాగుంటుంది కదూ..అందుకే ఇద్దరూ కలిసి ఒకే టబ్‌లో బబుల్ బాత్, లేదా ఒకే షవర్‌కింద స్నానం చేయండి. మీకు నచ్చినంత సమయం చల్లదనంతో పాటు మీ భాగస్వామి సాన్నిహిత్యాన్ని ఆస్వాదించండి.

### బిడియం పక్కన పెట్టండి

కొత్త జీవితంలోకి అడుగుపెట్టిన మొదట్లో దంపతుల మనసుల్లో ఒకరిపట్ల ఒకరికి ప్రేమ ఉన్నా అది సిగ్గు, బిడియం, బెరుకు వంటివాటితో కప్పబడి ఉంటుంది. పెళ్లికి ముందు ఇద్దరూ చాటింగ్ చేసుకున్నా మాట్లాడుకున్నా సరే పెళ్లయిన తర్వాత ఇలా చెప్పడం తప్పనో లేదా తెలియని దేమైనా అడిగితే ఏమనుకుంటారో అన్న సందేహాలతో చాలామంది మనసులోని మాట చెప్పకుండానే ఉండిపోతారు. కాకపోతే ఇలాంటి భావాలన్నీ మనసులో నుంచి తొలగిస్తే తప్ప ఒకరికొకరు అర్థం చేసుకోవడానికి వీలుపడదు. అందుకే ఇలాంటి బిడియాలన్నీ పక్కకు పెట్టి ఒకరి గురించి ఒకరు ఎంత వీలైతే అంత ఎక్కువగా మాట్లాడుకోవడం, తెలుసుకోవడం, దగ్గరగా ఉండడం వంటివి చేస్తే బెటరు. అయితే ఈక్రమంలో నాకు నచ్చినట్లే ఉండాలన్న అహంకారం, స్వార్థం వంటి భావాలు పక్కన పెడితే బాగుంటుంది. దీని వల్ల వారిద్దరి మధ్య చిన్న చిన్న మనస్పర్థలు తలెత్తకుండా వెళ్లిన నాలుగు రోజులూ ఆనందంగా గడపడంవైపే మొగ్గు చూపడం మంచిది.



## సరదాగా పిక్నిక్‌కి వెళితే

ఎండాకాలంలో ఎలాంటి ప్రేమయాత్రలకు వెళ్ళడానికీ ఇష్టపడనివారు, అవకాశం లేనివారూ కనీసం సింగిల్ డేలో పూర్తయ్యే చిన్న చిన్న పిక్నిక్స్ అయినా ప్లాన్ చేసుకోవచ్చు. ఇద్దరూ కలిసి బయటకు వెళ్లే అవకాశం దొరుకుతుంది. ఎండ తట్టుకోలేం అనుకునే వారు సాయంత్రాలు బయటకు వెళ్లి రావడానికి ప్రయత్నించవచ్చు. లేదా ఇంటిపట్టునే ఆహ్లాదకర వాతావరణంలో కబుర్లతోనో, సాయంకాలాలు వాకింగ్‌కు వెళుతూ ఇంటరాక్ట్ కావచ్చు. ఇక వీకెండ్ ట్రిప్స్‌లో వాటర్‌వరల్డ్ లాంటి చల్లని పార్కులకు వెళ్ళడం ద్వారా ఎండ నుంచి ఉపశమనం పొందడమే కాదు నీడ పట్టున నీటిలో చల్లచల్లగా ఎంజాయ్ చేసి రావచ్చు.

### వీటికి దూరంగా ఉండండి

తక్కువ సమయంలో హనీమూన్ వెళ్లి రావాలనుకునే వారు విలువైన సమయాన్ని వృథా చేయాలనుకోరు. ఉన్నది తక్కువ సమయమైనా దాన్ని సద్వినియోగం చేసుకోవడానికే జంటలు ప్రయత్నిస్తాయి. ఈ క్రమంలో అక్కడ కూడా మీ పనులనే కాకుండా ఒకరికొకరు అర్థం చేసుకోవడానికి ప్రయత్నించండి. ఈ క్రమంలో టీవీలు, ల్యాప్‌టాప్స్, మొబైల్స్ వంటి ఎలక్ట్రానిక్ గ్యాడ్జెట్లకు వీలైనంత దూరంగా ఉండడం మంచిది. దీనివల్ల చాటింగ్‌లతో లేక వేరే పనులతో సమయాన్ని వృథా చేసుకోకుండా ఏకాంతంగా కూర్చుని మాట్లాడుకోవడానికి వీలు చిక్కుతుంది.

### వెరైటీగా ఆస్వాదిస్తే

కొందరు దంపతులు భార్య, భర్త అనే భేదం లేకుండా అన్ని రకాల పనుల్నీ ఒకరి కొకరు షేర్ చేసుకుంటారు. ఈసారి ప్రత్యేకంగా మీ భాగస్వామి కోసం వారికి నచ్చే పదార్థాలను సిద్ధం చేసిపెట్టండి. అందులోనూ ఎండాకాలం కాబట్టి కూల్ కూల్‌గా ఉండే పదార్థాల్ని తయారు చేయండి. భర్త లేదా భార్య ఇంటికి వచ్చే సమయానికి వీటిని సిద్ధం చేసి ఉంచితే, భాగస్వామి వాటిని ఆస్వాదిస్తూ అలసటను ఇట్టే మరిచి పోతారు. అంతేకాదు జ్యూస్‌లు, ఐస్‌క్రీమ్‌లు వంటి చల్లని పదార్థాలను రంగు రంగుల ఆకర్షణతో ఒకరి కొకరు తినిపించుకుంటుంటే ఇటు చల్లదనముతో పాటు భాగస్వామి అనురాగమూ మీ సొంతమవుతుంది. ఒకరికొకరు ఇలాంటివి చేయడం వల్ల ప్రేమానుబంధాలు బలపడతాయి.

- నివేదిత






**"అత్తా, మీరేమీ అనుకోకపోతే చిన్నమాట. ఇప్పుడే మీ ప్రయత్నాలు కొంచెం కొంచెం అర్థమవుతున్నాయి. ఇవన్నీ జరగడానికి ముందే రవి, నేను పెదనాన్నను సంప్రదించడానికి ఆయన దగ్గరకు వెళ్లి వస్తాం" అన్నాడు సుబ్రమణ్యం.**

**సాలోచనగా ఉన్న వసుంధర "పెదనాన్న" అనగానే ఉలిక్కి పడింది. సుబ్రమణ్యం అంటే ఆమెకు అభిమానమే కాని ఎందుకో చొరవ చూపించదు. అతడితో ఎక్కువగా మాట్లాడదు.**

"ఆయన సూచన విలువైనదే, ఆలోచించమ్మా" అన్నాడు రవి.

"సరే మీ ఇష్టం, త్వరగా బయల్దేరండి. దాక్షాయిణి ప్రయత్నానికి ఆలస్యం, ఆటంకం లేకుండా ఉండాలి".

ఒంగోలుకు దగ్గరలో ఉప్పుగుండూరు గ్రామం. దానికి అయిదు కిలోమీటర్ల దూరంలో, సముద్రానికి సమీపాన ఉన్న చిన్న గ్రామం అది. ఊరు ముందు చిన్న నది ఉంది. జీవనది కాదు. వర్షాకాలంలోనే అందులో నీరు కనిపిస్తుంది. మిగిలిన కాలమంతా ఇసుకమేటలే. ఊళ్లో ఒక శివాలయం. ఆంజనేయ స్వామి, భావనారాయణ, గణపతి, పురాతన కాళీ దేవాలయం, పక్కపక్కనే ఒక సముదాయంగా ఉన్నాయి. ఏటి నుంచి కాలువలు తీసి, వరి, రాగి, కూరగాయలు, ఆకు కూరలు వేసేవాళ్లు. ఊరు చుట్టూ బావుల కింద అన్నిరకాల మెట్టపంటలూ పండించే వాళ్లు. గ్రామంలో ఇండ్లు తాటిపాకలు, ఇంటి ముందు వరిగడ్డి తాళ్లతో పేని గుండ్రంగా అల్లుకున్న పురుల నిండా వరి ధాన్యం, ఊరిలో కొన్ని మిద్దెలు కూడా ఉన్నాయి.

ఆ రాత్రే బయల్దేరి ఉదయానికల్లా ఒంగోలు చేరుకున్నారు. వీరు వెళ్ళేటప్పటికి నరసింహయ్య పంతులుగారు నిత్యానుష్ఠానంలో ఉన్నారు. నరసింహయ్య పంతులుగారు ప్రశ్నా శాస్త్రంలో ప్రసిద్ధి. ఎంతోమంది దూరప్రాంతాల నుంచి వారివారి సమస్యల నివృత్తికి వస్తుంటారు. తరతమ భేదం లేకుండా అన్నిస్థాయిల వారూ వస్తుంటారు.

ఆయన ప్రశ్నలకు సమాధానాలు ఇచ్చే సమయంలో శాంభవి ముద్రలో ధ్యాన నిమగ్నులై ఉంటారు. శాంభవి ముద్రలో ఆయన నేత్రాలు తెరుచుకునే ఉంటాయి. అంతర్వీక్షణంలో ఉంటారు.

మనిషికి జ్ఞానేంద్రియాలున్నాయి. మస్తిష్కంలోని పొరలు మనసును చేరి జ్ఞానగ్రహణ శక్తిని ఇస్తాయి. ఆ ప్రక్రియను టెలీపతిగా భావిస్తారు.

నరసింహం పంతులు గారిది సిద్ధయోగమార్గం. మిగతా ధ్యానమార్గాల్లా కాదిది. పూర్తిగా భిన్నమైనది. ఈ రకం ధ్యానంలో భక్తి, యోగం, మంత్రం, హఠం నాలుగూ కలిసి ఉండే అపురూపమైన మార్గం. హిమాలయ సాధువు ద్వారా ఉపదేశం పొందారు ఆయన. శాబర మంత్రముగా ప్రసిద్ధి చెందిన ఈ విధానం, లకోట ప్రశ్నగా ప్రసిద్ధి. ప్రశ్నించిన సమయాన్ని గుణించి వారు తెచ్చిన తమలపాకులు లెక్కవేసి కర్ణపిశాచి ద్వారా సమాధానం పొంది చెప్తారు.

"ఈరోజు సోమవారం కాబట్టి ప్రశ్నకోసం వచ్చే వారు లేరు. శని, ఆదివారాలైతే రద్దీ ఉండేది" మెల్లగా అన్నాడు సుబ్రమణ్యం.

ఇద్దరినీ లోనికి వచ్చి



### జరిగిన కథ

**త**ల్లి కోరిక మేరకు అమెరికా నుండి తిరిగొచ్చి ఆసుపత్రి ప్రారంభిస్తాడు డాక్టర్ రామచంద్రుడు. ప్రియురాల్ని త్యాగం చేసి తల్లి చెప్పిన అమ్మాయినే పెళ్ళాడి అడ్జస్ట్ అయిపోతాడు. కాలేజీరోజులనాటి మధురానుభూతులింకా రామచంద్రుడు, దాక్షాయణిల అంతరంగాలనూ వెంటాడుతూనే ఉంటాయి. అతడి ఆసుపత్రినీ ఇంటినీ సంస్కరించే బాధ్యతలు చేపడుతుంది దాక్షాయణి.

ఆ తరువాత..

కూర్చోమని ఎవరో పిలిచారు.

గది అంతా చీకటిగా ఉంది. నరసింహం పంతులు కళ్ళు మెరుస్తూ ప్రకాశవంతంగా ఉన్నాయి. గదిలో చాలా ప్రశాంతంగా ఉంది. ముందుగా రవిని వెళ్ళి పంతులుగారికి ఎదురుగా కూర్చోమని చెప్పాడు సుబ్రహ్మణ్యం. రవి పంతులు గార్కి ఎదురుగా కూర్చున్నాక,

"ఆయనకు ప్రణమిల్లు" అన్నాడు సుబ్రమణ్యం. దగ్గరగా జరిగి సాష్టాంగ ప్రణామం చేశాడు రవి.

"స్వామీ, మేం ఇద్దరం అన్నదమ్ములం. మాకు సంతానం లేదు. మాకు సంతానయోగం ఉందా?" అని ప్రాధేయంగా ప్రశ్నించాడు.

క్షణ కాలం నిశ్శబ్దం.

చేతివేళ్ళని గాలిలో కదిలిస్తూ గంభీరంగా ఆవులించి, "ఇద్దరికీ సంతానయోగం ఉంది, కృత్రిమ గర్భధారణ ద్వారానే జరుగుతుంది. ప్రారబ్ద కర్మ వాసనలు తొలగించుకోవాలి" అంటూ మంత్రాక్షతలను రవి చేతిలో ఉంచారు పంతులు గారు.

బయటికి వచ్చేశారు ఇద్దరూ. అరుగుమీద కూర్చున్నారు.

అరగంట తరువాత నరసింహం పంతులు బయటకి వచ్చి కుర్చీలో కూర్చున్నారు. అందరికీ వేడిపాలు గ్లాసుల్లో తెచ్చారు.

సుబ్రమణ్యం ఆయనకు దగ్గరగా జరిగి పక్కనే నిల్చున్నాడు.

"కూర్చో" కుర్చీని చూపించాడు.

"రవి, రామచంద్రుడు తమ్ముడు. ఈ మధ్యనే యూఎస్ నుంచి వచ్చాడు. తలకు ఆపరేషన్ అయింది" అంటూ రవిని కూడా దగ్గరకు రమ్మని పిలిచాడు సుబ్రమణ్యం.

"ఎప్పుడో చిన్నప్పుడు చూశాను. చాలా సంవత్సరాలయింది. వసుంధర ఎలా ఉన్నది" ప్రశ్నించారు.

"వంశాంకురం గురించే ఆమె ఆందోళనగా ఉన్నారు. మీ ఆశీస్సులు తీసుకుని రమ్మని మమ్మల్ని పంపారు" సుబ్రమణ్యం అన్నాడు.

"పోనీలే, ఇప్పటికైనా..." అంటూ ఆగిపోయాడు.

"కర్మ నివృత్తికి మార్గం చెప్పండి" రవి కోరాడు.

"కర్మ సిద్ధాంతాలు ఆక్షేపణీయమైనవి ఏమీలేవు. మనం చేసే పనిని బట్టి ఫలితం ఉంటుంది. కర్మ సిద్ధాంతం మీద మనం పూర్తిగా ఆధారపడి అడుగడుగునా నడుచు కుంటున్నాం. మన వాళ్ళు చెప్పిన కర్మ సిద్ధాంతం అంత సుగమమైనది కాదు".

"మీరు ఎట్లా చెప్తే అట్లాగే చేస్తాం" అన్నాడు రవి.

"నీకు తెలుసుగదయ్యా సుబ్ర



మణ్యం, నీ ప్రక్రియలో కూడా చూడు".

"చూస్తాం గాని మీరే మాకు నిర్ణయ సింధువు. మీరే చెప్పండి".

కాగితం తీసుకుని ఏమేమి చేయాలో ఇద్దరికీ వివరించారు. భోజనాలు అయ్యాక, పండ్లు ఇచ్చి నమస్కరించి ఇద్దరూ బయల్దేరారు.

●●●

డాక్టర్ శ్రీమతి గారి హాస్పిటల్‌లో మామోగ్రామ్ ట్రాన్స్‌వెజైనల్ స్కాన్ చేయించారు సీతకి. స్కాన్‌లో ప్రొలాప్స్ యుటెరస్ గమనించింది ఆవిడ.

పీరియడ్స్ వచ్చాక 10, 12, 14వ రోజులలో ఫాలిక్యులార్ స్టడీ చేయాలని సూచించింది. ఆయా రోజులలో టెస్ట్‌లకి అపాయింట్‌మెంట్ వచ్చేలాగా ప్లాన్ చేసుకుంది.

రిపోర్టులు అన్నీ వచ్చాక ముగ్గురూ కూర్చుని ప్యానల్ డిస్కషన్ ఏర్పాటు చేసుకున్నారు. నిర్ణయం వారిద్దరిదే అని రామచంద్రుడు నిశ్చయంగా అన్నాడు.

వారు టెస్ట్‌లన్నీ స్టడీ చేసి, తీవ్రంగా చర్చించుకున్నాక, సీత గర్భాశయం అనుకూలం కాదని, సరోగసీకి మాత్రమే వీలుందనే నిర్ణయానికి వచ్చారు. బీజము, అండము ఎంబ్రియో తయారీకి చాలా పాజిటివ్‌గా ఉన్నాయని, ఈ సంగతి ఉభయులకూ తెలిపి మానసికంగా సిద్ధం చేసి తరువాత ప్రయత్నాలు ప్రారంభిద్దామని నిర్ణయించారు.

దాక్షాయిణి వ్యక్తిగత శ్రద్ధకు డాక్టర్ శ్రీమతి కూడా తోడయింది.

ఇద్దరు డాక్టర్లూ ముందుగా, సీత పరిస్థితిని ఆమెకు పూర్తిగా వివరించారు. అనుకోని ఈ డెవలప్‌మెంట్‌తో ఆశ్చర్యమేసింది సీతకు.

వాస్తవానికి సీత ఆరోగ్య పరిస్థితి కారణంగానే ఆమె విముఖంగా ఉంటోందని రామచంద్రుడికి కూడా అప్పుడే అర్థమయింది.

యాక్షన్ ప్లాన్ దాక్షాయిణి సిద్ధం చేసుకుంది. వసుంధరతో చాలా వివరణాత్మకంగా చర్చించి ఒప్పించింది.

ఈ సరోగసీ ప్రక్రియకు ఆంతరంగికమైన స్త్రీ అవసరం ఉంది. ఎట్లా అని ఆలోచనలో పడ్డారు. అంతలో గ్రామం నుంచి రంగయ్య దంపతులు వారి అబ్బాయి చెకప్ కోసం వచ్చారు. మందులు సక్రమంగా వాడుతూ ఆరోగ్యంగా ఉన్నాడు. రంగయ్య తెలివైన వాడు. ఏదో సీరియస్‌నెస్ వసుంధర కుటుంబ సభ్యులలో ఉందని గమనించాడు.

కొడుకును పరీక్ష చేసి మందులు రాసివ్వడం పూర్తి అయినాక దాక్షాయిణిని అడిగాడు రంగయ్య.

"వసుంధర గారిని ఏదో సమస్య కలిచి వేస్తున్నది. నాకు ఆమెను అడగాలంటే భయం వేసి మిమ్మల్ని అడుగుతున్నాను. ఏమీ అనుకోవద్దమ్మా, నాకు ప్రాణం పోసిన వాళ్లు" అంటూ కళ్లు తుడుచుకుంటున్నాడు.

"నిజమే రంగయ్యా, విచిత్రమైన సమస్య అది. కొడుకులకు పిల్లలు కలుగలేదని వసుంధరమ్మ చింత".

"కాలం కలిసి రావాలి కదమ్మా, ఇంటిల్లిపాదీ దిగులుతో ఉన్నట్లు అనిపించి, విషయమేంటో తెలుసుకుందామని అడిగానమ్మా. మీరు మాకు దొరికినట్లు, వారిని కూడా ఏ దేవుడో కనికరించాలి కదమ్మా" అంటూ ఆగిపోయాడు.

సరోగసీకి అనువైన స్త్రీని రంగయ్య ద్వారా సెలెక్ట్ చేసుకోవచ్చు గదా? అని ఊహించి ఇదే సంగతి వసుంధరతో ముచ్చటించింది.

రంగయ్యను పిలిపించింది వసుంధర.

"చాలా గోప్యమయిన విషయం. బయటికి పొక్కకూడదు. నాకు ఆ విషయమై వాగ్దానం చేస్తానంటే మాట్లాడుతా" అని ఆమె అనగానే వసుంధర కాళ్లపై బడ్డాడు రంగయ్య.

**మానవాతీత శక్తుల్ని కొట్టిపారేయలేం. కానీ ఒక వైద్యుడు వైద్యపరంగా పరీక్షలు జరిపి శాస్త్రీయ పద్ధతిలో నిర్ధారణ చేసిన విషయాన్ని ఎక్కడో దూరంగా ఒక పల్లెటూర్లో కూర్చున్న నరసింహం పంతులుగారు సిద్ధయోగ మార్గం ద్వారా చెప్పగలిగారు. ఇదెలా సాధ్యమైంది? అదేవిధంగా వెంకట్రామన్ కూడా సియాన్స్ ప్రయోగం ద్వారా ఎక్కడో అపార్ట్‌మెంట్‌లో ఉరివేసుకుంటున్న వ్యక్తి ప్రాణాలు కాపాడాడు! ఇవన్నీ ఎలా సాధ్యమయ్యాయి?**

"లే! లే! పిచ్చివెధవ, నా ఆదుర్దా నాది".

"అమ్మా, నా ప్రాణమైనా ఇస్తా, నాకు ప్రాణం పోసినోళ్లు" ఏడుస్తూ అన్నాడు.

"అది కాదయ్యా, నా పరిస్థితి అది, నిన్ను నమ్మలేక కాదు, సరే! దాక్షాయిణమ్మ వివరాలు చెప్తుంది, విను. నీకు చేయగలననిపిస్తే, చేయి లేకపోతే ఆ విషయం మరిచిపో".

దాక్షాయిణి అన్ని వివరాలూ చెప్పింది.

"ఆమె ఆరోగ్యంగా ఉండాలి. కొన్ని మౌలికమైన పరీక్షలు అవసరమవుతుంటాయి. దానికి అందుబాటులో ఉండాలి. మంచి ఆరోగ్యకరమయిన వాతావరణంలో ఉండడం అవసరం".

వెంటనే అతనికి టీచర్ నీలాంబరి గుర్తుకు వచ్చింది. విధి నాటకంలో చితికిపోయి జీవిస్తున్న వ్యక్తి. భర్తను, తల్లిదండ్రులను పోగొట్టుకొని జీవిస్తున్న వ్యక్తి. కాంపెన్సేటరీ ఉద్యోగం రాక, లంచాలు ఇవ్వలేక ఊరి వారి దయాదాక్షిణ్యాల మీద పిల్లలకు ట్యూషన్ చెప్పుకుంటూ జీవితం వెళ్ళదీస్తున్న దీనురాలు.

"ఎంత మంచిదో ఆయమ్మ. ఈరోజే నేను వెళ్లి కనుక్కొని వస్తా. మూడో కంటికి తెలీకుండా చేస్తా. నన్ను నమ్మండి".

వసుంధర దగ్గరకెళ్ళి ఊరెళ్లి వస్తానని చెప్పి వచ్చాడు. డబ్బులు ఇవ్వబోతే వద్దంటే వద్దని బయల్దేరాడు.

●●●

ఉదయానికల్లా రవి, సుబ్రమణ్యం తిరిగి వచ్చారు. విశేషాలు అన్నీ వివరంగా వసుంధరకు తెలియజెప్పారు.

"కొన్ని నివారణ ప్రక్రియలు చెప్పారు. అవి ఇక్కడే చేయవచ్చు అన్నాడు రవి." అంటూ ఆయన రాసిచ్చిన కాగితం, ఆమెకు చూపించాడు.

ఆమె కాగితం చూసి చదివి కళ్ళకు అద్దుకుని మరలా రవికి ఇచ్చింది.

"ఎందుకో తెలీదుగాని, ఇప్పటికైనా గుర్తొచ్చామా అని నిష్ఠూరాలాడారమ్మా" అన్నాడు. ఇంకా మరచిపోలేదన్నమాట.

"ఏమోనమ్మా, ఆ పల్లెటూరులో అంత పెద్ద యింట్లో!!"

"ఆయన మారరురా, పట్టుదల మనిషి, అందుకనే అందరికీ దూరంగా ఉన్నారు".

"అవన్నీసరే, ఇప్పుడు తక్షణ కర్తవ్యం సుబ్రమణ్యం బావను కూడా ఇన్వాల్వ్ చేయమన్నారు".



## అంజలి కూడా చేయనందట!

బాలకృష్ణ 'గౌతమీ పుత్ర శాతకర్ణి' సినిమాకి హీరోయిన్ వేట ఇంకా కొనసాగుతూనే ఉంది. ఇప్పటికే చాలా మంది హీరోయిన్లను అనుకున్నారు. నయనతారమీద చిత్ర యూనిట్ బోలెడంత నమ్మకం పెట్టుకుంది. ఆమె తప్పకుండా ఈ సినిమాకి ఓకే చెబుతుందని భావించారు. కానీ నయన మాత్రం డేట్లు లేవంటూ తప్పించుకుంది. ఆ తరువాత అంజలికి ఛాన్స్ వచ్చింది. పాపం అంజలి కూడా డేట్లు అడ్జస్ట్ చేయలేక పోయిందట! ఈ సినిమాకి ఇంకా హీరోయిన్ల వేట కొనసాగుతూనే ఉంది అంటున్నారు.

"ముందు ఆయన ఏమి చెప్పారో, అదే చేయించండి" అంది వసుంధర.

సుబ్రమణ్యం తన రూముకు వెళ్లాడు.

•••

"లక్ష్మీనరసింహం గారు ఎట్లా ఉన్నారు. ఆరోగ్యం బాగానే ఉందా? మిమ్మల్ని బాగా రిసీవ్ చేసుకున్నారా?" ఆత్రంగా అడిగాడు రామచంద్రుడు.

"బాగా వయస్సు మళ్లినట్లున్నది. అయినా అనుష్ఠానం, పూజలు తగ్గలేదు. మమ్మల్ని బాగా రిసీవ్ చేసుకున్నారు. అందర్నీ పేరుపేరునా అడిగి వివరాలు తెలుసుకున్నారు".

ఆయన బలం, ఆరోగ్యం ఉపాసనే. "నిజం, అంత పల్లెటూరిలో ఆ వయస్సులో నిజంగా గ్రేట్. ఇంకా ఏమన్నారు?"

"నేచురల్‌గా కన్సీవ్ కారు, ఐవీఎఫ్ తప్పదు అన్నారు. అంటే కృత్రిమ గర్భధారణ అన్నారు".

"రియల్లీ, సర్‌ప్రైజ్" అంది దాక్షాయిణి.

సీత, వసుంధర మౌనంగా ఉన్నారు.

"ఇంకేమన్నారు?"

"ఏవో కార్యకలాపాలు, సుమను దగ్గరుండి నిర్వహించమన్నారు. అవన్నీ కాగితం మీద రాసిచ్చారు".

"సో, ఇక అంతా ఈ కార్యక్రమాలలో బిజీబిజీ అన్నమాట".

"రవీ, మీరేమైనా ఈ రిపోర్టుల గురించి వివరించి చర్చించారా?"

"అబ్సెల్యూట్లీ, నో వే".

"మరి అంత యాక్యురేట్‌గా ఎలా చెప్పగలిగారు?"

"అందుకేగా అంతదూరం వెళ్ళింది. ఇది అకల్ట్ సైన్స్ పవర్".

"నిజంగా ఆశ్చర్యంగా ఉంది" అంది దాక్షాయిణి.

•••

రామచంద్రుడు, రవి, సుమ ముగ్గురూ కూర్చున్నారు.

"మీడియం ఏర్పాటుచేసుకొని, సియాన్స్ ప్రయోగం చేసి కార్యక్రమం కూడా చేయమన్నారు. మరి అత్త ఒప్పుకుంటుందో లేదో?"

"ఇందులో అభ్యంతరకరమైంది ఏమిటి? కేవలం ప్రశ్నా కార్యక్రమమే కదా?" అన్నాడు రవి.

"సియాన్స్ అంటే ఏమిటి" రామచంద్రుడు ప్రశ్నించాడు.

"ఇది ఆధునికమైన సాంకేతిక పరిశోధనలతో కూడుకున్న ఆత్మవిచారం. అమెరికా, యూరప్‌లలో బాగా ప్రసిద్ధమైనది. మన నుంచి విడిపోయిన స్నేహితులు, ఆత్మీయ బంధువులు తమ శరీరాలను విడిచారేగాని, వాళ్ళు ఆత్మీయతలకు దూరం కాలేదని, స్పిరిట్ వరల్డ్‌లో చాలాసుఖంగా ఉన్నామని, తమకు అత్యంత ప్రియమైన వారి బాగోగులు నిరంతరం చూస్తుంటామని చెప్పటానికి ఉత్సాహపడుతుంటారు".

"అదెట్లా సాధ్యం"

"దానికి మాధ్యమ సహకారం ఉంటుంది".

"ఆ ఏర్పాటు ఎట్లా".

"మాధ్యమ సహకారం ఏర్పడే విధంగా అదే విధమైన కోర్కెలు ఉన్నవారు, కేంద్రీకృత అభివృద్ధి శాఖలు ఏర్పరుచు కుంటారు. ఒక గదిని స్థిరంగా ఏర్పాటుచేసుకొని, తరచుగా నిర్ణీత గదిలోనే కలుసుకోవటం, కనీసం వారానికి ఒకసారైనా విధిగా కలుసుకోవటం, నిర్దేశించుకున్న సమయంలోనే కలవటం ఈ అభివృద్ధి శాఖల సత్సంగానికి వచ్చే విధంగా ముందే ఏర్పాటుచేసుకోవాలి. ఎందుకంటే డ్యూటీ మైండ్ కచ్చితంగా ఉంటుంది వాటికి.

వీరి రాకతో గది అంతా విద్యుదయస్కాంత ప్రభావమై ఉంటుంది.

ముఖ్యంగా గమనించవలసింది రూము అంతా చీకటిగా ఉండాలి. అదీ ఫోటోగ్రాఫర్ నెగెటివ్ డెవలప్ చేసే గదిలా చీకటిగా ఉండాలి.

కూర్చున్నవారు ప్రశాంత మనస్కులై ఆలోచనా రహితంగా, ఆసక్తితో ఉండాలి. ఎటువంటి ప్రశ్నలూ వేయకుండా ఉండాలి. ఈ నిబంధనలు అందరూ పాటించి తీరాలి" వివరించాడు సుమ.

"అయితే ముందుగా వివరాలు చెప్పకుండా గదిలో చీకటిగా ఉంటుంది కాబట్టి నిశ్శబ్దంగా, ప్రశాంతంగా కూర్చుందాం" అన్నాడు రవి.

"మీరు ఆ గది ఏర్పాట్లు చూసుకోండి. చాలా ఆసక్తిగా ఉంది. అమ్మకు నేను చెప్తాలే!" అన్నాడు రామచంద్రుడు.

"అమ్మతోపాటు మనం కూడా కూర్చుందాం" అన్నాడు రవి.

"నిరభ్యంతరంగా" అన్నాడు సుమ.

"ఇది నీకెట్లా సాధ్యమయింది. లక్ష్మీనరసింహం గారు దీన్ని అభ్యసించేవారా? ఆయన ద్వారా నీకు సంక్రమించిందా ఈ విద్య" ప్రశ్నలు కురిపించాడు రామచంద్రుడు.

"అది నా జీవిత చరిత్ర గ్రంథమవుతుంది".

"అభ్యంతరం లేకపోతే చెప్పు. లేకపోతే గ్రంథంగా రాయి. అందరికీ ఉపయోగిస్తుంది".

"అంత సీన్ లేదులే గాని క్లుప్తంగా చెప్తా".

"సినిమాఫీల్డ్‌లో చేరదామని ఇంట్లో చెప్పకుండా చెన్నై వెళ్లాను. తెలిసిన ప్రొడ్యూసర్ షెల్టర్ ఇచ్చాడు. షూటింగ్ కోసం బెంగుళూరు వెళ్ళాం. పని పూర్తి చేసుకున్నాక, చెన్నైకి తిరుగుప్రయాణం అయ్యాం. ఆయన, నేను ఏసి కంపార్టుమెంటులో ఉన్నాం. మా ప్రొడ్యూసర్ డోర్ దగ్గర నిల్చొని సిగరెట్ కాలుస్తున్నాడు. ఎవరో అగంతకుడు సడన్‌గా వచ్చి సిగరెట్ ఇవ్వమన్నాడు. మా ప్రొడ్యూసర్ చీదరించుకున్నాడు. మరలా అడిగాడు. మరలా అసహ్యించుకున్నాడు అతన్ని. అతను ఉగ్రంగా సిగరెట్ ప్యాకెట్ వైపు చాలా ఫోర్స్‌గా చూశాడు. చాలా వేగంగా చేతివేలును ఊపాడు. ప్యాకెట్ తెరుచుకుంది. అంతే వేగంగా సిగరెట్ నోటి దగ్గరకు వచ్చేసింది.

ఆ సంఘటన సినిమా గ్రాఫిక్‌లా జరిగింది.

షాక్ అయిన ప్రొడ్యూసర్ తన సీట్లో కూలబడ్డాడు. నేను లేచి నుంచొని ఆయనను గమనిస్తూ 'సారీ' చెప్పాను.

ఆయన ఎవరో, ఎక్కడికి వెళ్తున్నాడో, ఏంటో తెలీదు. మా పక్కనే కూర్చోబెట్టుకున్నాం. ప్రొడ్యూసరు నాకు సైగ చేసి పక్కకు రమ్మన్నాడు. వెళ్ళాను. ఎట్లాగైనా ఆయనను చెన్నై తీసుకు వెళ్దామన్నాడు.

"ఆయన ఎవరో ఏంటో తెలీనిదే" సందేహించాను.

"అవేవి నాకు తెలీదు, తీసుకురా! మాట్లాడు!" అన్నాడు.

"ఎందుకీ తంటాలు అడగంగానే సిగరెట్ ఇస్తే సరిపోయేది కదా!" బయటికి అనేశాను.

ప్రొడ్యూసర్ గుర్రుగా చూశాడు నా వంక.

ఆ పెద్దాయనతో మాటమంతీ కలిపాను. తన పేరు వెంకట్రామన్ అన్నాడు. కిందకు దిగి కాఫీ తాగి వచ్చాం.

తమిళం కలిసిన తెలుగులో మాట్లాడుతున్నాడు. చెన్నైకి రమ్మన్నాను.

"సరే పదప్పా" అన్నాడు.

చెన్నైలో ఒక రోజు ఉండి, విజయవాడకు అవసరంగా కారులో బయల్దేరాం ముగ్గురం. డిస్ట్రిబ్యూషన్ ఆఫీసులో ఏదో సమస్య ఏర్పడింది. వెంటనే వెళ్ళాల్సి వచ్చింది.

•••

మాధ్యమంలో ఉన్న వ్యక్తి దాదాపు మోహనిద్రలో ఉండిపోతాడు. తన భౌతిక శరీరంపై పట్టు కోల్పోయి ఆవహించిన ఆత్మ మాట్లాడటం, చేతులు ఊపడం తనకు అవసరమైన విధంగా అన్ని అవయవాలపై కంట్రోలు ఉండటం జరుగు

## పేరు మార్చుకున్నా ఫలితం లేదంటోంది



*లక్ష్మీరాయ్‌కి లక్కు ఎప్పుడూ ఆమడ దూరంలోనే ఉంటోంది. హీరోయిన్‌గా చేసినా, ఐటెం సాంగ్ చేసినా ఏదీ కలిసి రావడంలేదని తెగ బాధ పడిపోతోంది. మొన్నటికి మొన్న 'సర్దార్ గబ్బర్ సింగ్'మీద రాయ్ లక్ష్మీ (పేరును తిప్పి పెట్టుకుంది) బోలెడన్ని ఆశలు పెట్టుకుంది. అవన్నీ ఆవిరి అయిపోయాయి. దాంతో బాలీవుడ్‌లో చేసిన 'జూలీ 2' మీదే ప్రాణం నిలుపుకుంది. ఈ సినిమాతో అక్కడ ఒక్కసారిగా పేరు తెచ్చుకోవాలని డిసైడ్ అయిపోయి తెగ ప్రమోషన్ వర్క్ చేస్తోందట! ఇప్పుడైనా రాయ్ లక్ష్మీ ఆశ నెరవేరుతుందో లేదో అని ఆతృతగా ఎదురుచూస్తున్నారు ఆమె అభిమానులు, సన్నిహితులు.*

తుంది. ఆత్మలకనుగుణంగా నడవడం, మాట్లా డటం, తినటం, చాలా పర్‌ఫెక్ట్‌గా జరుగుతుంది.

వ్యక్తి మామూలుగా అయిన తరువాత ఇవేమీ గుర్తుండవు. మనిషి శరీరం నుండి మనసు వేరు చేస్తే ఏ విధంగా ఉంటుందో ఆ విధంగా ఆ సమ యంలో మాధ్యమ వ్యక్తి పరిస్థితి ఉంటుంది.

"చాలా ఆశ్చర్యంగా ఉంది. ఇదేదో హిప్నాటిక్ ఎక్స్‌పీరియన్స్" రామచంద్రుడు అన్నాడు.

ఇది సాధించడానికి ఎంతకాలం పడుతుంది అనేది వ్యక్తి మానసిక పరిస్థితిని బట్టి, అంకిత భావాన్ని బట్టి ఉంటుంది. ప్యూరిఫైడ్ మానసిక స్థితి ఉంటే చాలా సత్వరంగా జరుగుతుంది.

"మరి ఇండియాలో ఎందుకని ప్రాచుర్యం లోనికి రాలేదు" రవి ప్రశ్నించాడు.

"సియాన్స్ మన సంప్రదాయానికి విరుద్ధమని ఋషులు, వేదాంతులు ఎంకరేజ్ చేయలేదు. అందు కనే దీనిని సక్రమ మార్గంలో ఉపయోగిస్తే, ఇప్పటి సమాజంలో ఉండే సైక్రియాటిక్ సమస్య లకు ఒక మంచి పరిష్కారం. కానీ యోగులు రాజ యోగ మార్గాన్ని ఎంచుకున్నారు".

"కరెక్ట్, మంచి ఆలోచన. ఆ యాంగిల్‌లో లపై నియంత్రణ సిద్ధిస్తుంది. అందువలన యోగులు ఈ ప్రక్రియకు తమ శిష్యులను ప్రోత్స హించారు. పవిత్రాత్మ స్వరూపులు కూడా యోగికి ఆశ్రితమై ఉంటాయి.

సుబ్రమణ్యం చెప్పడం ప్రారంభించాడు.

"విజయవాడ గాంధీనగరంలో డిస్ట్రిబ్యూషన్ ఆఫీసు గెస్ట్ రూమ్‌లో వెంకట్రామన్ ఉండే ఏర్పాటు చేశారు. రాత్రి అయింది. తను డ్రింక్ తీసుకుంటాను అంటే ఆయనకు కావల్సిన బ్రాండ్ తీసుకు వచ్చారు.

ఆయన సేవనం ప్రారంభించారు. ఏవో జోకులు మధ్య మధ్యలో పేలుస్తున్నాడు. ఇంకా బాగా పరి చయం ఏర్పడలేదు. ఆయన డ్రింక్ తీసుకుంటూ మధ్యలో ఉన్నట్టుండి సీరియస్ అయి, ముఖకవ ళికలు గంభీరంగా మారిపోయాయి.

లేచి నిల్చొని "లేవండి" ఒక్కసారిగా గర్జిం చాడు. "కారు పిలవండి" అన్నాడు.

మారు మాట్లాడకుండా కారు రెడీ చేశారు. ఎక్కి కూర్చొని మమ్మల్ని రమ్మన్నాడు. మేము ఫాలో అయ్యాం.

రామవరప్పాడు పొమ్మన్నాడు డ్రైవరుతో. అక్కడికి వెళ్లగానే ఒక ఇంటి ముందు కారు ఆపమన్నాడు.




దీనిని తప్పక ఆలోచించాల్సిన అవసరం ఉంది. కానీ వ్యాపార ధోరణి పనికి రాదు" అన్నాడు రామ చంద్రుడు.

"అన్నిరంగాల్లో ఈ వ్యాపార ధోరణి చొర బడ్డది గదా? విద్యా, వైద్యం, ఆరోగ్యం, ఆఖరికి కుండ లినీ శక్తిని కూడా వ్యాపారం చేస్తున్నారు కదా?" అన్నాడు సుబ్రమణ్యం.

"అవన్నీ సరే, ఇప్పుడు తక్షణ కర్తవ్యం".

"ఆత్మను సిద్ధం చేయడం"

చిరునవ్వు నవ్వాడు రామచంద్రుడు. తన రూమ్‌లోనే ఆ ఏర్పాటుచేసుకుందాం అని సూచించాడు.

సుమ, వసుంధరను అక్కడికే రమ్మన్నారు.

విషయం విన్నాక దాక్షాయిణి కూడా తోడుగా వస్తానని, వసుంధరకు ధైర్యంగా ఉంటుందని సూచించింది.

అందరూ సిద్ధమయ్యారు.

•••

యోగి తన అతీంద్రియ శక్తి సాధన ద్వారా మాధ్యమ స్థాయిని పొంది జ్ఞానసంపన్న దైవాత్మ స్వరూపాలను నిర్దేశించే స్థితిలో ఉంటాడు. ఈ ఆత్మ

అందరం దిగాం. వేగంగా వెళ్ళి ఇంటి తలుపు చాలా గట్టిగా బాదాడు. తెరుచుకోలేదు, తీవ్రమైన ఫోర్సుతో తన్నాడు. ఆ తీవ్రతకు తలుపు తెరుచుకుంది. అందరం సంభ్రమాశ్చర్యంలో, అర్థం కాని అయో మయంలో ఏం జరుగబోతోందనే ఆతృతతో ఉన్నాం.

చాలా స్పీడుగా ఇంట్లోకి దూసుకువెళ్లాడు. మేము ఆయన వెంటే అదే స్పీడుతో వెళ్లాం.

ఆశ్చర్యం! తన మెడకు ఉరి తగిలించుకొని వేలాడడానికి సిద్ధంగా ఉన్నాడు డిస్ట్రిబ్యూషన్ ఆఫీసు ఇంచార్జ్ రమణయ్య.

ఒడిసి పట్టుకొని ఆయన్ను అమాంతం ఎత్తారు. వెంట్రుక వాసిలో తప్పిపోయింది అతడి ఆత్మహత్య సంకల్పం - జస్ట్ మిస్. అసలు ఎంత ఫ్లాష్‌గా జరిగిందో మాటలలో వర్ణించలేను" అంటూ ముగించారు.

మంచినీళ్లు అందుకొని గడగడా తాగేశాడు సుబ్రమణ్యం.

"మాకు కూడా మా రమణయ్య ఇల్లు తెలీదు. ఆయన ఎక్కడ ఉంటాడో తెలీదు. అటువంటిది ఆయ నకు ఎట్లా తెలిసిందో".

అందరం బిత్తరపోయాం. రమణయ్య భార్యా, పిల్లలూ ఒకటే ఏడుపు. డిస్ట్రిబ్యూషన్ ఆఫీసు లావా దేవీలలో అవక తవకలు ఈ ప్రయత్నానికి కారణం. ఆ సంగతి వెంకట్రామన్ చెప్పాడు.

ఈ పరిణామంతో రమణయ్య షాక్‌లోనే ఉండిపోయాడు. ఆయనకు సపర్యలు చేసి తెలివి లోకి వచ్చాక బిగ్గరగా ఏడ్చాడు. ఇంటిల్లిపాదీ ఏడుపు అందుకున్నారు.

"ఆపండి ఏడుపులు" బిగ్గరగా అరిచాడు వెంకటరామన్.

ఆ కేకకు అందరూ ఏడుపు ఆపి బిత్తర బిత్త రగా చూశారు.

ప్రొడ్యూసర్ వచ్చి రమణయ్య భుజం తట్టి, "రేపు మాట్లాడుకుందాం. ఏం భయం వద్దు, అన్నీ మరచిపో" అని ధైర్యం చెప్పాడు.

మేము బయటికి వచ్చేశాం. రూముకు వచ్చాక ఉండ బట్టలేక జరిగిన విషయం గురించి "ఇదంతా ఎట్లా చేయగలిగారు, ఎలా రమణ య్యను బతికించారు. మీకు అసలు అతని గురించి గాని, ఇల్లు ఎక్కడనిగాని తెలీదు కదా!" అని ప్రశ్నిస్తే.

"రేపు మాట్లాడుకుందాం" అని మిగిలిన ద్రవాన్ని పూర్తిచేశాడు. మాకు నిజంగా నిద్ర పట్టలేదు.

"మీకు ఈ విషయాలపై ఆసక్తి ఉంటే మీరు మా గురువు దగ్గరకు వెళ్ళాల్సిందే".

"ఆయన ఎక్కడ!"

"తుత్తుకుడి దగ్గర చిన్న గ్రామం. తమిళ నాడు, కేరళ బోర్డర్‌లో ఉంటుంది".

•••

ఒకప్రాణి జీవంతో తల్లి గర్భంలో ఉండి ఈ ప్రపంచంలోకి రావటం ఎంత అద్భుతమో కదా! అటువంటి తల్లి గర్భం ధరించడానికి అనువైన ఆరోగ్య పరిస్థితులను గమనించటం, అందుకు అనువుగా స్త్రీ గర్భాశయ ఆరోగ్య పరిస్థితులను పరిరక్షించే శాస్త్రం గైనకాలజీ! ప్రసూతి వైద్యంలో అత్యంత మాన వీయ విలువలు ఉన్న వైద్యురాలు డాక్టర్ శ్రీమతి. అసాధారణ వ్యక్తిత్వం, వాళ్ల తల్లిదండ్రులు పెట్టిన పేరు విశేషమేమో గాని ఆమె వివాహం కాని శ్రీమతి. ఆమె వైద్య జీవితం నిండా మనసును కలిచి వేసే ఎన్నో సంఘటనలు! ఎన్ని మనసులు ఆమెను హత్తుకుని ఆనందించాయో! డా. శ్రీమతి ప్రశాంత వదనంతో ఉంటారు. ఆందోళనా రహితంగా దైనందిన జీవితం ఉంటుంది.

రామచంద్రుడు దంపతుల విషయంలో ప్రత్యేక శ్రద్ధ చూపిస్తోంది. అది రామచంద్రుడి వ్యక్తిత్వం కావచ్చు. దాక్షాయిణి స్నేహప్రభావం కావచ్చు. మొత్తా నికి 'ఫాలిక్యులార్ స్టడీ' తదితర అంశాలను గమ నించి అండం పరిస్థితి గమనించి ఆరోగ్యకరమైన అండాన్ని సిద్ధం చేసుకుంది. దానిని కలెక్ట్ చేసి, సెమన్ (బీజం) అనుసంధానంతో ఎంబ్రియో తయారు చేసి, దానిని ప్రాసెస్ చేసి ఇన్‌విట్రియో ద్వారా గర్భా శయంలోకి ప్రవేశ పెట్టాలి. అదీ ఐవీఎఫ్ విధానం.

**(ఇంకా వుంది)**

## పుస్తక సమీక్ష



**వైదేహి**
నందమూరి లక్ష్మీపార్వతి
**ధర:** 50 రూపాయలు
**పేజీలు:** 160
**ప్రతులకు:** సాహితి ప్రచురణలు, కాళేశ్వరరావు రోడ్, సూర్యారావుపేట, విజయవాడ-2
ఫోన్ 0866-2436643

విద్యావేత్త, రచయిత్రి నందమూరి లక్ష్మీ పార్వతి. అన్యాయాన్ని ఎదిరించి, పురుష వ్యవస్థను ప్రశ్నించి పురుషాహంకారాన్ని గెలిచిన ద్రౌపది లోని తిరుగుబాటు ధోరణి గల వైదేహి కథే ఈ నవల. స్త్రీ వేదన, క్షోభ, స్త్రీ అంతరంగాన్ని ఆవిష్కరించిన నవల.

---

**సిగ్మండ్ ఫ్రాయిడ్ జీవితం - కృషి**
డాక్టర్ పరుచూరి రాజారామ్
**ధర:** 120 రూపాయలు
**పేజీలు:** 168
**ప్రతులకు:** విశాలాంధ్ర, నవచేతన బుక్‌హౌస్ బ్రాంచీలు
**ప్రచురణ:** అమరావతి పబ్లికేషన్స్, గుంటూరు-7



వైద్య శాస్త్రానికీ, ప్రత్యేకించి మానసిక విశ్లేషణా పద్ధతికి ఆద్యుడు సిగ్మండ్ ఫ్రాయిడ్. మనోవిశ్లేషణలో నూతన శకాన్ని ప్రారంభించిన వైద్యులకే వైద్యుడు ఫ్రాయిడ్. ఆయన జీవితం కృషి గురించి ప్రఖ్యాత రచయిత డాక్టర్ పరుచూరి రాజారామ్ రాసిన మహోన్నత గ్రంథం ఈ పుస్తకం.

---



**తల్లీ! నిన్ను దలంచి**
డా. పాపినేని శివశంకర్
**ధర:** 375 రూపాయలు
**పేజీలు:** 408
**ప్రతులకు:** విశాలాంధ్ర, నవచేతన బుక్‌హౌస్ బ్రాంచీలు
**ప్రచురణ:** అమరావతి పబ్లికేషన్స్, గుంటూరు-7

తెలుగు పద్యానిది రెండువేల ఏళ్ళనాటి చరిత్ర. తెలుగువారి సొత్తు. జీవన కళను, జీవిత సంస్కారాన్ని నేర్పే అమూల్యమైన 250 పద్యాలు, 50 శ్లోకాలు, మరో 25 గేయ, కవితలను అర్థతాత్పర్యాలతో డా.పాపినేని అందించిన అమూల్య పుస్తకమిది.



పుస్తకావిష్కరణ దృశ్యం: ఎడమనుండి సలీం, రాజారామమోహనరావు, జగన్నాథశర్మ, విహారి, రఘుశ్రీ

# సలీం నవలా పరామర్శ
# 'దీపిక' పుస్తకావిష్కరణ

**మూస ధోరణికి భిన్నంగా తనదైన ముద్రతో సాహితీ సృజన చేసే రచయిత సలీం. సమకాలీన సమాజాన్ని పట్టిపీడిస్తున్న సమస్యల్ని తీసుకుని మానవ సంబంధాల్లోని వైరుధ్యాలు, సంఘర్షణలను తన రచనల్లో రూపుగడతారాయన.**

**భిన్నమైన కథా వస్తువులతో సలీం రాసిన ఏడు నవలల్లోని పాత్రల విశిష్టత, సమకాలీనతపై విహారి రచించిన విశ్లేషణాత్మకమైన పరామర్శ 'దీపిక'. ఈ పుస్తకాన్ని ప్రముఖ కథా రచయిత, నవ్య వారపత్రిక సంపాదకులు ఎ.ఎన్.జగన్నాథశర్మ ఆవిష్కరించారు.**

హైదరాబాద్ నారాయణగూడ తాజ్‌మహల్ హోటల్ సమావేశమందిరంలో ఏప్రిల్ 14వ తేదీ (గురువారం) జరిగిన ఈ పుస్తకావిష్కరణ సభకు జగన్నాథశర్మ అధ్యక్షత వహించి, తన సహజసిద్ధమైన చమక్కులతో సభికులను అలరించారు.

తీరికలేని వృత్తిలో ఉన్నప్పటికీ పాతికేళ్ళుగా సాహితీ రంగంలో ఆటుపోట్లు తట్టుకుంటూ సలీం పుంఖాను పుంఖాలుగా రచనలు చేయడం, కేంద్ర సాహిత్య అకాడమీ వంటి ఉన్నత పురస్కారాలు అందుకోవడం అభినందనీయమన్నారు జగన్నాథశర్మ. ఈ పుస్తకం లోని ఏడు నవలల్లో నాలుగు నవలల్ని నవ్య వీక్లీ ప్రచురించడం సంతోషం కలిగిస్తోందన్నారు.

కొత్తగా నవలలు రాసేవారికీ, కొత్తగా సాహిత్య విమర్శ చేసేవారికీ 'దీపిక' నవలా పరామర్శ ఒక కరదీపిక అన్నారు ప్రముఖ రచయిత, సభకు విశిష్ట అతిథి వి.రాజారామమోహనరావు. నైతిక విలువలు మరిచిన వైద్యులు (జీవన్మృతులు), ముస్లింల జీవిత విధానం (వెండిమేఘం), అడవి బిడ్డల ఆక్రందన (గుర్రపుడెక్క) వంటి సమకాలీన అంశాలపై పరిశోధనతో విలువైన సమాచారం సేకరించి సలీం రచనలు చేయడం ఆశ్చర్యం కలిగిస్తుందన్నారు. పాతికేళ్ళుగా పేదలకు ఉచితవైద్యసేవలు చేస్తున్న విహారి, రచయితగా, మనిషిగా ఎదిగి సేవలు అందిస్తున్న సలీం ఇద్దరి కలయికలో ఈ పుస్తకానికి శాస్త్రీయ ప్రామాణికత వచ్చిందన్నారు.

సలీం రాసిన ఏడు నవలలపై విహారి రాసిన నవలా విమర్శను సిద్ధాంత గ్రంథంగా అభివర్ణించారు. మరో విశిష్ట అతిథిగా హాజరైన ప్రముఖ రచయిత్రి, అనువాదకురాలు కె.బి.లక్ష్మి. ఈ ఒక్క పుస్తకం చదివితే ఏడు నవలల్ని చదివిన అనుభూతి కలుగుతుందన్నారు. సామాజిక ప్రయోజనాన్ని కాంక్షించే సలీం నవలల్లోని పాత్రలు కథకు ఎలా దోహదం చేస్తాయో బేరీజు వేశారన్నారు. సలీం రచనా దృక్పథం, దార్శనికత, వ్యక్తిత్వం, సామాజిక వ్యవస్థల స్వరూప స్వభావాలు, నవలా నిర్మాణంలో పాత్రల సంఘర్షణలను పరామర్శించడం ద్వారా విహారి ఏడు పిహెచ్‌డిలు చదివిన ఫీలింగ్ కలిగించారని కె.బి. లక్ష్మి చెప్పారు.

ఈనాటి సమాజంలో మనుషుల్ని పట్టిపీడిస్తున్న సమస్యల్ని సలీం మూసకు భిన్నంగా రాశారని పుస్తక రచయిత విహారి చెప్పారు. సలీం ఏడు నవలల్లో కొత్తదనాన్ని అందరికీ తెలియజేసేందుకే ఈ పుస్తకం రాశానన్నారు. కొత్త వస్తువులతో కూడిన కథాంశాలు, కులమతాలకు అతీతమైన మానవప్రేమ కురిపించే ఈ రచనలు రీడబిలిటీ నిచ్చి సలీంను విశిష్టవ్యక్తిగా నిలబెట్టాయన్నారు. సలీం ఉత్కంఠభరిత శైలీ విన్యాసమే ఆయనకు ఎన్నో పురస్కారాలు తెచ్చిపెట్టాయన్నారు. ఈ పుస్తకంలో సలీం సమగ్ర సాహిత్యమూర్తిగా కనిపిస్తారని విహారి అన్నారు.

ఇప్పటివరకు తాను రాసిన 11 నవలల్లో తీసుకున్న వస్తువుకు న్యాయం చేయగలిగాననే సంతృప్తి తనకు మిగిలిందని సలీం తన అంతరంగాన్ని ఆవిష్కరించారు. శ్రీమానసా ఆర్ట్ థియేటర్స్ సంస్థ కార్యదర్శి రఘుశ్రీ తొలుత స్వాగతం పలికి చివరిలో వందన సమర్పణ చేశారు.

**-లలితా త్రిపురసుందరి**




# కడుపుతీపి

**గదిలో నుంచి శబ్దాలు వినిపిస్తున్నాయి. అందరూ ఉలిక్కిపడి లేచారు. వెళ్లాలో, వద్దో తెలియడం లేదు.**

**ఇంతలో కోడలి అరుపు హృదయ విదారకంగా వినిపించింది.**

**అందరూ కంగారుగా ఆ గదివైపు పరుగెత్తారు.**

ఇంతలో గది తలుపు తెరుచుకుంది.

'దొంగ... దొంగ...' అరుస్తూ ఆమె బయటకు వచ్చింది.

ఆమెను చూసి వారంతా హడలిపోయారు.

ఆమె శరీరంపై గాయాలు కనిపిస్తున్నాయి. చేతులనిండా రక్తం. ఒక చేతిలో కత్తి.

ఆమె వణికిపోతోంది.

'దొంగ... దొంగ... ఆయనను..' ఆమె మాట్లాడలేక పోతోంది. వణికిపోతోంది. ఆడవాళ్ల ఆమెని ఓదారుస్తూంటే, కోడలి చేతిలోంచి కత్తి తీసుకున్నాడు మామ గారు. అతడు లోపలకు పరుగెత్తి కనబడ్డ దృశ్యం చూసి స్థాణువై నిలబడి పోయాడు.

గది మధ్యలో అతడి కొడుకు శవం. ఒళ్లంతా గాయాలున్నాయి. రక్తం మడుగులో ఉంది శవం.

పెరటి వైపు గది తలుపు తెరచి ఉంది.

•••

'చాలా అరుదైన సంఘటనలాగా కనిపిస్తోంది ఇది' అన్నాడు ఇన్‌స్పెక్టర్ విజయ్, డిటెక్టివ్ శరత్‌తో.

డిటెక్టివ్ శరత్ ఔననలేదు. కాదనలేదు. గది పరిశీలనలో ఉన్నాడతడు. అసిస్టెంట్ రాము ఇంట్లోని వారిని ప్రశ్నిస్తూ సమాచారం సేకరిస్తున్నాడు.

'కత్తిపోట్లవల్ల కలిగిన గాయాల కారణంగానే ప్రాణంపోయి ఉంటుంది' శవాన్ని పరిశీలించటం ఆరంభిస్తూ అన్నాడు శరత్.

'హత్య జరిగిన ఆయుధాన్ని ల్యాబ్‌కు పంపాను. కానీ లాభం లేదు. దానిపై కనీసం అయిదారు వేలిముద్రలుండే వీలుంది' అన్నాడు విజయ్.

తల ఊపాడు శరత్. 'హంతకుడివి కూడా ఉంటాయి' అన్నాడు. అప్పటికే అతడు ఆ గదిలో వీలైనన్ని వేలిముద్రలు సేకరించాడు.

'దొంగ వెనుకవైపు గోడదూకి వచ్చి ఉంటాడు. అంతా నిద్రలో ఉంటారనుకుని ఉంటాడు. కానీ ఆమె భర్త అదే సమయానికి టాయ్‌లెట్ కోసం లేచి పెరటి తలుపు తీశాడు. దాంతో దొంగ బెదిరి అతనిపై దాడి చేసి ఉంటాడు. అడ్డువెళ్లిన ఆమెని కూడా గాయపరచి ఉంటాడు. ఈ గలాటా, శబ్దాలకు పారిపోయాడు' జరిగింది ఊహించాడు విజయ్.

శరత్ మాట్లాడలేదు.

ఆ గది నుంచి పెరట్లోకి వెళ్లే తలుపులపై ఉన్న వేలిముద్రలు సేకరించాడు. అటునుంచి పెరట్లోకి వెళ్లాడు. పెరట్లో మట్టి పరిశీలించాడు. కాంపౌండ్ వాల్ అణువణువు జాగ్రత్తగా చూశాడు. గోడకు ఆవలవైపు రోడ్డు ఉంది. గోడ కూడా మరీ ఎత్తు లేదు. ఎవరయినా సులభంగా దూకి లోపలకు రావచ్చు. మొత్తం ఇంటి చుట్టూ తిరిగాడు.

'వస్తువులేమైనా పోయాయా?' అడిగాడు.

'లేదు. దొంగకు ఆ అవకాశం లభించినట్టు లేదు' చెప్పాడు విజయ్.

ముందు గదిలోకి వచ్చాడు శరత్. ఇంట్లో సభ్యులంతా దిగాలుగా, విషాదంగా కూర్చుని ఉన్నారు.

వాళ్లిద్దరూ వాదులాడుకోవటం, నా కొడుకు కోడల్ని కొట్టటం అలవాటే. అందుకని శబ్దాలు వినిపిస్తున్నా భార్యాభర్తల మధ్య మేమెందుకు దూరాలనే ఉద్దేశంతో మెలకువ వచ్చినా కదలలేదు' ఏడుస్తూ చెప్పాడు తండ్రి.

'మా వాడికి ఉద్యోగం పోయినప్పటి నుంచీ తాగుడు అలవాటయింది. అప్పటినుంచీ వాళ్ల మధ్య కీచులాటలు మొదలయ్యాయి. అంతకుముందు బాగానే ఉండేవారు. అమ్మాయి సంపాదన మీదే కుటుంబం నడుస్తోంది. వాడికేమో ఉద్యోగం ఏమీ రావటం లేదు. రోజూ గొడవే' చెప్పింది తల్లి.

ఆలోచిస్తూ విజయ్‌తో కలిసి బయటకు నడిచాడు శరత్.

•••

'శరత్.. మన జాబితాలో ఉన్న ఛోటామోటా దొంగలందరినీ పోలీసులు ప్రశ్నించారు. ఎవరికీ తెలియదంటున్నారు. నా అనుమానం ఎవడో దారిన పోతూ అదృష్టాన్ని పరీక్షించుకోవాలని ప్రయత్నించి ఉంటాడు. దొంగతనాలు అలవాటు ఉన్నవాడూ, నిలబడి పోరాడేవాడూ కాదు. అందుకే గోడ దూకి పారిపోయాడు. లేకపోతే...' అని శరత్‌వైపు అనుమానాన్ని ప్రదర్శిస్తూ చూశాడు విజయ్.

'ఆ కోణంలో కూడా పరిశీలిస్తున్నాను' అంటూ 'రామూ' అని పిలిచాడు శరత్.

'యెస్ బాస్' అంటూ వచ్చాడు రాము. ఈ కేసులో తాను సేకరించిన వివరాలు శరత్‌కు చెప్పడం ప్రారంభించాడు రాము.

బాస్.. హతుడి భార్య హాసిని టీచర్ ఉద్యోగం చేస్తోంది. ఆమెకు చాలామంచి పేరుంది. అయితే, పెళ్లికాకముందు అదే స్కూలులో పనిచేసే మాధవరావు అనే మరో టీచర్‌తో ప్రేమ వ్యవహారం ఉండేది. కానీ పెద్దలు ఒప్పుకోలేదు. మాధవరావు పెళ్లి చేసుకోలేదు. హాసిని భర్త ఆమెను హింసిస్తున్నాడని తెలిసి అతడిని వదిలేసి తనని పెళ్లి చేసుకోమని వెంటపడ్డాడు. పెళ్లయిన స్త్రీ తల్లితో సమానమని తనతో మరో విధంగా మాట్లాడితే సహించనని చెప్పిందట. కాబట్టి, అర్ధరాత్రి పూట దొడ్డితోవన ప్రియుణ్ణి ఇంటికి రప్పించి అతనితో భర్తను హత్య చేయించి హాసిని నాటకం ఆడుతోందనుకోవడానికి అవకాశం లేదు'.

రాము చెప్పింది విని విజయ్ వైపు చూశాడు శరత్. 'అమ్మాయితో మాట్లాడితే కానీ దొంగ రూపురేఖలు, వివరాలు మనకు తెలిసే అవకాశం లేదు. ఇప్పుడు ఆమెకు ఎలా ఉంది?' అడి గాడు శరత్. సమాధానం ఇచ్చేలోగా విజయ్ ఫోను మోగింది. ఫోనులో మాట్లాడి శరత్‌వైపు చూస్తూ చెప్పాడు. 'డాక్టర్ రమ్మంటున్నాడు. హాసినిని ప్రశ్నించ వచ్చుట' లేచాడు శరత్.

•••

ఆమె ఏ ప్రశ్నకూ సమాధానం ఇవ్వలేక పోతోంది. నోరు మెదపబోతే కంటి నుండి నీరు కారుతోంది. ఏడుపు ఉధృతంగా వస్తోంది.

డాక్టర్ నిస్సహాయంగా చూశాడు శరత్‌వైపు. 'సారీ శరత్... ఇంకాస్త టైమ్ అవసరం. ఆమె షాక్ నుంచి తేరుకోలేకపోతోంది. తన కళ్లముందే భర్త హత్యకు గురికావటం... అతడు ఎలాంటి వాడయినా ఆమె భర్త.

ఇంకాసేపు ఆగాలి 'పైగా ఆమె గర్భవతి.' అన్నాడు డాక్టర్.

విజయ్‌వైపు చూశాడు శరత్. విజయ్ తల ఊపాడు.

ఇద్దరూ బయటకు వస్తూంటే అన్నాడు శరత్. 'ఓసారి వేలిముద్రల పరిస్థితి చూద్దాం'.

ఇద్దరూ ఫోరెన్సిక్ ల్యాబ్‌కు వెళ్లారు. వీళ్ల కోసమే

**బెడ్రూమ్‌లో హత్య జరిగింది. దొంగ పెరట్లోంచి గదిలోకి ప్రవేశించాడు. అనుకోని పరిస్థితుల్లో భర్తను పొడిచి చంపి దొంగ పారిపోయాడు. భార్య అతడి కడుపులో గుచ్చుకున్న కత్తిని లాగి ఆ కత్తి తీసుకుని గదిలోంచి బయటకు వచ్చింది. భార్యే హంతకురాలని పోలీసులు అనుమానించారు. ఇంతకూ అసలు దొంగ ఎవరు? ఈ హత్య ఎవరు చేయించారు? డిటెక్టివ్ శరత్‌కు సాక్ష్యాలు దొరికాయా?**

ఎదురు చూస్తున్నాడు ఫోరెన్సిక్ నిపుణుడు ఫణి.

'శరత్... ఇదిగో నువ్విచ్చిన వేలిముద్రలను, నువ్వు సేకరించిన వేలి ముద్రలతో పోల్చాను. ఒక రెండు మూడు తప్ప అన్నీ సరిపోతున్నాయి' అన్నాడు ఫణి.

'ఆ సరిపోని వేలిముద్రలు మన పోలీసు రికార్డుల్లోని నేరస్థులతో పోలిస్తే వాళ్లెవరయినా నేరస్థులయితే తెలిసిపోతుంది' అన్నాడు విజయ్‌తో.

కానీ శరత్ కత్తిపైన హతుడి వేలిముద్రలు, అమ్మాయి వేలి ముద్రలు, హతుడి తండ్రి వేలి ముద్రలు మాత్రమే ఉన్నాయి. హంతకుడి వేలి ముద్రలు లేవు.

శరత్ ఆలోచనగా విజయ్ వైపు చూశాడు. మౌనంగా హత్యకు కారణమైన కత్తిని పరిశీలించ సాగాడు.

'ఇది మామూలు వంటింటి కత్తి' అన్నాడు ఫణి.

శరత్ మాట్లాడ లేదు. కత్తిని యథాస్థానంలో ఉంచి గ్లవ్స్ తీసేశాడు.

'కత్తిపై రక్తం మరకలు ఎవరివో చూశారా?' అడిగాడు.

'హతుడి రక్తం బాగా ఉంది. హతుడిది కానిది అతడి భార్యది' చెప్పాడు ఫణి.

శరత్ మాట్లాడలేదు. ఆలోచిస్తూ మౌనంగా ఉన్నాడు.

ఇంతలో విజయ్ ఫోను మోగింది. 'డాక్టర్ రమ్మంటున్నాడు. హాసిని మాట్లాడగలిగే స్థితిలో ఉందట'.

●●●

హాసిని కంట్లోంచి నీళ్లు కారుతూనే ఉన్నాయి.

'ఆరోజు ఏం జరిగిందో గుర్తు తెచ్చుకుని చెప్పండి' మృదువుగా అడిగాడు శరత్.

'ఆరోజు..' దుఃఖంతో ఆమె గొంతు పూడుకుపోయింది. మళ్లీ ఏడుపు ఉధృతంగా వచ్చింది.

ఆమె ఏడుపు తీవ్రత తగ్గేవరకూ ఓపికగా కూర్చున్నాడు శరత్.

'ఆరోజు రాత్రి ఎప్పటిలాగే మా మధ్య వాగ్వాదం జరిగింది'

'ఏ విషయంపై?'

'ఓ విషయం అంటూ ఉండాల్సిన అవసరం లేదు. పొద్దుటినుంచీ ఇంట్లో ఉంటాడు తోచదు. సాయంత్రం బయటకు వెళ్లి తాగి వస్తాడు, నన్ను చూడగానే తన వైఫల్యాలు గుర్తుకు వస్తాయి. వాటన్నిటికీ నన్ను బాధ్యురాలిని చేస్తాడు' కంట్లో నీళ్లు ఇంకిపోయినట్లున్నాయి. ఎర్రబడుతున్నాయి. నెమ్మదిగా నిప్పు రాజు కుంటున్నట్టు ఉన్నాయి కళ్లు.

'ఆ రోజు ఏం జరిగింది?' స్వరంలో సానుభూతి నింపి అడిగాడు శరత్.

'ఆ రోజు ఆయన ఎందుకనో బాగా డిస్టర్బ్ అయ్యారు. మామూలుకన్నా ఎక్కువ వయలెంట్ అయ్యారు'.

'కొట్టారా?'

తల ఊపింది. 'తరువాత ఏడ్చి నిద్ర పోయారు. అర్ధరాత్రి లేచాడు. బయటకు వెళ్లటానికి తలుపుతీశారు. ఆ చప్పుడుకి మెలకువ వచ్చి మళ్లీ పడుకున్నాను. ఇంతలో ఏదో పడ్డ చప్పుడు వినిపించింది. కళ్లు తెరచిచూస్తే గదిలో ఎవరితోనో పెనుగులాడుతున్నారు. నేను లేచి సహాయం చేయబోయాను. అప్పటికే వాడు ఆయనను కసిగా పొడిచాడు. నన్నూ గాయపరచి పారిపోయాడు. నేను కత్తి పట్టుకుని వెంట పరుగెత్తాను కానీ అప్పటికే వాడు గోడ దూకి పారిపోయాడు. ఇంట్లోకి వచ్చి చూస్తే ఆయన..' ఏడవటం ఆరంభించింది హృదయ విదారకంగా.

ప్రయత్నించాడు. అందుకని మీరు బెదిరించటానికి కత్తి తెచ్చి దగ్గర పెట్టుకున్నారు. అవునా?'

ఆమె ఉలిక్కిపడ్డట్టు శరత్ వైపు చూసింది. కళ్లల్లో బెదురు స్పష్టంగా కనిపిస్తోంది.

'అతడు ఎక్కడ గర్భానికి హాని కలిగిస్తాడో అని అర్ధరాత్రి, అతడు నిద్రిస్తున్న సమయంలో కత్తితో పొడిచారు. పొడిచి చంపారు. ఎంత కసిగా పొడిచారంటే..'.

'కాదు.. కాదు.. కాదు" శరత్ మాటలకు అడ్డొచ్చి పిచ్చిగా అరిచిందామె. డాక్టర్ పరుగున వచ్చాడు. డాక్టర్‌ని మాట్లాడవద్దని సౌంజ్ఞ చేశాడు శరత్.

'అవును. నేనే చంపాను. తెల్లారేలోగా



'దొంగ చేతికి కత్తి ఎలా వచ్చింది? ఆ కత్తి మీ ఇంట్లో కిచెన్ కత్తి కదా?' మృదువుగా అడిగాడు శరత్.

ఆమె మాట్లాడలేదు. తల ఎత్తలేదు.

'మీరు గర్భవతి అని మీ భర్తకు తెలుసా?' అడిగాడు శరత్.

'మా బంధువులెవరికీ తెలియదు'

మెల్లిగా అంది. 'అదే గొడవ. ఉట్టిగా ఇంట్లో కూర్చుని పిచ్చిపిచ్చి ఆలోచనలు చేస్తున్నాడు. నేను స్కూలుకి వెళ్ళటం లేదట. ఎక్కడెక్కడో..' కళ్లల్లో నీళ్లు చిప్పిల్లాయి.

'ఆ కారణంతో మీ గర్భానికి హాని చేయాలని

పుట్టబోయే శిశువును కడుపులోనే చంపేస్తానన్నాడు. అక్కడికీ కాలితో తన్నాలని ప్రయత్నించాడు. కత్తిచూపి బెదిరించాను. అందుకని పడుకున్నట్టు నటించి, నేను నిద్రపోగానే మళ్లీ వచ్చాడు. నా చేతిలోనుంచి కత్తి లాక్కున్నాడు. వాడు నన్ను చంపినా ఫరవాలేదు. కానీ నా శిశువును, ఏమైనా చేస్తే...' ఆమె కళ్లు నిప్పులు కురిపిస్తున్నాయి. అంతలోనే ఆమె ఏడుపు ఆరంభించింది హృదయవిదారకంగా. శరత్ మౌనంగా బయటకు వచ్చాడు.

**-కస్తూరి మురళీకృష్ణ**
**సెల్: 98496 17392**

# పత్రహరితం

## -మణి వడ్లమాని

**హౌస్ బోట్ డెక్ మీదకి వచ్చింది. చలి గాలి రివ్వున కొట్టింది.**

**ఆ రోజు పౌర్ణమి కూడా కావటంతో ఆకాశ మంతా పుచ్చపువ్వులాంటి వెన్నెల, కౌముది కిర ణాలు సరస్సులో పడి తళతళమని మెరుస్తూ ఉంటే ఓహ్ అద్భుతం. ఆ దృశ్యం చూడటానికి రెండు కళ్ళూ చాలవేమో అనిపిస్తోంది.**

**అందుకే దీన్ని భూతల స్వర్గం అంటారు అనుకుంటూ చూస్తున్న స్వప్నిక దగ్గరకు వచ్చాడు శరత్ "ఏం చేస్తున్నావు" అంటూ. మాట్లాడకుండా చూపుడు వేలుతో ఆకాశం వైపు చూపించింది.**

తను కూడా ఆ అద్భుతమైన దృశ్యాన్ని చూసి పరవశించి పోయాడు. ఇద్దరూ అలా మౌనంగా కొంతసేపు ఉండిపోయారు. ఇంతలో ఆ హౌస్ బోటు ఓనర్ వచ్చి సాబ్ లోపలికి వెళ్లండి అని హెచ్చరించాడు. అప్పుడు ఇద్దరూ ఉలిక్కిపడి లోపలికి వచ్చారు.

స్వప్నిక, శరత్ కొత్తగా పెళ్ళైన జంట. వాళ్ళ హనీమూన్ కోసం అందాల కాశ్మీరం వచ్చారు. అక్కడ హనీమూన్ జంటల కోసం ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన హౌస్‌బోటులో ఉన్నారు. రెండు రోజులు ఎలా గడిచాయో తెలియలేదు. బోటు ఓనర్ తీసుకున్న ప్రత్యేక శ్రద్ధ వాళ్ళని ముగ్ధుల్ని చేసింది. పొద్దుటి నుంచి సాయంత్రం వరకు కారులో తిరగడం, రాత్రికి హౌస్‌బోటులో ఉండటం, కాలమే తెలియకుండా ఉంది.

రూములోకి వెళుతూ వెళుతూ సిట్టింగ్ రూమ్‌లో ఉన్న షెల్ఫ్‌లో పుస్త కాలు చూసి ఆగింది. లోపల్నుంచి వాటిని తీసి, తిరగేస్తోంది. శరత్ కూడా పక్కనే నుంచొని చూస్తున్నాడు. రెండు మూడు చూసి లోపల పెట్టేసింది. అంతలో ఆమె దృష్టి ఆకుపచ్చటి డైరీ మీదకు మళ్ళింది. భలే ఉందే ఈ డిజైన్ అను కుంటూ తీసింది. ఆశ్చర్యం ఒకేలా ఉన్న రెండు డైరీలు. రెంటిమీద 'డైరీ ఆఫ్ ఆర్య అండ్ పూజ' అని తెలుగులో రాసి ఉండటాన్ని గమనించి, బోలెడు ఆశ్చర్యపోతూ, పక్కనే ఉన్న శరత్‌తో "శరత్, ఇది చూడు, తెలుగులో రాసి ఉంది, ఇక్కడ... తెలుగు భలేగా ఉంది కదా' అంది పేజీలు తిరగేస్తూ.

"అవును, ఇక్కడ తెలుగు అంటే... యా! ఎవరో మనలాంటి వాళ్ళేకాకుండా, మూవీస్ కూడా బాగా తీస్తున్నారు కదా! బోలెడు మంది వచ్చి ఉంటారు. అయినా మన తెలుగువాళ్ళు లేని చోటు లేదు ప్రపంచంలో" అంటూ కాలర్ ఎగ రేశాడు.

"పెద్ద గొప్పేలే, ఇది చూడు ముందు" అని తెగ ఎగ్జైట్ అవుతోంది స్వప్నిక.

"వద్దు, ఎవరివో డైరీలు మనం చదవ కూడదు" అన్నాడు శరత్. "ఏం పర్వాలేదులే, మనం చదివినట్లు ఎలా తెలుస్తుంది? మళ్ళీ తీసిన చోటే పెట్టేద్దాం. నాకు ఎన్నో సినిమాలు గుర్తుకొస్తున్నాయి. ఏదైనా రహస్యం ఉందేమో ఇందులో, ఈ డైరీలు ఇక్కడికి ఎలా వచ్చాయో? అది చూస్తేనే కదా తెలి సేది" అని ఉద్వేగంగా అంది.

మొత్తానికి ఇద్దరూ కలిసి ఆ డైరీలు తీసుకుని గదిలోకి వెళ్ళారు.

'ఆర్య, పూజ రాసిన డైరీలు ఇవి. భార్యా భర్తలు మనలాగే. ఒక పని చేద్దాం, ఇద్దరం కలిసి ఆ డైరీలు చదువుదాం' అన్నాడు శరత్.

'ఓకే ఓకే' అంటూ ఉత్సా హంగా అంది స్వప్నిక.

మంచం మీద కూర్చొని ఇద్దరూ కుతూ



హలంగా 'ఆర్యా, అని రాసి ఉన్న డైరీని మొదట చదవడం మొదలుపెట్టారు.

అట్ట తీసిన వెంటనే ఇలా ఉంది.

"అన్యోన్యమైన దాంపత్యం, పత్రహరితంలా ఎప్పటికీ పచ్చగా కళకళలాడుతూ ఉండాలి".

"సేం కొటేషన్ పూజ కూడా రాసింది" అంది స్వప్నిక.

"ఊ" అని పేజీలు తిప్పిచూసి "ఇతను అదే ఆర్య ఏదో వెరైటీగా రాశాడు నా మనసులో, నా ఊహలో అంటూ" అని స్వప్నికతో అన్నాడు.

"అవును పూజ కూడా అలానే రాసింది".

"వీళ్ళకి తెలుగంటే అభిమానం ఎక్కువేమో మనలా" అంది స్వప్నిక.

"ఓ పనిచేద్దాం, వాళ్ళు ఎలా రాశారో అదే ఆర్డర్‌లో చదువుకుంటూ వెళదాం" అని స్వప్నిక అంది.

"గుడ్ ఐడియా" అనుకుంటూ ఇద్దరూ డైరీని చదవడంలో మునిగిపోయారు.

ఆర్య

పెళ్ళైన కొత్తల్లో: పెద్దలు కుదిర్చిన పెళ్ళి. ఇద్దరూ అన్యోన్యంగా ప్రేమగా, ఎప్పుడూ అవతలి వాళ్ళ గురించే ఆలోచిస్తూ ఉండేవాళ్ళం. అలాగే ఎవరి ఉద్యోగాలలో వాళ్ళం "ది బెస్ట్" అనిపించుకునే వాళ్ళం. మా సర్కిల్‌లో ఉండే పెళ్ళికాని స్నేహితులు, చుట్టాల వాళ్ళు, "పెళ్ళంటే ఆర్య, పూజలదే, మనకి కూడా అలాంటి జీవితమే కావాలని" అనుకునే వారు. ఇద్దరికీ జీవితం హ్యాపీగా గడిచిపోయేది.

క్రమం క్రమంగా, మా జీవితంలో కొత్తదనం తాలూకు మైమరపు తగ్గింది. లాంగ్‌అవర్స్ ఆఫీసులో కూర్చొని ఇంటికి వచ్చేసరికి, నా కంటే ముందే వచ్చిన పూజ, ఓ పిచ్చి నైటీ వేసుకుని ల్యాప్‌టాప్ ఒళ్లో పెట్టుకొని, చెవులకి హెడ్ ఫోన్స్‌తో ఆఫీస్ కాల్‌లో ఉండేది. పలకరించినా నా వైపు చూడకుండానే చెయ్యిఊపి పనిలో మునిగిపోయేది. రోజూ అదే విధంగా జరగడంతో నాలో ఒక విధమైన నిర్లిప్తత మొదలైంది. అప్పటి నుంచి పూజలో నాకు అన్నీ నెగెటివ్ థింగ్స్ కనిపించసాగాయి. డిన్నర్ ఫినిష్ చేసుకొని, టీవీ పెట్టుకుని అందులో స్పోర్ట్స్ చానల్స్ చూడటం అవే ఇష్టం కాబట్టి, వాటినే చూస్తూ, రిలాక్స్ అయ్యేవాడిని. ఎప్పుడో పని అంతా పూర్తి చేసుకుని పూజ ఏదో ఇంత తినేసి వచ్చి బెడ్ ఎక్కేసేది. ఇద్దరి మధ్య మాటలు తగ్గిపోయాయి. ఏదో ఉక్కిరిబిక్కిరి అవుతున్నట్లు, ప్రశాంతత లేనట్లు జీవితం అస్తవ్యస్తంగా గజిబిజిగా అయినట్లు అనిపిస్తోంది. అందుకే ఎప్పుడూ ఊహలలో ఉంటూ అదే నిజమని భ్రమిస్తున్నాను.

"ఇంటికి వచ్చేసరికి అప్పటికే ఆఫీస్ నుంచి వచ్చేసిన పూజ, మంచి డ్రెస్ వేసుకుని ఫ్రెష్‌గా అప్పుడే అరవిచ్చిన గులాబీలా తయారయ్యి, కాఫీ, టిఫిన్ రెడీ చేసి ఉంచి, నా కోసం ఎదురు చూస్తూ ఉండేది. రాగానే దగ్గర కూర్చొని, చెయ్యి పట్టుకొని "ఏంటి బాగా అలసిపోయావా" అని ప్రేమగా పలకరించింది. నా కోసం ఎంతో శ్రద్ధగా పనులు చేసింది. స్వీట్ నథింగ్స్ చెప్పుకుంటూ, జోక్స్ వేసుకుంటూ పూజ కొసరి కొసరి వడ్డిస్తుంటే డిన్నర్ చేస్తే ఓహ్! భలే ఉంటుంది".

ఇలా ఎన్నిరోజులు? పూజకి ఇగో ఎక్కువ? అస్సలు ఎడ్జెస్ట్ అవదు? నేను మటుకు ఎంత కాలం సహించాలి? ఓహో అదీ సంగతి. ఆయనగారికి ఆవిడ ఇంటి పనులు చేయకపోవటం నచ్చటం లేదు. తనలాగే ఆఫీస్ పని చేసి వస్తోందిగా, అయినా సర్దుకుపోవడం అలవాటు చేసుకోవాలి" అని అన్నాడు శరత్.

తరువాత పేజీలు ఖాళీగా ఉన్నాయి.

డైరీ మూస్తూ అదేంటి "వీళ్ళు ఇలా మారిపోయారు" అని శరత్ స్వప్నికా ఒకేసారి బయటకు అన్నారు.

"అస్సలు మీ మగాళ్లంతా ఇంతే ఆడవాళ్ళ మనసును ఎప్పటికీ అర్థం చేసుకోలేరు".

"అవును, మీ మనసులు ఎంత లోతు ఉంటాయో ఎవరికీ అంతుపట్టదు".

"వాళ్ళ గురించి మనం పోట్లాడుకోవడం ఎందుకు"

"చదువు చదువు. వీళ్ళు ఏమిటో మనసులో ఊహల్లో అనుకుంటూ వాళ్లకేం కావాలో వాళ్ళకే తెలీని గందరగోళంలో ఉన్నారు" అని శరత్ హేళనగా అన్నాడు.

•••

'ఇప్పుడు పూజ రాసింది చదువుతున్నాను' అని అంది స్వప్నిక.

పూజ:

పెళ్ళి గ్రాండ్‌గా అయ్యింది. కొత్తలో అందరూ మేడ్ ఫర్ ఈచ్ అదర్ అంటూ ఉంటే మా ఇద్దరికీ భలే గర్వంగా ఉండేది. ఎంతో ఆనందంగా, సంతోషంగా రోజులు గడిచిపోయేవి. ఇద్దరం సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లు కావడంతో వర్క్‌కి సంబంధించిన అన్ని

విషయాలూ షేర్ చేసుకునే వాళ్లం. ఆర్య పేరెంట్స్ ఆధునిక భావాలున్న వాళ్ళు. అందుకే మమ్మల్ని విడిగా ఉండమని చెప్పడంతో ఇద్దరం ఇండిపెండెంట్‌గా ఉండేవాళ్ళం. బాధ్యతలు లేకపోవడంతో జాలీగా ఆల్ట్రా మోడరన్ లైఫ్ స్టైల్‌తో హ్యాపీ హ్యాపీగా గడిపేస్తున్నాం. నెమ్మదిగా కొత్త మురిపెం తగ్గింది, వాస్తవ జీవితం మొదలయింది. కానీ అనుకున్నంత తీయగా లేదు.

నీరసంగా, అలసిపోయి ఆఫీస్‌నుంచి ఇంటికి వచ్చేసరికి, ఇంట్లో పని చేసుకోవాలి అనేది గుర్తుకు వచ్చేది. అదే పెళ్ళి కాక మునుపు ఆఫీస్ నుంచి వచ్చేసరికి అమ్మ మంచి నీళ్ళగ్లాసు చేతికిచ్చేది. మరి ఇప్పుడూ! వచ్చినట్లు టీ పెట్టి ఉంచాలి. ఆఫీసులో ఎన్నిసార్లు తాగినా గాని, ఇంటికి వచ్చిన వెంటనే ఆర్యకి టీ తాగడం అలవాటు. నాకేమో రాత్రి ఏడు తరువాత టీ తాగడం నచ్చేది కాదు. పోనీ ఆర్య ఇంటి పనులలో ఏమన్నా హెల్ప్ చేస్తాడా అంటే అదీ లేదు. నేను ఆఫీసు నుంచి వచ్చి మళ్ళీ కిచెన్‌లోకి వెళ్లి పని చేయాలి అంటే కష్టంగా ఉండేది. పెళ్ళి అంటే ఎంత సేపూ, షాపింగ్, ఔటింగ్ ఎంజాయ్ చెయ్యడమే తప్ప, పెళ్ళి అంటే బాధ్యత కూడా, అన్న నిజం తెలియలేదు. హుషారుగా ఉంటూ నన్ను ఉక్కిరిబిక్కిరి చేస్తాడు అనుకున్నా. నా అంచనాలు తల్లకిందులయ్యాయి.

అయినా, నేను ఒక్కదాన్నే ఎందుకు కష్టపడాలి? తను కూడా రెస్పాన్సిబిలిటీ ఫీల్ అవ్వాలి. అన్ని విషయాలలో డాషింగ్‌గా, డైనమిక్‌గా ఉండాలి కాని ఇలా బద్ధకంగా మమ్ముగాడిలా ఉంటే ఎలా? తనకంటే వెనకాల వచ్చిన వాళ్ళు అప్పుడే ప్రమోషన్స్ తీసుకుని పెద్ద పోస్ట్‌లకి వెళ్ళారు. ఆర్యకి చెప్పినా అర్థం కావటం లేదు. ఆ టీవీ రిమోట్ తిప్పుకుంటూ, ఒక పిచ్చి బనీను, షార్ట్స్ వేసుకొని కూచునే ఉంటాడు. అది చూస్తే చాలు ఇరిటేషన్ వచ్చేది నాకు. ఎన్నోసార్లు చెప్పి చూశాను.

"అలాగే అలాగే" అని ఊ కొట్టేవాడు కానీ అదే పద్ధతి. ఏ మార్పూలేదు.

చేసేదేమీ లేక నేను కోరుకునే జీవితాన్ని ఊహల్లో బతకడం మొదలు పెట్టాను.

ఇద్దరిలో ఎవరు ముందు వచ్చినా గానీ ఆర్య "ఇంట్లో ఏం వండుతావు. అంత కష్టపడకు! హాయిగా బయటి నుంచి తెచ్చుకుందాం పూజా!" అని అనేవాడు. ప్రతీ వీకెండ్ 'శుక్రవారం రాత్రి కిచెన్‌కి సెలవు" అంటూ బయటికి తీసుకుని వెళ్ళేవాడు. వీకెండ్స్ ఎలాగు ఔటింగ్ ఉండేది. ఆర్య ప్రేమలో ఊపిరి తీసుకోనంతగా మునిగిపోయాను. అస్సలు ఆర్య, పూజ ఒక్కరే అన్నట్లుగా ఉంది జీవితం. ఎంత బావుందో!"

అవును ఇలా ఎన్ని రోజులు? అస్సలు తను చెప్పిందేమీ చెయ్యడు? ఇలా ఉండటం కన్నా ఎవరి బతుకు వాళ్ళు బతకడం మంచిదనిపిస్తోంది.

తరువాత పేజీలు ఖాళీగా ఉన్నాయి.

"ఏమైనా నాకు పూజనే కరెక్ట్ అనిపిస్తోంది" అంది స్వప్నిక.

"ఎంతైనా స్వజాతి పక్షులు కదా, పక్షపాతం ఉంటుందిలే" అన్నాడు శరత్.

●●●

అలా అర్య, పూజల డైరీలు చదవడం పూర్తయిన ఇద్దరికీ మనసులో ఒకటే ఆలోచన మొదలయింది. ఆ తరువాత ఏమైంది వాళ్ళ జీవితాలలో? విడిపోయారా? అయ్యో దీనికే విడాకుల వరకు వెళ్ళిపోతారా? హాయిగా మనసులు విప్పి మాట్లాడుకోవచ్చు కదా' క్లూ ఏమైనా దొరుకుతుందేమో అని పుస్తకం మొత్తం చూశారు. అందులో ఏదో ఖాళీ కవర్, ఆర్య పేరుతో, దానిమీద ఇంటి అడ్రస్ ఉంది.

గభాల్న ఆ కవర్‌ని తీసి తన హ్యాండ్ బ్యాగ్‌లో దాచింది స్వప్నిక.

ఇద్దరూ కూడా బాగా డిస్టర్బ్ అయ్యారు.

వెంటనే తల విదిలించి శరత్ "కమాన్ స్వప్నికా, ఫర్ గెట్ అబౌట్ దిస్" మనం హనీ

**కొత్త దంపతులు. ఇద్దరూ సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లే. వీకెండ్ ఎంజాయ్‌మెంట్, ఆఫీసు డ్యూటీలు, సెల్‌ఫోన్ చాటింగులు... అంతా హాయి హాయిగా ఉంది. కొంతకాలానికి నిజమైన జీవితం కనిపించసాగింది ఇద్దరికీ. అతడొచ్చేసరికి ఆమె హాయ్ అని కూడా అనకుండా ల్యాప్‌టాప్‌లో తలదూరుస్తోంది. ఇద్దరివీ మాటామంతీలేని జీవితాలు. వాళ్ళ ఆలోచనలు ఎందుకలా ఉన్నాయి? కడదాకా వాళ్ళిద్దరూ కలిసి కాపురం చేశారా? లేదా?**

మూన్‌కి వచ్చాం. సరదాగా ఉండాలి. డోంట్ టేక్ ఇట్ టు హార్ట్ అని హుషారుగా పాట పాడుకుంటూ కబుర్లు చెబుతూ చీర్ అప్ చేశాడు.

ఊహలకి, వాస్తవాలకి మధ్య తేడా, మనసుతో పడే సంఘర్షణ కొత్తగా పెళ్ళైన వీళ్ళని బాగా కదిలించింది.

●●●

మరునాడు పొద్దునే లేచి బ్రేక్‌ఫాస్ట్ చేస్తూ ఆ బోటు ఓనర్‌తో ఆ మాట ఈ మాట కలిపి ఈ మధ్య తెలుగు వాళ్ళు ఎవరన్నా ఈ బోటులో ఉన్నారా? అని అడిగితే "చాలా మంది వచ్చారని" చెప్పాడు.

"ఓ పని చేద్దాం, అందులో ఉన్న ఇంటి అడ్రస్‌తో అక్కడికి వెళ్ళి చూద్దాం" అని అనుకున్నారు.

అప్పటికి వాళ్ళు కాస్త కుదుట పడ్డారు.

●●●

ట్రిప్ నుంచి వచ్చిన తరువాత ఒక ఆదివారం సాయంకాలం ఇద్దరూ ఆర్యా వాళ్ళ అడ్రస్ తెలుసుకుని వెళ్లారు. అది ఒక గేటెడ్ కమ్యూనిటీలో ఉండే ఫ్లాట్. సెక్యూరిటీ ఆఫీస్‌లో పేరు, ఫ్లాట్ నంబర్ చెప్పి లోపలికి వెళ్లారు. ఫ్లాట్ ముందు నిలుచొని బెల్ కొట్టారు. "యా కమింగ్" అంటూ పొడుగ్గా ఉన్న అతను తలుపు తీశాడు. వీళ్ళని అతను ఏదో అడగబోయే లోపల, "ఆర్యా, ఒక్క నిమిషం బాబును ఎత్తుకోవా?" అంటూ ఆ పక్కనే సోఫాలో కూర్చొని ఒళ్లో ల్యాప్‌టాప్‌తో తెల్లగా, కొంచెం బొద్దుగా ఉన్న అమ్మాయి అతన్ని పిల్చింది. పక్కనే బౌన్సర్‌లో చిన్న పాపాయి, బాబో, పాపో తెలియదు.

"పూజా, వీళ్ళు" అంటూ వెనక్కితిరిగి ఉన్న అతను గుమ్మం వైపు చూసేసరికి ఆ వచ్చిన వాళ్ళిద్దరూ కనిపించలేదు. "అయ్యో, అదేమిటి, భలే వింతగా ఉంది. బెల్‌కొట్టి పిల్చి మరీ మాయమైపోయారు" అనుకుంటూ ఎందుకైనా మంచిది సెక్యూరిటీ వాళ్ళను అడుగుదామని ఫోన్ చేస్తే, "అవును సార్ వాళ్ళు ఇప్పుడే బయటికి వెళ్ళిపోయారు. నా చేతికి ఒక కవర్ ఇచ్చారు, తీసుకువస్తున్నాను సర్ నేను వెళ్లి చూడనా? అని అడిగాడు". "ఆ వద్దులే, వదిలెయ్యి" అని, అదే విషయం పూజకి చెపితే తను కూడా ఆశ్చర్యపోయింది".

"పోనీలే ఆర్యా! అంత పట్టించుకోకు. అప్పుడప్పుడు ఇలాంటివి జరుగుతాయి. లైట్ తీసుకో" అని అంది.

●●●

"అదేమిటి శరత్, అలా ఏం మాట్లాడకుండా

## అవి చూపించాలంటే ఎక్కువ ఇచ్చుకోవాల్సిందే!



'తమ్ముడు తమ్ముడే...పేకాట పేకాటే!' అన్నది అందరికీ తెలిసిన సామెత! ఈ సామెతని సినిమాలకి అన్వయిస్తోంది అమలాపాల్. పెళ్ళయిన తరువాత అమల ఇక అందాలు ఆరబోయదేమో అని చాలామంది భావించారు. అలాంటి సినిమాలు చేయమని అడగడానికి కూడా సంకోచించారు. అలాంటి వారికి అమల తన మాటలతో పెద్ద షాకే ఇచ్చింది. 'పెళ్ళయితే ఏంటి? గ్లామర్ పాత్రలు చేయకూడదా? నాకు అలాంటి పట్టింపులేవీ లేవు. సినిమాల విషయంలో గతంలో ఎలా ఉన్నానో... ఇప్పుడూ అలాగే ఉన్నాను. ఏ పాత్రకైనా రెడీ! అందాల ఆరబోతకు నేను సిద్ధం. కాకపోతే మామూలుకన్నా కాస్త ఎక్కువ ఇవ్వాలి' అంటూ చెప్పుకొచ్చింది. మొత్తానికి డబ్బే ప్రధానం అన్న విషయం చెప్పకనే చెప్పింది అంటున్నారు తమిళ తంబీలు.

వచ్చేశావు? పిచ్చాళ్ళనుకుంటారు" అని కోపంగా అంది స్వప్నిక. "లేకపోతే ఏం చెయ్యమంటావు. కాశ్మీర్లో మీ డైరీ చదివాం, మీరు కలిసి ఉన్నారో లేక విడిపోయారో చూడ్డానికి వచ్చాం అని చెప్పాలా?"

"అలా అని కాదు" అంటూ నసిగింది.

"చూడు స్వప్నికా, అది వాళ్ళు ఎందుకు రాసుకున్నారో మనకు తెలియదు. బట్, ఒక్క విషయం గమనించావా? అతని చేతిలో టీవీ రిమోట్, అలాగే ఓ నలిగిపోయిన బనీను, షార్ట్స్ వేసుకునే ఉన్నాడు. ఇంక ఆ అమ్మాయి కూడా ఓ మామూలు నైటీ వేసుకుని ల్యాప్‌టాప్ చూసుకుంటోంది. పక్కనే స్ట్రోలర్‌లో బాబు కూడా ఉన్నాడు అంటే దానర్థం చక్కగా వాళ్ళిద్దరూ అన్ని విషయాలలో ఎడ్జెస్ట్ అయిపోయి హ్యాపీగా కాపురం చేసుకుంటున్నారని తెలుస్తోంది కదా! అలాంటప్పుడు అక్కడ మనం మాట్లాడటానికి ఏం లేదు, అందుకనే వెళ్ళిపోదామని అన్నాను".

•••

వాళ్ళు వెళ్ళిపోయాక ఆర్య, సెక్యూరిటీ గార్డ్ ఇచ్చిన కవర్ ఓపెన్ చేసి చూశాడు. అందులో ఆకుపచ్చటి డైరీలతో పాటు ఒక చిన్న స్లిప్ కూడా ఉంది.

అందులో ఇలా రాసి ఉంది. "హాయ్ నా పేరు శరత్. మేము శ్రీనగర్ హౌస్ బోట్‌లో ఉన్నప్పుడు అక్కడ మీ డైరీలు దొరికాయి" అవి పర్సనల్ డైరీ అయినా అవి అక్కడ ఎందుకు ఉన్నాయో అనే ఇన్క్యూజిటివ్ నెస్‌తో చదివాం. బట్ మీ డైరీ చదవడం వల్ల మాకు భార్యాభర్తల మధ్య కమ్యూనికేషన్ అనేది ఎంతముఖ్యమో అర్థమయింది. ఆలోచిస్తే, కొన్ని విషయాలు ఎంతో చిన్నవి, పెద్ద ప్రాముఖ్యం లేనివి అనుకుంటాం. కాని అవే పెను భూతాలుగా మారి జీవితాలనే కబళిస్తాయి. మీ ఇద్దరి మధ్య అదే జరిగి ఉంటుందని అనిపించింది. ఏది ఏమైనా మిమ్మల్ని ఒకసారి కలవగలిగితే బాగుండును అనుకున్నాం. అందుకే మిమ్మల్ని కలిసి ఏదో చెప్పాలన్న ఆలోచనలతో వచ్చాం. కానీ మీరిద్దరూ కలిసే ఉన్నారు. అందుకు సాక్ష్యం మీ ఇద్దరి పాపాయి. అందుకే మేం కూడా హ్యాపీగా వెళ్ళిపోతున్నాం. మళ్ళీ ఎప్పుడో ఎక్కడో! By the way కొటేషన్ బావుంది. దాంపత్యం పత్రహరితం లాంటిది. నిజమే, హ్యాపీగా ఉండటం అనేది మన చేతల్లో, చేతుల్లోనే ఉందని, చెప్పకనే చెప్పింది.

Ps: We are very sorry అని పెద్దగా రాసి ఉంది. అది చదివి వెంటనే పూజకు ఇచ్చాడు. ఇద్దరి చేతులలో చెరో ఆకుపచ్చని డైరీ! ఒక్కసారి వాళ్ళ గతంలో చేసుకున్న ఒప్పందం గుర్తుకు వచ్చింది.

పూజ, ఆర్య పెళ్లి చేసుకున్న కొత్తల్లో, ఒక సరదా ఒప్పందం చేసుకున్నారు. అది ఏమిటంటే ఒక ఏడాది పాటు వాళ్ళలో కలిగే ఎటువంటి భావాలయినా, ఆలోచనలైనా సరే దాచకుండా డైరీలో రాసుకుని అది వాళ్ళ మొదటి పెళ్లి రోజున ఇద్దరూ కలిసి చదువుకోవాలి. అంతవరకు గడువు తీరేవరకు వేరే వాళ్ల డైరీ చూడకూడదు! చదవకూడదు. అది నమ్మకానికి సంబంధించిన విషయం అని కూడా అనుకున్నారు.

అనుకున్నట్లుగా మొదటి పెళ్ళి రోజును శ్రీనగర్ లోని హౌస్‌బోటులో జరుపుకున్నారు. అప్పుడు ఇద్దరూ కలిసి డైరీలు చదువుకున్నారు. ఒకళ్ళ మనసులు ఒకళ్ళకి తెలిశాయి. ఇద్దరికీ నచ్చేవి ఏమిటో, నచ్చనివి ఏవో కూడా తెలుసుకున్నారు. ఒకళ్ళ భావాల్ని ఒకళ్ళు గౌరవించుకుంటూ ప్రేమ, అభిమానం పరస్పరం ఇచ్చి పుచ్చుకుంటూ ఉన్నప్పుడు చిన్నచిన్న విషయాలలో రాజీ పడటం అనేది ఎంత మాత్రం లొంగుబాటు తనం కాదని గ్రహించారు. ఆ డైరీ రాసుకోవటం వల్ల వాళ్ళిద్దరి మధ్య ఉన్న అంతరాలు తొలగిపోయి, సాన్నిహిత్యం పెరిగి జీవితం పత్రహరితం అయింది.

•••

కలిసిన ఆనందంలో ఆ డైరీలు మర్చిపోయారో, లేక కావాలనే వదిలేశారో తెలియదు. అనుకోకుండా మూడేళ్ళ తరువాత శరత్, స్వప్నిక ల ద్వారా మళ్ళీ ఆర్య, పూజల దగ్గరికే చేరాయి.

కొత్తగా వివాహ జీవితంలో అడుగుపెట్టిన స్వప్నిక, శరత్‌లు ఆ డైరీలు చదవడం మాత్రం కాకతాళీయం.

**సెల్: 96520 67891**

## మనమీదేనర్రోయ్!

సరసి







# హాయి హాయి కునుకు... కంటినిండ కునుకు

**కడుపు నిండా తిండీ, కంటి నిండా నిద్ర.! ఇంతకుమించిన సుఖం ఏదైనా ఉంటే మనిషికి వీటి తర్వాతే! తిండి తినకపోతే ఆకలీ, నిద్రపోకపోతే కునుకుపాట్లూ మనల్ని హెచ్చరిస్తాయి. నిద్ర లేకపోతే మనిషికి పిచ్చిపట్టడం ఖాయం. కానీ ఉరుకుల పరుగుల జీవితంలో మనిషి కోల్పోయింది ఈ నిద్రనే! అందుకే కవులు నిద్రకున్న విలువను ఎంతో గొప్పగా చెప్పారు.**

శరీరాన్ని రీచార్జ్ చేసేది నిద్ర. నిద్రకున్న విలువేంటో రక్షణ రంగానికి తెలిసినంతగా మరెవరికీ తెలియదేమో! కంటి నిండా నిద్రలేకపోతే, ఎయిర్ ఫోర్స్‌లో పైలట్‌ని విమానం నడిపేందుకు అనుమతించరు. మైండ్ ఫ్రెష్‌గా ఉండాలన్నా, మెదడు చురుగ్గా, తెలివిగా ఆలోచించాలన్నా కావల్సింది నిద్రే!

చాలాసార్లు మనం ఎంత కష్టపడ్డా లక్ష్యాన్ని చేరుకోలేకపోతాం. నిద్రను త్యాగం చేసినా ఫలితం దక్కదు. అందుకే చల్లగాలిలో చక్కటి కునుకుపడితే, మనసు కుదుటపడుతుంది. అప్పుడే బుర్ర చురుకుదనం అందుకుంటుంది. నిద్రలేమి వల్ల చురుకుదనం లోపిస్తుంది. అందుకే కంటి నిండా నిద్రపోవాలి. మన పని పద్ధతుల్ని బట్టి నిద్ర షెడ్యూల్‌ను మార్చుకోవచ్చు. ఇలా షెడ్యూల్ మార్చుకోవాలంటే, నిద్రలో ఎన్ని దశలున్నాయో, దీనికి సంబంధించిన మన శరీర ధర్మాలేమిటో మనం తెలుసుకోవాలి మరి! కానీ నికోలా టెస్లా లాంటి అసాధారణ వ్యక్తులు కొన్ని గంటలకు ఒకసారి కునుకు తీసేవారు. మరి అది వారికెలా సాధ్యమైందో ఆ వివరాలేంటో తెలుసుకుందాం!

## నిద్ర దశలు

'రాత్రి హాయిగా నిద్రపోయాను' అనుకుంటారు తెల్లారి లేచాక ఎవరైనా. కానీ 90 నిమిషాలకోసారి మనం నిద్రలేస్తాం! ఈ విషయం మనకు తెలియకపోవడానికి కారణం నిద్ర రెండు దశలుగా కొనసాగడమే. వీటిలో మొదటి దశ ర్యాపిడ్ ఐ మూమెంట్ (REM), రెండో దశ నాన్ ర్యాపిడ్ ఐ మూమెంట్ (NREM). నిద్రించినంతసేపూ ఈ రెండు దశలూ మళ్ళీమళ్ళీ వస్తాయి.

## గాఢ నిద్ర

'రెమ్' నిద్ర దశలో మన కండరాలన్నీ అచేతనమవుతాయి. కలలు వచ్చేది ఈ దశలోనే. మనిషిని రీచార్జ్ చేసేది ఈ 'రెమ్' నిద్ర దశే. NREM అనేది నాలుగు దశలుగా ఉంటుంది. అయితే ఇది వరుసగా ఉండదు.

స్లీపింగ్ పాటర్న్ ్స విషయానికొస్తే ఇందులో ఐదు స్లీప్ సైకిల్స్ ఉంటాయి. అయితే మనలో చాలా మంది  ఫాలో అయ్యేది మోనోఫేజిక్ స్లీప్ సైకిల్‌నే. మిగతా నాలుగు స్లీప్ సైకిల్స్‌ను పాలీఫేజిక్ స్లీప్ సైకిల్స్ అంటారు. మోనోఫేజిక్ స్లీప్ సైకిల్స్‌లో మనం ఒక దశలోనే నిద్రపోతాం. కానీ, పాలీఫేజిక్ స్లీప్ సైకిల్స్‌లో మాత్రం నిద్ర ఈ కిందివిధంగా నాలుగు దశల్లో సాగుతుంది.

**బైఫేజిక్ సైకిల్:** బైఫేజిక్‌లో మళ్ళీ రెండు దశలుంటాయి. ఇందులో రాత్రిపూట నాలుగైదు గంటల పాటు నిద్రించే కోర్ నాప్(కునుకు), మధ్యాహ్నం 90 నిమిషాల నాప్(కునుకు) ఉంటాయి. అంటే మొత్తం ఆరున్నర గంటల నిద్రన్నమాట. ప్రస్తుతం చాలామంది తమకు తెలియకుండానే ఈ నిద్ర పద్ధతినే ఫాలో అవుతున్నారు.

**ఎవ్రీమేన్ సైకిల్:** ఈ దశలో మనం మూడు గంటలు కునుకు తీయడంతోపాటు 20 నిమిషాల చొప్పున మూడు కునుకులు తీయాలి. 20 నిమిషాల పాటు ఉండే ఈ మూడు రకాల కునుకులూ మనల్ని నేరుగా రెమ్ స్లీప్‌లోకి అంటే మొదటిదశ నిద్రలోకి తీసుకెళ్తాయన్నమాట.

**ఉబర్‌మేన్ సైకిల్:** ఉబర్‌మేన్ సైకిల్ మిగతా వాటితో పోలిస్తే అత్యంత క్లిష్టం. ఈ దశలో మనం ప్రతి నాలుగు గంటలకు ఒకసారి 20-30 నిమిషాల చొప్పున ఆరుసార్లు కునుకు తీయాలి. ఈ దశలోకి వెళ్ళడం కష్టమే కాదు అలిసిపోతాం కూడా. స్టీవ్ పావ్‌లినా అనే





ఓ బ్లాగర్ మాత్రం ఈ పద్ధతిలో నిద్రించి సక్సెస్ అయ్యారు.

**డైమాక్సియన్ సైకిల్:** ఈ దశలో మనం నాలుగు కునుకులు తీయాలన్నమాట. ఇందులో మనిషి ప్రతి నాలుగు గంటలకు ఒకసారి 30 నిమిషాల పాటు కునుకు తీయాలి. అంటే మొత్తం నాలుగు కునుకులు తీసి రెండు గంటలపాటు నిద్రపోవాలి. బక్‌మిన్‌స్టర్ పుల్లర్ అనే శోధకుడు ఈ స్లీప్ సైకిల్‌ను కనుగొన్నారు. దాదాపు రెండేళ్ళపాటు ఆయన ఈ నిద్ర పద్ధతినే అనుసరించారు. రెండో ప్రపంచ యుద్ధంలో విజయం సాధించాలంటే, సైనికులు ఈ డైమాక్సియన్ స్లీప్ సైకిల్‌నే ఫాలో కావాలని ఆయన అమెరికాకు సూచించారు.

స్లీపింగ్ షెడ్యూల్‌ను మెరుగు పరుచుకునేందుకు ఫుల్ డైమాక్సియన్‌లోకి వెళ్ళడం చాలా చాలా అరుదు. ఏదేమైనప్పటికీ, నిద్రను నిర్లక్ష్యం చేస్తే భారీ మూల్యం చెల్లించాలి. మన బాధ్యతలు, పని పద్ధతులకు అనుగుణంగా స్లీపింగ్ షెడ్యూల్‌ను మార్చుకుంటే మార్పు దానంతట అదే కనిపిస్తుంది.

### జాతకం చెప్పే నిద్ర భంగిమలు!

స్లీపింగ్ షెడ్యూల్‌తోపాటు ఏ భంగిమలో నిద్రపోతే మంచి కునుకు తీయవచ్చోకూడా నిపుణులు చెబుతున్నారు. అంతేకాదు ఒక మనిషి ఏ భంగిమలో నిద్రపోతాడో గమనించి అతడి వ్యక్తిత్వాన్ని చెప్పవచ్చునంటున్నారు. అంటే మన నిద్ర భంగిమను బట్టే వ్యక్తిత్వాన్ని కూడా అంచనా వేయవచ్చు. కేవలం వ్యక్తిత్వమే కాకుండా ఆ వ్యక్తి ఆరోగ్య పరిస్థితిని కూడా చెప్పవచ్చునట! ఆశ్చర్యంగా లేదూ! మరి ఆ భంగిమలేంటో, వాటి అర్థాలేంటో ఒకసారి చూద్దాం.

### స్టార్‌ఫిష్ భంగిమ

వెల్లకిలా పడుకుని రెండు చేతులను తలకి ఆనించి పడుకునే అలవాటు నూటికి ఐదు శాతం మందికి మాత్రమే ఉంటుంది. ఇలా పడుకునేవారు స్నేహానికి ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తారు. ఎదుటివారు చెప్పేది పూర్తిగా వింటారు. వీరికి సహాయ గుణం ఎక్కువ. నలుగురిలో ప్రత్యేకంగా కనబడాలనే కోరిక ఏమాత్రం ఉండదు. ఈ భంగిమలో నిద్ర వల్ల వీపు భాగంపై ఒత్తిడి పడుతుంది. కాబట్టి తగిన జాగ్రత్తలు తీసుకుంటే చాలు.

### ఫ్రీఫాలర్ భంగిమ

బోర్లాపడుకుని రెండు కాళ్ళూ నిటారుగా జాచి, చేతులు దిండు కిందుగా పెట్టుకుని పడుకునే వారు గుంపులో ఉండడానికి ఇష్టపడతారు. కానీ విమర్శలు ఏ మాత్రం భరించలేరు. ఐతే ఈ భంగిమలో ఎక్కువసేపు పడుకోవడం మంచిది కాదనీ, ఈ అలవాటు మానలేకపోతే పొట్ట కింది భాగంలో దిండు పెట్టుకోవాలని నిపుణులు సూచిస్తున్నారు. తలకింద, పొట్ట కింద ఒకే విధమైన ఎత్తు ఉండే దిండును పెట్టుకోవాలి.

### సోల్జర్ భంగిమ

కాళ్ళూ, చేతులూ నిటారుగా పెట్టి వెల్లకిలా పడుకునే ఈ అలవాటు నూటికి ఎనిమిదిమందిలో ఉంటుంది. ఈ భంగిమలో నిద్రించేవారు ప్రశాంతంగా, ఒంటరిగా ఉండటానికి ఎక్కువ ఇష్టపడతారు. ఆడంబరాలు, అతిశయోక్తులకు దూరంగా ఉండి, ఇతరుల కన్నా ఉన్నతంగా ఉండేందుకు ఇష్టపడతారు. దానికోసం నిరంతరం శ్రమిస్తారు. ఈ భంగిమలో నిద్రించేవారు సరైన దిండు ఉపయోగిస్తే వెనుకభాగం, మెడ, భుజాలకు నొప్పి ఉండదు. అదేవిధంగా వీరికి గురకపెట్టే అలవాటు ఎక్కువ. నిద్రలో తరచు మేల్కొంటూ ఉంటారు. గాఢ నిద్ర కరువు కావడంతో మరిన్ని ఆరోగ్య సమస్యలు వచ్చే అవకాశాలు ఎక్కువ కాబట్టి తరచు పొజిషన్ మార్చుకుంటూ ఉంటే కొంతవరకూ పై సమస్యలను అధిగమించవచ్చు.

### యార్నర్ భంగిమ

కొద్దిగా ఒరిగినట్టు పడుకుని కాళ్ళూ చేతులూ నిటారుగా పెట్టుకుంటారు. రెండు చేతులూ కాళ్ళకు లేదా దిండుకు అభిముఖంగా పెట్టుకుని పడుకుంటారు. పదిహేను శాతం మందిలో ఇలా పడుకునే అలవాటు ఉంటుంది. ఈ భంగిమలో నిద్రించేవారు ప్రతి విషయాన్నీ తేలిగ్గా తీసుకుంటారు. నలుగురితో ఈజీగా కలిసిపోతారు. సామాజిక సంబంధాలు పెంపొందించుకునే గుణం ఉంటుంది. ఎప్పుడూ తమ చుట్టూ నలుగురు ఉండాలని కోరుకుంటూ ఉంటారు. కొత్తవారిని సైతం తేలిగ్గా నమ్మేస్తారు. ఒకవైపే పడుకోవడం వల్ల ఆయా భాగాలు కొద్దిగా నొప్పికి గురయ్యే అవకాశం ఉంది. దిండు ఎత్తు సరిపోక ఇబ్బంది పడు తుంటారు కాబట్టి అప్పుడప్పుడు భంగిమ మార్చి పడుకోవాలి.

### కాలుమీద కాలు

తలను దిండు మధ్యకు తెచ్చి శరీరాన్ని కొద్దిగా పక్కకు ఒరిగినట్టు చేసి రెండు చేతులూ కిందకు వేలాడేసి పడుకునే భంగిమ ఇది. కాళ్ళు రెండూ ఒక దానిమీద మరొకటి వేసుకుని నిటారుగా పెడతారు. ఇలాంటివారు ఎక్కువగా ప్రకృతి ఆరాధకులు. ఒకసారి ఏదయినా నిర్ణయం తీసుకుంటే ఎట్టి పరిస్థితుల్లోనూ మార్చుకునేందుకు ఇష్టపడరు. అనుమానం, మొండితనం పాళ్ళు వీరిలో ఎక్కువ. ఎదుటివారు చెప్పేది వినే గుణం తక్కువగానే ఉంటుంది. తమ మాటే నెగ్గాలనే పంతం వీరిలో ఎక్కువ. వీరికి ఆరోగ్య సమస్యలు పెద్దగా తలెత్తవు కానీ, సరైన దిండును ఎంచుకోవడం కష్టంగా ఉంటుంది. దీని వల్ల మెడనొప్పి వచ్చే అవకాశం ఎక్కువ. కాలుమీద కాలు వేసుకోవడం వల్ల కండరాలు పట్టేస్తుంటాయి.

### ఫోటస్ పొజిషన్

చిన్న పిల్లలు పడుకున్నట్టు పడుకుంటారు. ఒక పక్కకు తిరిగి రెండు చేతులూ దిండు కింద పెట్టుకుని, మోకాళ్ళు ముడుచుకు పడుకుంటారు. కొన్ని సందర్భాల్లో వీరు గడ్డం కింద చేయి పెట్టుకుంటారు కూడా. సమస్యలతో బాధపడేవారు, ఎక్కువగా ఆలోచించేవారూ ఈ భంగిమలో నిద్రిస్తారని నిపుణులు చెపుతున్నారు. వీరిలో పాపభీతి, న్యాయ ప్రవృత్తి ఎక్కువ. నలుగురిలో కలవడానికి సిగ్గుపడుతూ ఉంటారు. ప్రతి చిన్న విషయాన్ని తమకు అన్వయించుకుంటూ తరచూ బాధపడుతుంటారు. అయితే ఆలోచనలు తగ్గించుకొని పనులన్నీ క్రమబద్ధంగా చేయడం అలవాటు చేసుకుంటే చాలావరకూ వీరి చింతలన్నీ తొలగిపోతాయి.

-యశస్విని కె.

## కమ్మటి నిద్రకు చిట్కాలు

- నిద్రకు ఉపక్రమించడానికి మూడు గంటల ముందు వ్యాయామం చేస్తే మంచి నిద్ర పడుతుంది.
- పడుకునే ముందు కాఫీ, టీ లాంటివి తాగ కూడదు. గోరువెచ్చని పాలు తాగితే మంచి నిద్రపడుతుంది.
- ప్రతిరోజూ క్రమం తప్పకుండా ఒకే సమయంలో పడుకోవడం, నిద్రలేవడం అలవాటు చేసుకోవాలి.
- పడకగదిలో మంచి సువాసన వచ్చే అగరు వత్తులు, క్యాండిల్స్ వెలిగించుకోవాలి. పరిమళ భరితమైన సువాసన మంచి నిద్ర పట్టేలా చేస్తుంది.



- నిద్రకు ముందు ఇష్టమైన పాటలు, మ్యూజిక్ వినండి. నిద్ర దానంతట అదే వస్తుంది.
- నిద్రపోవడానికి రెండు మూడు గంటల ముందే రాత్రి ఆహారం తీసుకోవడం మంచిది.




# పార్శిల్‌లో పిల్లి



దూరప్రాంతాల్లో ఉన్న వారికి వస్తువుల్ని మాత్రమే పోస్ట్‌లో పంపిస్తాం లేదంటే కొరియర్ చేస్తాం. కానీ ఇంగ్లాండ్‌లో ఏకంగా ఒకరు ఓ పిల్లినే కొరియర్ చేశారు.

ఇంగ్లాండ్‌లోని కార్న్‌వాల్‌లో నివసించే జూలీ బగ్గోట్ ఓ పిల్లిని ముద్దుగా పెంచుకుంటోంది. దానిపేరు కఫ్ కేక్. ఈమధ్య ఆమె ససెక్స్ ప్రాంతంలో ఉండే ఓ వ్యక్తికి డీవీడీలు కొరియర్ చేసింది. డీవీడీలతోపాటు పిల్లిని కూడా ప్యాక్ చేసేసింది. ఆమె చూసుకోకపోవడంవల్ల అలా జరిగిందో లేక ఆమె కళ్ళు గప్పి పిల్లే అందులో దూరిందో తెలియదు కానీ పిల్లి మాత్రం ఎంచక్కా కొరియర్ సర్వీస్‌లో ప్రయాణం చేసింది. ఎనిమిది రోజుల అనంతరం పార్శిల్ అందుకున్న వ్యక్తి డీవీడీలతో పాటు ఉన్న పిల్లిని చూసి ఆశ్చర్యపోయాడు. ఆహారం, నీళ్ళు లేక నీరసించి ఉన్న పిల్లిని వెంటనే హాస్పిటల్‌కి తీసుకెళ్ళి చికిత్స చేయించాడు. అయితే ఈలోపుగానే జూలీ తన పిల్లి కనబడటంలేదని పోలీస్ కంప్లయింట్ ఇచ్చింది. చివరకు కొరియర్‌లో తమకు పిల్లి వచ్చిందంటూ ఫోన్ రావడంతో పిల్లి పొరపాటుగా కొరియర్ బాక్స్‌లో దూరిందని గుర్తించి ఊపిరి పీల్చుకుంది. మొత్తానికి పార్శిల్‌లో దూరి అందరినీ కంగారుపెట్టేసింది కఫ్‌కేక్!

# పిల్లో ఫైటింగ్ డే

పిల్లల అల్లరి ఎక్కువైతే ఇల్లు పీకి పందిరేస్తున్నారు అంటారు. కానీ ఇక్కడ దిండ్లు పీకి పందిరేశారు. ఎంచక్కా పిల్లోలతో కొట్టుకుంటూ ఆనందించేశారు. ఈ సంవత్సరం ఏప్రిల్ రెండో తేదీన పిల్లోలతో కొట్టుకుంటూ ప్రపంచమంతా సరదాగా గడిపేసింది.

2005లో ఇద్దరు యువకులు ప్రారంభించిన ఈ ఉత్సవాన్ని ప్రతి సంవత్సరం ప్రపంచవ్యాప్తంగా జరుపుకుంటున్నారు ఔత్సాహికులు. సామాజిక పరిచయాలను పెంచుకోవడానికి, టీవీ చూసే సమయాన్ని తగ్గించడానికి ఈ విధంగా ఒకరోజును పిల్లో ఫైటింగ్ డేగా సెలబ్రేట్ చేసుకుంటున్నారు! ఫోటోలు చూడండి ఎంచక్కా దిండ్లతో కొట్టుకుంటూ ఎలా ఉత్సాహంగా కనిపిస్తున్నారో!

# 152 దేశాలు చుట్టేశాడు

ప్రపంచ పర్యటన చేయాలని, అందమైన ప్రదేశాలను తనివితీరా ఆస్వాదించాలని ఎవరికి మాత్రం ఉండదు! అవన్నీ చూడాలంటే ఆర్థికంగా వెసులుబాటు కూడా ఉండాలి. ఇలాంటి అనేక కారణాల వల్ల కోరికలను తమలోనే అణచుకుంటారు చాలామంది. కానీ జానీవార్డ్ అలా చేయలేదు. పేద కుటుంబంలో పుట్టినా తన కలను నెరవేర్చుకుంటున్నాడు.

ఐర్లాండ్‌కు చెందిన జానీవార్డ్ కష్టపడి చదువుకున్నాడు. ఎన్నో ఉద్యోగాలు చేశాడు. కానీ అవేమీ అతనికి సంతృప్తినివ్వలేదు. దేశాలు చుట్టిరావాలనేది అతని కోరిక. దాంతో ప్రణాళిక ప్రకారం 'వన్‌స్టెప్ 4 వర్డ్' పేరుతో ఓ ట్రావెల్ బ్లాగ్ ఏర్పాటు చేశాడు. 2012లో తన ప్రయాణం ప్రారంభించాడు. దేశ విదేశాలు తిరుగుతూ అక్కడి వింతలు, చూడదగిన ప్రదేశాలు, ప్రపంచానికి తెలియని విశేషాలను రూపుగట్టే ఫోటోలు, వీడియోలు తన బ్లాగ్‌లో పొందుపరుస్తూ వస్తున్నాడు. దీంతో ఆ బ్లాగ్ పాపులర్ అయింది. ప్రకటనల రూపంలో ఆదాయం రావడం ప్రారంభమైంది. నెలకు 10 లక్షల డాలర్ల వరకు ఆదాయం వస్తుండటంతో ఇక వెనుతిరిగి చూసుకోలేదు. రెట్టింపు ఉత్సాహంతో అందమైన ప్రదేశాల్లో విహరిస్తూ అందర్నీ ఆశ్చర్యపరుస్తున్నాడు. ఇప్పటివరకు జానీ 152 దేశాలను చుట్టేశాడు.



# అక్కడికెళితే శిలైపోతారు!



ప్రపంచంలో మనకు తెలియని, అంతు చిక్కని అనేక వింతలూ, విషయాలూ చాలా ఉన్నాయి. రాజస్థాన్‌లోని బడ్మేర్ జిల్లాలో కిరడు దేవాలయాన్ని కూడా అలాంటి వింతల జాబితాలో చేర్చుకోవచ్చు. విషయం ఏంటంటే సూర్యాస్తమయం తర్వాత ఈ ఆలయంలో అడుగుపెడితే రాయిలా మారిపోతారట! అందుకే సూర్యాస్తమయం తరువాత ఈ దేవాలయంలోకి ఎవరూ వెళ్ళరు. స్థల పురాణం ప్రకారం స్థానికంగా ఒక కథ చెబుతారు.

కొన్ని వేల సంవత్సరాల కిందట ఒక ఋషి తన శిష్యులతో కలిసి ఈ కిరడు దేవాలయానికి వచ్చాడట. ఆ ఋషి తన శిష్యులను దేవాలయం దగ్గర విడిచిపెట్టి దగ్గరలోని ప్రాంతాలు చూడడానికి వెళ్ళాడట. గురువు వారిని విడిచిపెట్టి వెళ్ళడంతో తిండిలేక ఆ శిష్యుల ఆరోగ్యం క్షీణించిదట. ఆ దేవాలయం ప్రాంతంలో ఉన్నవారెవరూ ఆ శిష్యులకు సహాయం చెయ్యలేదట. తన శిష్యులకు స్థానికులు ఎలాంటి సహాయం చెయ్యలేదని తెలుసుకున్న ఆ ఋషి ఇంతటి కఠినమైన హృదయాలు కలిగిన స్థానికులను రాళ్ళుగా మారిపోమని శపించాడట. ఆ ఋషి శాపం వల్ల ఆ దేవాలయంలోకి సూర్యాస్తమయం తరువాత వెళ్ళినా, లేక సూర్యాస్తమయం తరువాత ఆ దేవాలయంలో ఉన్నా రాయిగా మారిపోతారని స్థానిక ప్రజలు నమ్ముతారు.

-నర్మద వాసిరెడ్డి



# నిండు నూరేళ్ళు ③

-సింహప్రసాద్ సెల్: 98490 61668

**“అందం, మంచితనం సమపాళ్ళలో రంగరించబడ్డ సహృదయులు మీరు. మీకు హేట్సాఫ్”.**

**ఇబ్బంది పడుతున్నట్లుగా ముఖం పెట్టాను.**

**“ఆర్డరివ్వండి మేడమ్” మెనూని నా ముందుకి తోస్తూ అన్నాడు విహాన్.**

“నేను నీ బాస్‌నా?”

“అహహా అదికాదు..”

“పోనీ దేవతనా! నా భక్తుడిలా బిహేవ్ చేస్తున్నావ్?”

“నా దృష్టిలో అంతే”.

“నేను దేవతనీ దయ్యాన్నీ కాదు. నీకన్నా చిన్నదాన్ని. విజిత అని పిలిస్తే మోర్ కంఫర్ట్, మోర్ హ్యాపీ”.

“నా మీద ప్రత్యేక వరాలు కురిపించిన అదృష్టదేవత...”

“స్టాప్ స్టాప్. సహస్ర నామార్చన వద్దు”.

“యాజ్ యూ విష్” బుద్ధిమంతుడిలా చేతులు కట్టుకున్నాడు.

“దట్స్ గుడ్..”

“ఆకలేస్తోంది” చిన్నపిల్లాడిలా అన్నాడు.

“టూ మినిట్స్...”

“నూడుల్స్ వద్దు”

“ఓకే ఓకే...” వెయిటర్ని పిలిచి సింపుల్‌గా ఆర్డర్ చేశాను.

“నీతో కలిసి కూర్చుంటే మాట్లాడుతోంటే నూతనోత్తేజం కట్టలు తెంచుకుంటోంది..” అన్నాడు.

“దానికి శ్రమ, పట్టుదల కలిపి కెరీర్ మీద పెట్టు. పైకొస్తావ్”.

“థాంక్యూ. నీ ఫ్యూచర్ ప్లాన్స్ేవిటి విజితా?”

“ఎంబీఏలో చేరాను. నా స్వంత బిజినెస్, ఆన్ లైన్‌ది - స్టార్ట్ చెయ్యాలని ఉంది”.

“చేసెయ్. నువ్వు బెస్ట్ ఉమన్ ఎంటర్ ప్రెన్యూర్ అవుతావని బాండు పేపర్ మీద రాసిస్తా”.

“ఏ వ్యాపారంలోనైనా లాభనష్టాలు రెండూ ఉంటాయి”.

“నీకు మాత్రం లాభమే ఉంటుంది. నిన్ను చూడగానే నీ కెపాసిటీ, కేపబిలిటీ అర్థమయ్యాయి”.

“పొగడ్తల బిజినెస్ వదిలేసి ఇంకో టాపిక్‌లో కెళదాం. నీ హాబీస్ ఏంటి?”

“బుక్స్, సినిమాలు, మ్యూజిక్. మరి నీకు?”

“బయోగ్రఫీలు, ఆటో బయోగ్రఫీలు చదువుతాను. ఆర్ట్ సినిమాలూ, సీరియస్ సినిమాలూ ఇష్టం”.

“లోతైన మనిషివన్న మాట”

“ప్రస్తుతం ఆకలి మనిషిని..” ఆహారం మీద దాడి చేస్తూ నవ్వాను.

పావుగంటకే నా భోజనం పూర్తయిపోయింది.

“అయ్యయ్యో, డిష్‌లన్నీ అలాగే ఉండిపోయాయి. టేస్టు చేశావు తప్ప ఏమీ తినలేదు”

“మరి ఇవన్నీ ఎవరు మెక్కారు?” ఖాళీ డిష్‌లు చూపించాను.

అతడు నవ్వబోతోంటే పొలమారింది.

అతడి తలమీద కుడి చేత్తో చిన్నగా తడుతూ “చిరంజీవ చిరంజీవ” అంటూనే ఎడంచేత్తో మంచినీళ్ళ గ్లాసందిచ్చాను.

అతడి కళ్ళు చెమ్మగిల్లాయి.

“మనం కేర్‌మన్నప్పుడే మన గురించి కేర్ తీసుకునే ఓ కుటుంబం రెడీగా ఉంటుంది. అమ్మ, నాన్న, అన్న, తమ్ముడు, అక్క, చెల్లి, తాత, నానమ్మ, అమ్మమ్మ, మేనత్త, అత్త - ఇలా ఎన్నోబంధాలు సిద్ధంగా ఉంటాయి. కానీ స్నేహితుల్ని మాత్రం మనమే వెతుక్కోవాలి. నేనో గొప్ప హితురాల్ని. స్నేహితురాల్ని వెదుక్కోగలిగాను. ఇక నా లైఫ్ ఫెంటాస్టిక్‌గా ఉంటుంది”.

“యస్ యస్.. ఉయార్ ఫ్రెండ్స్ విహాన్”.

అతడు పొంగిపోయాడు. నాకూ చెప్పలేనంత ఆనందం కలిగింది.

విహాన్ నన్ను సాగనంపడానికి కారు దాకా వచ్చాడు. డోర్ తెరచి పట్టుకుని “థాంక్స్ ఫర్ కమింగ్” అన్నాడు.

“మరీ ఇంత డోర్ సర్వీస్ అక్కర్లేదు” నవ్వేను.

### జరిగిన కథ

ఏడు నెలల క్రితం విజ్జీ వివాహం జరిగినా విహాన్ జ్ఞాపకాలను మరిచిపోలేదు ఆమె. పబ్‌లో జరిగిన పరిచయం వారిలో ప్రేమ అంకురింపజేస్తుంది. విహాన్ ఆత్మహత్య చేసుకోబోతున్నట్టు సెల్‌లో మెసేజ్ చూసి అతన్ని రక్షించే ప్రయత్నంలో భర్తను కూడా లక్ష్యపెట్టకుండా అర్ధరాత్రి పూనే నుండి హైదరాబాద్ వెళ్ళేందుకు ఎయిర్ పోర్ట్‌కు చేరుకుంది విజ్జీ. ఆమె ఆలోచనలు గతంలోకి జారుకున్నాయి.

ఆ తర్వాత....

“నువ్వు నా నిజమైన ఫ్రెండ్‌వే కదా విజితా?” మా మధ్య గల అంతస్తుల వైరుధ్యం వల్ల అతడికా సందేహం వచ్చినట్టుంది.

చిన్నగా నవ్వేను. “జీవితంలో అంతా అయిపోయింది, ఇక నాకేం మిగల్లేదు అని నువ్వనుకున్న టైమ్‌లో నీకు నేనుంటాను!”

ఉద్విగ్నమై చెప్పాను. అతడి కళ్ళు చెమర్చాయి.

“థాంక్యూ థాంక్యూ ఫ్రెండ్...!’

●●●

నాన్న నాకు పెళ్లి సంబంధాలు చూస్తున్నారని తెలిసింది.

నాక్కాబోయే భర్త గురించి కొన్ని అభిప్రాయాలున్నాయి. అంచనాలున్నాయి. అతడు సరదాగా, స్పోర్టివ్‌గా ఉండాలి. ఎలాంటి ఇగోలూ ఉండకూడదు. సెన్సాఫ్ హ్యూమర్ బాగా ఉండాలి. ఎంతో సఖ్యంగా ఉండాలి. ఒక్కమాటలో చెప్పాలంటే ఇంట్లోనూ బయట కూడా ఓ మంచి స్నేహితుడిలా ఉండాలి.

“ఎలాంటివాడిని హజ్బెండ్‌గా ఎక్స్‌పెక్ట్ చేస్తున్నావు?” అని నాన్న అడిగితే యిదంతా చెప్పాలనుకున్నాను.

ప్చ్. నాన్న అడగలేదు. అమ్మ మాట చెల్లదు. వదిన చెప్పలేదు.

ఇంట్లో నాకు చాలా ‘ఉక్కబోత’ ఫీలవ్వసాగాను.

నాన్న ఎప్పట్లానే అన్ని విషయాల్లోలానే అన్నీ అంతా తనే చూసుకోసాగారు. తన ఆలోచనే 150% కరెక్ట్ అన్నది ఆయన నిశ్చితాభిప్రాయం. ఆయన మాటే అందరూ వినాలంటారు. మా గొంతులోంచి మాట రానివ్వరు.

నా పెళ్లి విషయంలో ఆయన పద్ధతి భరించ రానిదిగా ఉంది. భయం గొల్పుతోంది.

నాలో నేను మథనపడేకన్నా ముందుగానే నా అభిప్రాయాన్ని ఆయన ముందు పరిచెయ్యడం ఉత్తమం అనుకున్నాను.

“డాడీ, నేను బిజినెస్ స్టార్ట్ చెయ్యాలనుకుంటున్నాను..”

“గుడ్. గో ఎ హెడ్ మై బేబీ”

“బిజినెస్‌లో నిలదొక్కుకునే దాకా పెళ్లి చేసుకోకూడదనుకుంటున్నాను.”.

“రెండింటికీ ముడివెయ్యకు విజ్జీ. దేనికదే విడివిడిగా చూడటం సరైన పద్ధతి”.

“మొదటి ఒకటి రెండేళ్ళు నా పూర్తి సమయాన్ని వ్యాపారానికే వినియోగించాలి కదా డాడీ. అప్పుడే బాలారిష్టాలు దాట గలుగుతుంది..”

“కరెక్ట్. నీకు సపోర్టుగా ఉండే చాకులాంటి

యువకుణ్ణే సెలక్ట్ చేస్తాను. డోంట్ వర్రీ!"

ఆయన ధోరణి బొత్తిగా నచ్చలేదు. పెదవి కొరుక్కున్నాను. ఆపైన గోళ్ళు కొరుక్కున్నాను.

నా అసంతృప్తిని విహాన్ ముందు కక్కేశాను.

"అందరి తండ్రులూ ఎలా ఉంటారో తెలియదు గాని మా డాడీ 100% ఆటోక్రాట్. తనే రైటు, తనన్నదే జరగాలంటారు. ఎదుటివాళ్ళ అభిప్రాయం తెలుసుకోవాలనే అనుకోరు. వాళ్ళకి సంబంధించిన విషయమైనా సరే తనే నిర్ణయాలు తీసేసుకుంటారు. అంత పసిదాన్ని అనుకుంటారో అమాయకురాలినను కుంటారో అసమర్థురాలిననుకుంటారో తెలీదు!" ఉక్రోషం ఆగ్రహం కలగలవగా ఊగిపోయాను.

విహాన్ నవ్వేడు "నీక్కూడా కోపం వస్తుందన్నమాట".

"బీ సీరియస్. చిన్నప్పట్నుంచీ డాడీ ఇంతే. ఇంట్లో తనొక్కరూ వెలుగులో ఉండాలి. వెలుగుతూ ఉండాలి. మేమంతా నీడలో ఉండాలి. నీడల్లో ఉండాలి!"

"బొమ్మరిల్లు ప్రకాష్‌రాజన్న మాట".

"అంతకంటే దారుణం. ఆయన కనీసం చెప్పనైనా చెబుతారు. ఈయన అదీ లేదు. నాకు మాట మాత్రంగానైనా చెప్పకుండా నా అభిప్రాయం, నా ఎక్స్‌పెక్టేషన్స్ తెలుసుకోకుండా నాకు జీవిత భాగస్వామిని సెలక్టు చేస్తున్నారంటే ఏమనుకోవాలి?"

"అది అన్యాయమే. జీవితంలో అతిముఖ్యమైన ఈవెంట్‌లో కూడా సంప్రదించక పోవడం మంచి పద్ధతి కాదు. హీ ఈజ్ టోటల్లీ రాంగ్".

"అహ అలాగనొద్దు. నన్ను పట్టించుకోకపోవడం నా బాగోగులు అశ్రద్ధ చెయ్యడమూ ఉండదు విహాన్. హీ ఈజ్ లవ్వింగ్ కేరింగ్ పాంపరింగ్ ఫాదర్. నాకేం కావాలో నా కన్నా డాడీకే బాగా తెలుసు. అలాగని నా ఫీలింగ్స్‌ని కంట్రోలు చేసుకోలేకపోతున్నాను".

"పోనీ మీ ఇంట్లోని ఎవరి చేతనైనా చెప్పిస్తే ఎలా ఉంటుందంటావ్?"

"ఎవరుచెప్పినా ఎలా చెప్పినా డాడీ వినరు. అంచేత దాని గురించి ఎక్కువగా ఆలోచించి బుర్ర పాడుజేసుకోవడం అనవసరం. ఆ గొడవ ఆయనకి వదిలేసి నా గొడవలో నేనుంటే మంచిదనిపిస్తోంది.

"అఫ్‌కోర్స్. అదీ పాయింటే..' నా వంక అదోలా చూస్తూ అన్నాడు.

"నా ఎనర్జీని బిజినెస్ స్టార్ట్ చెయ్యడం మీద కేంద్రీకరిస్తాను. ప్రభుత్వం కూడా స్టార్టప్ కంపెనీలకి బాగా సాయ పడుతుంది. కొత్త ఐడియాలతో, ఆవిష్కరణలతో వెళితే ఆర్థిక సాయమూ అందిస్తోంది. ఇవాళ రేపు మనం మన ఆలోచనల్ని 'మనలోనే దాచుకోనక్కర్లేదు. వందమందికి చెప్పడానికీ, సలహాలూ సపోర్టూ తీసుకోడానికీ సోషల్ మీడియా ఉంది. యూట్యూబ్ ఉంది, ఇంకా ఎన్నో అవకాశాలున్నాయి. మనం చేయాల్సిందల్లా వాటిని అంది పుచ్చుకోవడమే!"

'నీ ఆలోచనలు బావుంటాయి. ఆచరణాత్మకంగా ఉంటాయి, ఇంతకీ నువ్వు ఏ లైనాఫ్ బిజినెస్ ఎన్నుకున్నావు?"

"ఎన్నారైల కోసం ఓ సంస్థని స్థాపించాలని ఉంది. వారు చెప్పిన గిఫ్టుల్ని ఇక్కడి వారికివ్వటం, వారు కోరిన సమస్త పనులూ చేసి పెట్టడం. అంటే వారి వారికి వైద్య పరీక్షలు చేయించడం నుంచి ఆసుపత్రిలో చేర్చి సపర్యలు చేయడం వరకూ. అలాగే వారి ఆస్తులు అన్యాక్రాంతం కాకుండా కాపాడటం నుంచి రిపేర్లు చేయించడం, అద్దె వసూలు చేయడం వరకూ నన్నమాట. వారికి ఆస్తులు కొనిపెట్టడం, ఇన్వెస్ట్ చెయ్యడం కూడా చెయ్యాలన్నమాట".

"అలాంటివి ఉన్నాయిగా!"

"ఉన్నాయి గాని అన్నీ అన్ని పనులూ చెయ్యడం లేదు. కొందరు గిఫ్టులకీ మరికొందరు బొకేలకీ ఇంకొందరు రియల్ ఎస్టేట్‌కీ పరిమితమైపోతున్నారు. అలాగాక వారిక్కావలసిన వన్నీ ఒకే గొడుకు కింద చెయ్యాలి. అది కూడా బాధ్యతతో తృప్తి కలిగేలా సొంత మనిషిలా చెయ్యాలి. వారి అన్ని రకాల పనులన్నీ పూర్తిగా ఆధారపడేలా ఉండాలి. భరోసా ఇవ్వాలి".

"చెప్పినట్టు చెయ్యగలిగితే బాగానే ఉంటుందనుకో..."

"క్వాలిటీ సర్వీస్ అందివ్వడంలోనే సక్సెస్ ఉంది. మొన్న మా కజిన్‌కి బర్త్‌డే కేక్ ఆర్డర్ చేస్తే అర్ధరాత్రి డెలివరీ ఇస్తామని అదనంగా 12 డాలర్లు వసూలు చేసి కూడా తెల్లారి ఆరున్నరకి డెలివరీ ఇచ్చారు. అది కూడా పాచి వాసనొచ్చింది. అలాంటి కంప్లయింట్లూ కామెంట్లూ గూగుల్ ఫీడ్ బ్యాక్‌లో బోల్డు కన్పిస్తాయి. అలా జరగకుండా చూడాలి. అందుకే లిమిటెడ్ ఏరియాకీ లిమిటెడ్ కస్టమర్లకీ పరిమితమై క్వాలిటీ సర్వీసు ఇవ్వాలన్నది నా ఆలోచన".

"గుడ్ ఐడియా. ముందుముందు ఇంకా డిమాండ్ ఉంటుంది. ముఖ్యంగా తమవారి బాగోగులూ, ట్రీట్‌మెంట్లూ, ఆస్తుల వ్యవహారాలు చూడటానికి నమ్మకమైన సంస్థ కావాలని కోరుకునే వాళ్ళు ఎక్కువవుతారు".

"నా పాయింటుని కరెక్టుగా క్యాచ్ చేశావు విహాన్. చూస్తుండు ఇక పైన అనుబంధాలూ కుటుంబ బాధ్యతలూ అవుట్ సోర్సింగ్ అయిపోతాయి!"

"ఇంకేం ఆలస్యం చెయ్యొద్దు. నీ ఆలోచనలు క్లియర్‌గా ఉన్నాయి. వెంటనే స్టార్ట్ చేసెయ్యి".

"నీ మాటలు నా మోరేల్‌ని బూస్ట్ చేశాయి. ఇంకేం తాత్సారం చెయ్యను. వెంటనే కంపెనీ రిజిస్టర్ చేసి ప్రాథమిక నెట్ వర్కింగ్ పనులు మొదలు పెట్టేస్తాను?"

"నీకింక ఢోకా ఉండదు. నాకే ఏదీ కలసి రావటం లేదు. నా నెత్తిమీద కూర్చున్న శని ఇంకా పోలేదు.." నిరాశగా అన్నాడు.



భృకుటి ముడివేసి పరిశీలనగా చూశాను.
నా గొడవలో పడి పట్టించుకోలేదు గాని విహాన్ డల్‌గా ఉన్నాడు. మునుపటి ఉత్సాహం ఏ కోశానా లేదు.
"పర్సనల్ ప్రాబ్లెమ్సా, ప్రొఫెషనల్ ప్రాబ్లెమ్సా?" ఆరా తీశాను.
"పర్సనల్‌వి ఇప్పుడప్పుడే ఓ కొలిక్కిరావు. కనీసం ఇంకో అయిదేళ్ళు కష్టపడితే గాని మా కుటుంబం ఓ దారిన పడదు. కెరీర్ గ్రోత్ గురించే దిగులుగా ఉంది. మొన్న అనుకోకుండా ఓ టీవీ సీరియల్ ఆడిషన్ కెళ్ళాను. అంతా బాగానే ఉందన్నారు గాని నన్ను సెలక్ట్ చెయ్యలేదు. ఆ చాన్స్ దక్కి ఉంటే డైలీ సీరియల్లో ప్రధానపాత్ర ధరించేవాణ్ణి. నా జాతకం అడ్డంగా మారిపోయేదనుకో".
"వాళ్ళేమన్నారు? ఫ్రాంక్‌గా చెప్పు..."
"రికమండేషన్ల ఒత్తిడి వచ్చి ఉంటుంది. అర్హతని బట్టి చూస్తే నాకే రావాల్సింది' గాఢంగా నిట్టూర్చాడు.
నాకు చిర్రెత్తుకొచ్చింది.
"రికమండేషన్ల వాళ్ళు తన్నుకుపోయారు. లంచాలిచ్చి మింగేశారు లాంటి వంకలతో నిన్ను నువ్వు మభ్య పెట్టుకోవద్దు. ప్రతిభావంతులు అక్కర్లేదని ఎవరూ అనుకోరు. నువ్వు చెప్పేది ప్రభుత్వ రంగంలో జరగొచ్చేమో గాని ప్రైవేటు రంగంలో చస్తే జరగవు. నో. నీ ప్రతిభ వాళ్ళ అంచనాలని అందుకోలేదు. నువ్విప్పుడు చేయాల్సింది వాళ్ళని తిట్టడమో విధిని నిందించడమో కాదు. నీ స్కిల్‌కి మరింత మెరుగు పెట్టుకోవడం. నిన్నెవరూ తోసి రాజన్లేని స్థితికి చేరుకోవాలి. అందుకోసం మరింతగా శ్రమపడు. ఫలితం దానంతటదే వచ్చి నీ ఒళ్ళో వాలుతుంది!"
అప్రతిభుడయ్యాడు. నా వంక ఆరాధనగా చూశాడు. పిమ్మట తలవంచుకుని మెల్లగా చెప్పాడు "నా నటనలో ఈజ్ లేదన్నారు..."
"అదీ సత్యం. దాన్ని అధిగమించాలంటే నటనలో శిక్షణ తీసుకోవాల్సిందే. ప్రముఖ నటుల వారసులు కూడా అన్ని రకాల తర్ఫీదులూ పొందాకే గోదాలోకి దిగారని మర్చిపోకు. నువ్వూ ఓ ఫిల్మ్ ఇనిస్టిట్యూట్‌లో చేరు.."
"నీ సలహా ఫాలో అయిపోతాను విజితా. అది హెల్ప్ అయి కనీసం టీవీ యాంకర్నైనా అయిపోతాను..." గుండెల్నిండా గాలి పీల్చుకుంటూ అన్నాడు విహాన్.
అతడు ఉత్తేజితుడవటం చూసేసరికి ముచ్చటేసింది. ఆనందాన్ని దాచుకోలేకపోయాను.

**సంపదలో పుట్టిపెరిగిన విజికి సామాన్య ప్రజల కష్టాలు, ఇరుకు గదుల్లో వారి బతుకులు గురించి అంతగా తెలియదు. విహాన్‌తో ఆమె పరిచయం ఆ జీవితం గురించి వినేట్టు చేసింది. అలాంటివారి ఇళ్ళు ఎలా ఉంటాయో, వారి బతుకులు ఎంత దుర్భరంగా ఉంటాయో విహాన్ ద్వారా విని తెలుసుకుంది. విహాన్‌ను ఆమె ప్రేమిస్తోందా? విహాన్ ఆమెనుండి ఏమి ఆశిస్తున్నాడు? ఆమె లక్ష్యం ఏమిటి?**



"తప్పకుండా అవుతావు విహాన్. పాజిటివ్ దృక్పథం ఉంటే చాలు ఏదైనా సరే తేలిగ్గా సాధించెయ్యొచ్చు. బైదిబై ఫిల్మ్ ఇనిస్టిట్యూట్‌లో ఫీజులు భారీగా ఉంటాయి. అవసరమైతే చెప్పు మనీ ఎడ్జస్ట్ చేస్తాను".
అతడు కదిలిపోయాడు. "ఓ థాంక్యూ. టైమ్‌కి హెల్ప్‌చేసే ఓ ఫ్రెండ్ ఉందని ఎప్పుడూ గుర్తు పెట్టుకుంటాను".
ఇంతలో "ఇక్కడున్నారా" అంటూ మమ్మల్ని వెదుక్కుంటూ వచ్చింది సుధారాణి. మేమిక్కడున్నట్టు తనకెలా తెలిసిందో ఏమో.
మేం విష్‌చేసే లోగానే "స్వీట్ నథింగ్స్ చెప్పుకుంటున్నారా" అంది.
ఆమె ధోరణికి చిరాకేసింది. "మా మా కెరీర్‌ల గురించి చర్చించుకుంటున్నాం" అన్నాను.
"ఓహో శిఖరాగ్ర సమావేశమా? నాకు అర్థం కాదులే!"
"అటువంటప్పుడు కల్పించుకోకపోవడమే సంస్కారం" అన్నాడు విహాన్.
"విహాన్‌కి నేను ఫోన్ చెయ్యడమే తప్ప తనెప్పుడూ చెయ్యడు. ఎక్కడికైనా వెళ్దామంటే బిజీ బిజీ అంటాడు. రాచకార్యాలు చక్కబెడుతుంటాడేమో మరి" నా వంక క్రీగంట చూస్తూ అంది.
"నేను స్ట్రగిలింగ్ ఆర్టిస్టుని. ఒక స్థాయికి చేరుకునే వరకూ అనవసర విషయాలు పట్టించుకోలేను సుధగారూ" అన్నాడు విహాన్.
"సరే. మాట్లాడిన రెండు నిమిషాలైనా అంటీముట్టనట్టు గాకుండా సరదాగా మాట్లాడొచ్చుగా!" వంకర్లు తిరిగి పోతూ అంది.
"మీ ఇద్దరి వేవ్‌లెంగ్త్‌లూ కలవలేదేమో సుధా" అనాలోచితంగా అనేశాను.
మొఖం ఎర్రగా చేసుకుని గుర్రుగా చూసింది. ముక్కు పుటాలెగరేసింది.
"నాకు నీలా అందాలూ లేవు ఐశ్వర్యాలూ లేవు మరి!"
చటుక్కున లేచాడు విహాన్. "ఓకే విజితా... ఇక వెళ్దామా?"
"రాకూడని సమయంలో వచ్చి మీ మూడ్స్ పాడు జేశానా!"
ఆమె ధోరణికి విసుగొచ్చినట్టుంది, "ఓ.కే. సీయూ" అని చెప్పి విసవిసా వెళ్ళిపోయాడు.
"నా గురించి నువ్వు కొంచెం చెప్పు విజితా. నీ మాట 100% వింటాడు. నా మీద కొంచెం ఇంట్రెస్ట్ చూపిస్తే చాలు ఆ తర్వాత నేనే అల్లుకుపోతాను".
"ప్రేమకి రికమండేషన్లు పని చెయ్యవు"
"మీ చర్చలు పని చేస్తాయా??"
సర్రున కోపం పొడుచుకొచ్చింది. నిగ్రహించు

కున్నాను.

"మేం పోచికోలు కబుర్లు చెప్పుకోలేదు. ఒకరి సమస్య ఒకరికి చెప్పుకున్నాం. ఒకరికి వెన్నుదన్నుగా మరొకరం నిలిచాం".

అయోమయంగా చూసింది. తనకేమీ అర్థం కాలేదని నాకు అర్థమైంది.

"పిచ్చి ఆలోచనలు ఆరోగ్యానికి మంచివికాదు. వెళ్దాం పద.." లేచి బ్యాగ్ అందుకున్నాను.

నా వెనుకే వచ్చి అంది "మీ ఇద్దరూ తరచూ కలుసుకుంటున్నారు కదూ?"

"అప్పుడప్పుడూ"

"నీతో బాగా క్లోజ్‌గా మూవ్ అవుతున్నట్టున్నాడు"

"ఫ్రెండ్స్ కదా?"

"నేనూ ఫ్రెండునేగా. నీకన్నా ముందు అతన్ని ఇష్టపడ్డాను. ఆ సంగతీ విహాన్‌కి చెప్పాను. అది ఇష్టం కాదు పిచ్చి అని ప్రాంజలి చేతా చెప్పించాను. అయినా మెత్తబడటం లేదంటే ఏదో బలమైన కారణం ఉండే ఉంటుంది.

పెదవి విరిచి 'ఏమో మరి' అన్నట్టు చేతులు తిప్పాను.

"విజ్జీ, నేనొకటి అడుగుతాను సూటిగా జవాబిస్తావా?"

వదిలామంటే లక్ష్యం ఛేదించి తీరాల్సిందే. అంత పక్కాగా పకడ్బందీగా ఉండాలి.."

ఆయన మాటలు మెస్మరైజ్ చేశాయి. ఆయన అనుభవం నాకు కొండంత బలమై తీరుతుంది!

"ఒక డాడీలా గాక గురువులా గైడెన్స్ ఇవ్వండి. శిష్యురాల్లా ఫాలో అయిపోతాను".

నాన్న బోలెడు సంబరపడిపోయారు. "విన్నావు టోయ్. విజ్జీ నా శిష్యురాలవుతుందిట" అమ్మతో గొప్పగా చెప్పేరు.

"మనింట్లో ఇంకో బిజినెస్ మాగ్నెట్ తయారవుతోందన్న మాట" అంది అమ్మ. పైకి నవ్వుతూనే ఉన్నా దాని వెనుక ఏదో నీడ కదిలినట్టుగా అన్పించింది. అమ్మ వంక ప్రశ్నార్థకంగా చూశాను.

నా తల నిమురుతూ అంది. నీకే వ్యాపారాలూ లాభాలూ నష్టాలూ రూపాయిలూ ఎత్తులూ పైఎత్తులూ ఇవన్నీ ఎందుకమ్మ. హాయిగా పెళ్లి చేసుకో. మీ ఆయనతో ప్రేమగా ఉండు. పిల్లల ప్రేమలో మునిగితేలిపో. ఇంటిని నందనవనం చేసుకో. పరుగుళ్ళూ ఒత్తిళ్ళూ లేని సుఖసంసారం స్వర్గంతో సమానం విజ్జీ.

"అదేంటి మమ్మీ, అమ్మమ్మ చెప్పాల్సిన కబుర్లు నువ్వు చెబుతున్నావ్! ఆడదాన్ని వంటింట్లో కట్టి పడేయాలనుకోవడం సరికాదు" రోషపడ్డాను.




"ఎందుకివ్వను?"

"మీ మధ్య ఉన్నది స్నేహమా? ప్రేమా?"

"మేం ఇన్‌ఫాచ్యుయేషన్ స్టేజ్‌లో లేం"

●●●

ఫ్రెండ్స్ ఫర్ ఆల్.

అదీ నా కంపెనీ పేరు. పేరు విని నాన్న మెచ్చుకున్నారు. విహాన్ అయితే ఎగిరి గంతేశాడు.

అదృష్టవశాత్తూ ఆ పేరుతో కంపెనీలేమీ లేకపోవడంతో మా తరపున దాన్ని బ్లాక్ చేశాడు చార్టర్డ్ ఎకౌంటెంట్. కంపెనీ రిజిస్ట్రేషన్‌కి కావాల్సిన పత్రాలన్నీ అతడికి సమర్పించాను.

"ఆఫీసు ఎస్టాబ్లిష్ చెయ్యాలి. వెబ్‌సైట్ డిజైనింగ్ మొదలు పెట్టాలి డాడీ" నాన్నతో చెప్పాను.

"నీ స్పిరిట్ నాకు నచ్చింది బేబీ. కీపిటప్.."

ఒక్కసారిగా వెయ్యి ఏనుగుల బలం వచ్చేసింది. "నీ సపోర్టు ఉంటే వండర్స్ చేసి చూపిస్తాను డాడీ".

"నీకేం కావాలన్నా అరేంజ్ చేస్తాను. ఎంత డబ్బు కావాలన్నా ఇస్తాను. కాని వేగ్‌గా చెయ్యడం, గాలిలో లెక్కలు వెయ్యటం నాకు నచ్చదు. దేనికైనా పర్ఫెక్ట్ ప్లానింగ్ ఉండాలి. నారి సారించి బాణం

"కొంచెం శాంతంగా ఆలోచించు విజ్జీ. ఏదో సాధించాలని వ్యాపారం మొదలుపెట్టినా ఆఖరికది డబ్బు వేటగా మారిపోతుంది. అందులో పడి ఇల్లూ మొగుడూ పిల్లలూ అన్నీ మరిచి పోతావు. నువ్వూ, నీ ఇగో, నీ పంతం, నీ పరువు - ఇవే ముఖ్యమనుకునే స్థితికెళ్ళిపోతావు..

"డాడీ లానా."

నా ప్రశ్నకి డాడీ ఉలిక్కిపడ్డారు. మమ్మీ ప్రసన్నంగా నవ్వింది.

"మీ మమ్మీ మాటలు విని నేను ఇంట్లో కూర్చుంటే ఇన్ని ఆస్తులూ, ఇంత ప్రతిష్ఠా సంపాదించే వాణ్ణి కాదు. ఆ పాత చింతకాయ పచ్చడి కబుర్లు మన ఒంటికి సరిపడవు గాని నన్ను ఫాలో అవ్వు. నిన్ను మహారాణిని చెయ్యాలన్నది నా డ్రీమ్".

"ఆ మహారాజుకి ఎందరు భార్యలుంటారో!" అమ్మ గొణగలేదు. స్పష్టంగా చెప్పింది. సూటిగా చెప్పింది.

నాన్న కోపం కట్టలు తెంచుకుంది.

"నోర్ముయ్. విజ్జి నా కూతురు. భోగభాగ్యాల్లో తేలియాడాల్సిందే. ఎవరూ అడ్డురావడానికి వీల్లేదు. వస్తే నా ఉగ్ర రూపం చూస్తారు. మాడి మసై పోతారు!" కోపోద్రిక్తులై బిగ్గరగా అరిచారు నాన్న.

అంతలా అరవాల్సిన పనేమిటో అర్థం కాలేదు. చెప్పాలనుకున్నది మామూలుగా చెప్పొచ్చుగా.

లోపల్నుంచి వదిన పరుగెత్తుకొచ్చింది. ఏం జరిగిందోనని భయపడి పోతూ.

అమ్మ కళ్ళు తుడుచుకుంటూ లోపలికి వెళ్ళిపోయింది.

"మీకు కోపం తెప్పించే పనేమీ చెయ్యను డాడీ..." ఆయన్ని ఎలా శాంత పరచాలో తెలీక అన్నాను.

"నాకు తెలుసు బేబీ! నీ కోసం ఆ స్వర్గాన్నే భూమికి దించుతాను".

నాన్న బయటికి వెళ్ళిపోయారు.

నన్ను తన గదిలోకి తీసుకెళ్ళి "అసలేం జరిగింది విజ్జీ" అడిగింది వదిన.

జరిగిందంతా వివరించాను.

"మమ్మీ ఎందుకలా అన్నదో, డాడీ ఎందుకలా రెచ్చిపోయారో అర్థం కాలేదు".

"ఓస్ అంతేకదా. నేనింకా నువ్వేదో లవ్ ఎఫైర్లో పడ్డావేమో, ఆయన శివతాండవమాడుతున్నారేమో అని భయపడ్డాను".

"డాడీని అపార్థం చేసుకుంటున్నావు వదినా. నేను నిజంగా ఎవర్నైనా ప్రేమిస్తే డాడీ అతడి కాళ్ళు కడిగి కన్యాదానం చేస్తారు".

భుజాలు ష్రగ్ చేసింది. 'అలా చేస్తే గ్రేటే".

"మమ్మీకి లోలోపలేదో అసంతృప్తి పేరుకుని ఉన్నట్టుంది..."

పేలవంగా నవ్వింది. "మీ డాడీకి ఇల్లూ ఇల్లాలు కన్నా బయటిబంధాలూ సంబంధాలూ ఎక్కువ".

"అంటే? నాకేం అర్థం కాలేదు"

"అదే మంచిది. ఇంకేమీ అడక్కు. నేనేమీ చెప్పలేను".

●●●

ఇంటీరియర్ డిజైనర్ సత్యదేవ్‌ని తీసుకుని కేపీహెచ్‌బీ కాలనీకి వెళ్ళాను.

హైటెక్ సిటీ రోడ్లో మాకో బిల్డింగ్ ఉంది. అందులోని సెకండ్ ఫ్లోర్ త్వరలో ఖాళీ అవుతుందనీ అందులో నా కంపెనీని ఎస్టాబ్లిష్ చేసుకోమనీ నాన్న చెప్పారు.

ఈలోగా ఆఫీసు డిజైన్ చేయించుకుంటే సమయం ఆదా అవుతుందని రంగంలోకి దిగాను.

లొకాలిటీ, బిల్డింగ్ స్ట్రక్చరూ బాగా నచ్చాయి. ఐడియల్ లొకేషన్ అన్పించింది. అతడూ అదే అభిప్రాయం వ్యక్తపరిచాడు.

తిన్నగా సెకండ్ ఫ్లోర్‌లోకి వెళ్ళాం. ప్రస్తుతం అందులో ఈవెంట్స్ మేనేజ్‌మెంట్ కంపెనీ నడుస్తోంది.

రకరకాల గిఫ్టులూ, కంప్యూటర్లూ, ఆల్బమ్‌లూ, వీడియో ఎక్విప్‌మెంటూ... బాగానే ఏర్పాటుచేశారు. మరెందుకు తీసేస్తున్నారో!

"హలో అయామ్ విజిత, డాటరాఫ్ రుద్రేశ్వరరావు గారు" ఓనర్ని విష్ చేశాను.

"నైస్ టూ మీట్ యూ..."

"వీరు మా ఇంటీరియర్ డిజైనర్. ఇక్కడ మా కొత్త కంపెనీ ఆఫీసు పెట్టాలని మా ప్లాన్..."

అతడు నిర్ఘాంతపోయాడు. "బిజినెస్ డల్ అయ్యింది గనుక తీసేస్తే బావుంటుందని ఆలోచిస్తున్నాను. ఇంకా డిసైడవ్వలేదు. ఈలోగానే రుద్రేశ్వరరావు గారు ఇక్కడ కంపెనీ ఓపెన్ చెయ్యాలని ప్లాన్ చేయడం...

ఫ్రాడ్ బిజినెస్ మ్యాన్...."

అతడి మొహం బాధతో కంది పోయింది. కళ్ళల్లో కన్నీటి పొర లీలగా కదిలింది.

అనవసరంగా బాధపెడుతున్నామేమో అన్పించింది. కాని తప్పదు. బిజినెస్‌లో సెంటిమెంట్లు చెల్లవు.

"ఇవాళ రేపు పెళ్లి నుంచి బారసాల దాకా అన్నీ చక్క బెడుతోంది ఈవెంట్ మేనేజర్లేగా. మీదెందుకు డల్ అయ్యింది?"

"ఫంక్షన్స్ ఎక్కువగా హోటల్స్‌లో చేస్తున్నారు. వాళ్ళేమో ఫ్లవర్ డెకరేటర్స్, వీడియోగ్రాఫర్, యాక్టివిటీ పర్ఫార్మర్స్ వగైరాలతో టైఅప్ పెట్టుకుంటున్నారు. అంచేత మా దగ్గరికొచ్చేవాళ్ళు తగ్గిపోయారు. ఇళ్ళల్లోనూ, ఫంక్షన్‌హాల్స్‌లోనూ చేస్తున్న వారే వస్తున్నారు. పోటీ ఎక్కువగా ఉంది.

"కాంపిటీషన్ అన్నిట్లో ఉంది. అన్నిచోట్లా ఉంది. సర్వైవల్ ఆఫ్ ద ఫిటెస్ట్..." అని నవ్వి. "మీకు అభ్యంతరం లేకపోతే కొలతలు తీసుకుంటాం" అన్నాను.

సత్యదేవ్ వెంటనే రంగంలోకి దిగిపోయాడు. కంపాస్ సాయంతో దిక్కులు చూసి వాస్తు ప్రకారం నేనెక్కడ కూర్చుంటే ఎలా ఉంటుందో మిగతావి ఏవి ఎక్కడైతే మంచిదో చెప్పాడు.

"ఇప్పుడున్న వాళ్ళు దెబ్బతిన్నారు గనుక మనం వాస్తు ఫాలో అయితేనే బెటర్" నాకా విషయాలు తెలీకపోయినా చెప్పాను.

కాసేపు తర్జన భర్జనలయ్యాక అన్నాడతడు "ఒక్క పది రోజులు టైమివ్వండి. ఇంటీరియర్ డిజైన్ త్రీడీలో తయారు చేసి తెచ్చి చూపిస్తాను".

అతణ్ణి సాగనంపి నా కారెక్కబోతూ ఆ పక్క షాపులో విహాన్‌ని చూసి ఆగిపోయాను. ఆశ్చర్యపోతూ పిలిచాను.

"వాటే వండర్. ఇక్కడ ప్రత్యక్షమయ్యావేంటి?"

"ఈ బిల్డింగు మాదే. సెకండ్ ఫ్లోర్లో నా ఆఫీసు ప్రారంభించబోతున్నాం. రా చూద్దువు గాని.."

విహాన్‌ని పైకి తీసుకెళ్ళి అంతా చూపించాను. నా సీటు ఎక్కడ ఉంటుందో మిగతావి ఎలా ఉంటాయో వివరించాను.

"ఫెంటాస్టిగ్గా ఉంటుంది. నీ అభిరుచి ఆఫీసు సెటప్‌లోనూ కన్పిస్తోంది"

"అద్సరే. నువ్వేమిటిక్కడ?"

"కర్రీ కోసం వచ్చాను" చేతిలోని ప్లాస్టిక్ కవర్ చూపించాడు.

"సొంతంగా వండుకుంటావా?" యమా ఆశ్చర్యబోయాను.

"స్వయంప్రభు స్వయం సేవక్. నేనే ప్రభువుని. నేనే సేవకుణ్ణి. మాకు మీలాగా వండేవాళ్ళు, వడ్డించే వాళ్ళు అంటూ ఉండరు. ఎంచక్కా కుక్కర్లో అన్నం వండేసుకుని ఇక్కడ కూర, అక్కడ కుండపెరుగు కొనుక్కుని తినేస్తాం".

"అయితే నువ్వుండేది ఈ దగ్గర్లోనేనా?"

"అదిగో ఆపైన కన్పిస్తోన్న బృందావన అపార్ట్‌మెంట్సులోనే మా నివాసం. ఒకసారి రాకూడదూ?"

వచ్చిన పనయ్యింది. వేరే అర్జంటు పనులూ లేవు.

అతడి రూముకెళ్ళాను. బ్రహ్మచారుల కొంప లానే ఉంది. సామాను బాగా తక్కువ ఉంది. అయినా చెల్లాచెదురుగా పడి ఉన్నాయి. ఎక్కడబడితే అక్కడ దుస్తులు తోరణాల్లా వేలాడుతున్నాయి.

"భలేగా ఉందిలే నీగూడు. ఇందులో నిద్రపడుతుందా?"

"బ్రహ్మాండంగా, నేనొక్కడ్నేకాదు ఇంకో ముగ్గురున్నారు. అందరం కలిసి వండుకుంటాం. ఖర్చు షేర్ చేసుకుంటాం" ప్లాస్టిక్ కుర్చీ తెచ్చివేశాడు.

"ఇంత సింపుల్‌గా ఎలా బతుకుతున్నావ్?" వాస్తవాన్ని జీర్ణించుకోలేకుండా ఉన్నాను. చిన్న ఇళ్ళు అని తెలుసు కాని మరీ ఇంత చిన్నగానా! ఇదీ ఒక లైఫేనా!

విహాన్ వంక సానుభూతిగా చూశాను.

"ఇంతకంటే దారుణమైన జీవితాన్ని చూశాను.." ముఖాన్ని విషాదమేఘాలు కమ్ముతోంటే భారంగా బాధగా అన్నాడు.

నవ్వుతూ తుళ్లుతూ తిరుగుతూ కబుర్లు కాకరకాయలూ చెప్పే విహానేనా ఇతడు? అన్పించింది. నమ్మలేనట్లుగా చూశాను.

అతడి మిత్రులు రాగా వారిని పరిచయం చేశాడు.

ఒకరు కూల్‌డ్రింక్ తేబోగా వారించాను.

"నువ్విక్కడ ఎక్కువసేపు ఉండలేవు. ఊపిరాడదు. పద.."

బై చెప్పి బయటపడ్డాను.

అగ్గిపెట్టెల్లాంటి అపార్ట్‌మెంట్‌లో ఏకంగా కుటుంబాలే కాపురం ఉండటం మరింత ఆశ్చర్యానికి గురయ్యాను.

నా చూపులూ నా మనస్సులో కదుల్తోన్న భావాలూ చదివినట్లుగా అన్నాడు విహాన్. "ఇక్కడుండేవన్నీ మధ్య తరగతి కుటుంబాలే. చెప్పాలంటే వీళ్ళపని చాలా బాగుంది. కొన్ని బస్తీల్లో ఉన్న నిరుపేదల పరిస్థితి చూస్తే నువ్వసలు తట్టుకోలేవు. సిటీలోనే కాదు. పల్లెల్లోనూ అలాగే ఉంది. లోకానికి అన్నం పెట్టే రైతుకి రెండు వేళ్ళూ కూడా నోట్లోకి వెళ్ళడం లేదు. ఆరుగాలం కష్టపడే రైతు అప్పుల విష వలయంలో చిక్కుకుని విలవిల్లాడుతున్నాడు!"

అతడి కళ్ళ నుంచి కన్నీటి బొట్లు బొటబొటా రాలాయి.

"ప్రభుత్వం రుణాలూ, రుణమాఫీలూ, ప్రాజెక్టులూ చాలా చేస్తోందిగా. అయినా వాళ్ళు బాగుపడటం లేదంటే అదంతా వాళ్ళ కర్మ!"

"పాపం అలాగనుకునే సరిపెట్టుకుంటున్నారు. ఆ ప్రాజెక్టులూ, పథకాలూ రైతుల కోసం కాదు కాంట్రాక్టర్ల కోసం. కమీషన్ల కోసం. ఖర్చు వంద. ఉపయోగం పది. అలా ఉంది పరిస్థితి. బడాబడా పారిశ్రామికవేత్తలకూ, వాణిజ్యవేత్తలకూ ఎర్ర తివాచీ పరచి వందల వేల ఎకరాలు అణాకీ అర్ధణాకీ ఇచ్చేస్తారు. పన్నుల్లో, నీటిలో, విద్యుత్తులో రాయితీల మీద రాయితీలు ఇచ్చేస్తారు. బడుగు రైతుల కోసం ఏమీ చెయ్యరు. ఎంతో చేస్తున్నట్టు డ్రామాలాడతారు. భ్రమ కల్పిస్తారు!"

నాకు ఒక్క ముక్కా అర్థం కాలేదు. కానీ అతడి ఆవేశంలో వేదనలో నిజం ఉండి ఉంటుందన్పించింది.

"ప్రతి నాణేనికీ బొమ్మా బొరుసు ఉంటాయిలే" కారు స్టార్ట్ చేస్తూ అన్నాను.

అతడు మౌనంగా ఉండిపోయాడు.

అకస్మాత్తుగా విషాదమూర్తిగా ఎందుకై పోయాడో ఎంతాలోచించినా తోచలేదు. బహుశా అతడి వెనుక సుడిగుండాలో సునామీలో ఉన్నాయేమో పాపం!

**(ఇంకా వుంది)**

# ఆ సినిమా గురించి టెన్షన్ పడుతోందట

**టా**లీవుడ్‌లోకి దూసుకొచ్చిన కుర్ర హీరోయిన్ల ధాటికి తట్టుకోలేక కోలీవుడ్‌కి వెళ్ళిపోయిన సమంత పరిస్థితి అక్కడా అంతంత మాత్రంగానే ఉందట! అక్కడ ఇంతవరకూ నిఖార్సయిన హిట్ కొట్టలేకపోయిన సమంతకు అవకాశాలు అంతంత మాత్రంగానే వస్తున్నాయట! విజయ్‌తో నటించిన 'తెరి' ఫలితం సమంతకు ఓ విధంగా మైనస్ అయింది. ఇక మిగిలింది సూర్యతో చేసిన '24' సినిమా విడుదలకు సిద్ధంగా ఉంది. ఈ సినిమా హిట్ అయితే తప్ప సమంతకు అక్కడ సినిమాలు దక్కే అవకాశాలు ఉండవు. ఈ మధ్యలో రకూల్ అక్కడికి కూడా వచ్చేస్తోంది. ఓ పక్కన నయనతార వరసపెట్టి సినిమాలు చేసేస్తోంది. ఇన్ని ప్రతికూల పరిస్థితుల మధ్య '24' సినిమా ఫలితం ఎలా ఉంటుందో అని సమంత తెగ టెన్షన్ పడుతోందట! టాలీవుడ్‌లో అయితే అందర్నీ మాయ చేయగలిగింది కానీ తమిళ తంబీల దగ్గర ఆ ట్రిక్కులేవీ పనిచేయలేదని సినీ జనాలు అంటున్నారు.



# పుచ్చకాయతో స్పెషల్‌గా...

# వంటలు

మండే ఎండలు. ఉష్ణోగ్రతలు అప్పుడే 40 డిగ్రీలు దాటాయి. ఉక్కపోత, వేడితో శరీరం నీటిశాతాన్ని కోల్పోతుంది. శరీరంలో నీటిశాతాన్ని భర్తీచేసేందుకు నీళ్ళు ఎక్కువగా తాగడంతోపాటు కొబ్బరినీళ్ళు, గ్లూకోజ్ నీళ్ళు తప్పనిసరి. వాటితోపాటు పుచ్చకాయ కూడా చేరిస్తే, వేడికి స్వస్తి పలకవచ్చు. ఎందుకంటే మిగతావాటితో పోలిస్తే పుచ్చకాయలో నీటిశాతం ఎక్కువ. మరి పుచ్చకాయను అలానే తీసుకోవడానికి ఇష్టపడనివారు వీటిని ప్రయత్నించవచ్చు.

## వాటర్‌మెలన్ ఫ్రిజీ



**కావలసిన పదార్థాలు:** పుచ్చకాయ ముక్కలు - 4 కప్పులు, పంచదార - అరకప్పు, చెర్రీ జిలాటిన్ - ఒక కప్పు, పెరుగు - ఒక కప్పు, వేడినీళ్లు - పావుకప్పు

**తయారీ విధానం:** ఒక గిన్నెలో చెర్రీ జిలాటిన్, పంచదార వేసి కలపాలి. ఇందులో వేడినీళ్ళు పోసి పంచదార కరిగేవరకు అలాగే ఉంచాలి. ఈలోపు పుచ్చకాయ ముక్కలను గ్రైండ్ చేసుకోవాలి. ఈ ప్యూరీ జిలాటిన్ మిశ్రమంలో వేసి కలపాలి. ఇందులోనే పెరుగు వేసి కలపాలి. ఈ మిశ్రమాన్ని చిన్న గిన్నెలో పోసుకుని ఫ్రిజ్‌లో పెట్టాలి. గిన్నెలోకి గాలి పోకుండా జాగ్రత్తపడితే తొందరగా గడ్డకడుతుంది. ఇంకేముంది, రుచికరమైన వాటర్‌మెలన్ ఫ్రిజీ మీ నోరూరించక మానదిక!

## పుచ్చకాయ కర్రీ



**కావలసిన పదార్థాలు:** పుచ్చకాయ - పావు ముక్క, కారం - ఒక టీ స్పూన్, పసుపు - కొద్దిగా, ధనియాల పొడి - అర టీ స్పూన్, వెల్లుల్లి పేస్ట్ - అర టీ స్పూన్, నూనె - రెండు టేబుల్ స్పూన్లు, జీలకర్ర - పావు టీ స్పూన్, నిమ్మరసం - రెండు టీ స్పూన్లు, ఉప్పు - అర టీ స్పూన్, చక్కెర - అర టీ స్పూన్

**తయారీ విధానం:** పుచ్చకాయను చిన్న చిన్న ముక్కలుగా కట్ చేసుకోవాలి. అందులో సగం తీసి గ్రైండ్ చేసుకోవాలి. ఆ ప్యూరీని పక్కన పెట్టుకుని, కడాయిలో కొద్దిగా నూనె వేసి జీలకర్ర, పుచ్చకాయ ప్యూరీ, కారం, పసుపు, ధనియాల పొడి, వెల్లుల్లి పేస్ట్, ఉప్పు వేసి సన్నని మంట మీద ఐదు నిమిషాలు అలాగే ఉంచాలి. దీంట్లో పుచ్చకాయ ముక్కలు, చక్కెర, నిమ్మరసం వేసి మరో మూడు నిమిషాలు ఉంచి తరువాత దించేయాలి. టేస్టీ పుచ్చకాయ కూర రెడీ. దీన్ని కుల్చాతో తింటే మరింత టేస్టీగా ఉంటుంది.



## ఫ్రూట్‌చాట్

**కావలసిన పదార్థాలు:** పుచ్చకాయ ముక్కలు - రెండు కప్పులు, పైనాపిల్ ముక్కలు - రెండు కప్పులు, గ్రీన్ యాపిల్స్ - రెండు, పైనాపిల్, యాపిల్, పుచ్చకాయ జ్యూస్‌లు - అరలీటర్ చొప్పున, జీలకర్ర - ఒక టేబుల్ స్పూన్, చాట్ మసాలా, ఉప్పు, నిమ్మరసం - తగినంత

**తయారీ విధానం:** పైనాపిల్, యాపిల్, పుచ్చకాయ జ్యూస్‌లను వేరువేరుగా మూడు గిన్నెల్లో పోయాలి. వీటిల్లో జీలకర్ర, చాట్‌మసాలా, ఉప్పు, నిమ్మరసం వేసి కలిపి ఫ్రిజ్‌లో పెట్టాలి. 3 గంటల తరువాత తీసి పండ్ల ముక్కలపై పోయాలి. దీనిపై పుదీనా తరుగు చల్లుకొని తింటే చాలా రుచిగా ఉంటుంది.

## వాటర్‌మెలన్ - స్ట్రాబెర్రీ స్మూతీ

**కావలసిన పదార్థాలు:** స్ట్రాబెర్రీస్ - ఒక కప్పు, పుచ్చకాయ ముక్కలు - రెండు కప్పులు, యాలకులు - 2 లేదా 3, మిరియాల పొడి - చిటికెడు, పంచదార - అర కప్పు, ఐస్‌క్యూబ్స్ - సరిపడా.



**తయారీ విధానం:** ముందుగా పుచ్చకాయను స్ట్రాబెర్రీలను చిన్న ముక్కలుగా కట్ చేసుకోవాలి. వాటిలోని విత్తనాలు తొలగించాలి. తరువాత ఈ పండ్ల ముక్కలను మిక్సీ జార్‌లో వేసి ఒక కప్పు నీళ్ళు పోసి గ్రైండ్ చేయాలి. తరువాత ఈ స్మూతీని ఒక గిన్నెలోకి తీసుకుని బయట అలాగే ఉంచాలి. కొద్దిసేపటి తర్వాత తిరిగి ఈ స్మూతీని మిక్సీజార్‌లో వేసి, స్మూతీతోపాటు ఐస్ క్యూబ్స్, యాలకులు, పంచదార వేసి మరోసారి గ్రైండ్ చేయాలి. తర్వాత దాన్ని సర్వింగ్ గ్లాసులోకి మార్చుకుని చిటికెడు మిరియాలపొడి చిలకరించి కూల్ కూల్‌గా సర్వ్ చేయడమే ఆలస్యం.

# మాతృఋణం

మేడా మస్తాన రెడ్డి

**"ఎటూ నేను పెద్దకర్మ చేస్తున్నాను కదా! నువ్వు కూడా ఖర్చు పెట్టడం ఎందుకు?" అన్నారు బావగారు.**

**మణికంఠ ఆయన చేతులు అందుకున్నాడు.**

**"తల్లికంటే, తండ్రికంటే మా అక్కయ్య నాకు ఎక్కువ. ఆమె నాకు గురువు కూడా. ఆమె తరువాతే మిగతా ఎవరైనా. ఆమెకు పెట్టే ఖర్చు ఒక ఖర్చు కాదు. ఆ సంగతి కూడా మీకు బాగా తెలిసిందే. అక్కయ్య తరువాత ఆమె మాదిరిగా నన్ను ఆదరించి నాకు దిశానిర్దేశం చేసిన వ్యక్తి మీరు".**

బావగారు విచారంగా తల ఊపి, "ఇంత చప్పునే పోతుందనుకోలేదు. డాక్టర్ ప్రమేయం లేకుండా ఇంగ్లీషు మందులు విపరీతంగా వాడేదికదా! కొద్దిపాటి జ్వరం తగిలి, పోయింది. ఏ మందూ పట్టు ఇవ్వలేదు" అన్నాడు.

పక్కనే ఉన్న ఆయన తండ్రి మా మాటల్ని దారి మళ్లించాడు. అప్పటికే మా ఇద్దరికీ గొంతులు బొంగురు పోయాయి. దుఃఖంతో సంభాషణలు అతి కష్టం మీద వెలువడుతున్నాయి.



మణికంఠకు సంబంధించిన సైనికుడి జీవితం మీదికి ఆ ముసలాయన సంభాషణ నడిపించాడు. మణికంఠ ప్రస్తుతం కాశ్మీరు సరిహద్దుల్లో ఉన్నాడు. విధి నిర్వహణలో మెరిటోరియస్ మెడల్ పొందిన వాడు. సెలవుమీద తన స్వగ్రామం వచ్చి అక్కడి నుండి విజయక్కయ్యను చూడడానికి వచ్చాడు. అప్పటికి ఆమె చావుబతుకుల మధ్య ఊగిసలాడుతోంది.

అక్కయ్య అతడికి ప్రాణంలో ప్రాణం. ఒక రకంగా కొంత జీవితం వరకూ అక్కయ్యే అతణ్ణి పెంచింది. పెళ్లయిన తరువాత కూడా తన భర్త సహకారంతో మణికంఠ సైన్యంలో చేరే దిశగా మార్గదర్శనం చేసింది. మణికంఠ జీవితంలో విజయ అక్కయ్యను మినహాయిస్తే అంతా శూన్యమే.

•••

అక్కయ్య!

ఒక మగవాడి అభివృద్ధికి ఆడది చేయూత ఇస్తుందని పెద్దలు చెబుతారు లేదా ఒక పురుషుడి అభివృద్ధి వెనక స్త్రీ హస్తం ఉంటుందంటారు. ఆ చేయి అక్కయ్యదే అంటాడు మణికంఠ.

'అమ్మా విజయా! వాడిని ఇంతకాలం నాకంటే ఎక్కువగా నువ్వే తీర్చిదిద్దావు. పెళ్లి చేసుకుని బెంగళూరు వెళ్లిపోతున్నావు. నీ వెంట తీసుకుపోరాదూ!' అంది అమ్మ.

తన తల్లి ఆ రకంగా అక్కయ్యకు అప్పగింతలు పెట్టగలదని ఊహించలేదు మణికంఠ. ఆమె ఎంతో చొరవగా అక్కయ్యను బతిమాలేటప్పటికి మణికంఠకు మతిపోయింది. పెళ్లి జరిగిన తరువాత కూడా అక్కయ్యకు తన బరువు బాధ్యత అప్పజెప్ప వచ్చునా?

'తమ్ముడూ! నా వెంట

వచ్చెయ్యరా!' అంది అక్కయ్య.

ఆమె ఎడమ చెంపమీద నల్లని బుగ్గచుక్కలా ఉన్న పెసర గింజంత పుట్టుమచ్చను చూస్తూ ఉండి పోయాడు మణికంఠ.

'ఏం, మాట్లాడవు? ఇక్కడ ఉండి నీవు ఉద్ధరించేది ఏమీ లేదు' అంది అమ్మ.

మణికంఠ సిగ్గుపడ్డాడు.

అమ్మ మాట నిజమే. పదో తరగతి వరకూ ఎంత బాగా చదువుకున్నాడో! అతడి జీవితంలో అదే మంచి చదువు. ఇంటర్మీడియట్ మొదటి సంవత్సరంలో చేరాడు. ఇక అంతే సంగతులు. మోతుబరి కుటుంబాల పిల్లలు స్నేహం కట్టారేమో, అతడికి అలవడని అలవాటు లేకుండా పోయింది.

అతనికి చిన్నప్పటినుండి అప్పుడప్పుడు అక్కయ్యతో కలసి ఒకే మంచం మీద పడుకునే అలవాటు. ఇంటర్మీడియట్ మొదటి సంవత్సరం వచ్చేసరికి అతడికి అలా పడుకోవడంలో సంకోచం కలిగింది.

'అక్కయ్యా! నేను చాపవేసుకుని కింద పడుకుంటాను' అన్నాడు ఒకరోజు మణికంఠ నేల చూపులు చూస్తూ.

'ఏం పెద్దవాడివై పోయావా?' అంది అక్కయ్య నవ్వుతూ.

ఆమె నిర్మలత్వం అతడిని మరింత కుంగదీసింది.

'ఇంటర్ పాసయ్యాక వస్తాలే అక్కయ్యా!' మణికంఠ పెదవి విప్పాడు.

అక్కయ్య బావతో బెంగళూరు వెళ్లిపోయింది.

తరువాత మూడు సంవత్సరాలకు మణికంఠ కూడా బెంగళూరు చేరుకున్నాడు. అక్కాబావలు ఎంతో సంతోషించారు. అప్పటికి వాళ్లకు సంతానం కలగలేదు. ఎక్కడలేని మందులూ మింగింది అక్కయ్య. వైద్యపరీక్షలు చేయించుకున్నప్పటికీ సంతానలేమికి కారణం బయటపడలేదు. బావగారు ఒక స్నేహితుడిగా మణికంఠను చేరదీశాడు. మిలటరీ ఆఫీసులో ఆయన ఒక సివిల్ ఉద్యోగి. మణికంఠ జీవితం సరిగ్గా ఇక్కడే మలుపు తిరిగింది.

'ఏం బామ్మర్ది! నీకు దేశసేవలు చేయాలని ఉందా?' అడిగాడు బావగారు.

మణికంఠ నవ్వి, 'ఇప్పుడు నేను అదే చేస్తున్నాను బావగారూ! పరిపూర్ణ మానవులైన అక్కా, బావల సేవలు చేసుకుంటూ ఈ మానవసేవే దేశసేవగా భావిస్తున్నాను' అన్నాడు.

'ఇలాంటి పప్పులు నా దగ్గర ఉడకవు. నిన్ను మిలటరీలో చేర్చి నేను కూడా ఒక దేశభక్తుణ్ణి అవుతాను' అన్నాడు బావగారు.

అక్కయ్య పకపక నవ్వి మా 'తమ్ముడిని గాడిలో పెట్టమంటే రిస్క్‌లో పెడతారా?' అంది.

•••

'అక్కయ్యా! నమస్కారం. కాశ్మీరు సరిహద్దులో ఒక కీలక స్థావరంలో మా కంపెనీ ఉంది. సెక్యూరిటీ విధుల్లో రెండు గంటలకు ఒకసారి సైనికులం మారుతూ ఉంటాం. నన్ను బావగారు సైన్యంలో చేరుస్తానంటే నువ్వు రిస్క్ అన్నావ్. ఇది రిస్క్ కాదక్కయ్యా! చాలెంజ్ జీవితం. ప్రతి క్షణం నిప్పుకణికలతో ఆడుకోవడం. ప్రాణాలు కాపాడుకోవడం. నా వెనక నూటపది కోట్ల మంది భారతీయులు ఉన్నారనుకోవడం ఎంత గర్వకారణమో ఈ సరిహద్దు ప్రదేశానికి వచ్చాక అర్థమైంది. భారతీయులలో కేవలం నావంటి సైనికులు మాత్రమే రక్షణ వ్యవస్థకు ఆధారమయ్యారు.

బావగారికి నా నమస్కారం! నా జీవితానికి మీరిద్దరూ చుక్కాని అందించారు.

-నీ తమ్ముడు

మణికంఠ నుండి ఉత్తరం అందగానే అక్కయ్య జవాబు రాసింది. అతడికి సెలవు ఇస్తే తామంతా కలిసి ఒక ఊరు వెళ్లాలని ప్రతిపాదించింది. మణికంఠ ఆమె ప్రతిపాదనకు కారణం అడిగేవాడు. ఆమె తన ప్రతి ఉత్తరంలో ఎప్పటికప్పుడు సమాధానం దాటవేసేది.

స్వగ్రామానికి మణికంఠ సెలవులలో వచ్చాడు. అదే సమయానికి బెంగళూరు నుండి అక్కయ్య, బావ కూడా వచ్చి చేరుకున్నారు.

'మిలటరీ తిండి నీకు వంట పట్టింది' అంది అక్కయ్య.

'వేళకు తిండి, వేళకు విశ్రాంతి, వ్యాయామం దేనికదే. అన్నివేళలా నిశ్చింత. దేశం కోసం చస్తే ఏం అన్నంత నిశ్చింత. ఇక సర్కారీ వారి తిండి వంటపట్టక ఏం చేస్తుంది?' అన్నాడు మణికంఠ.




**మనకు ఎంతో ఇష్టమైన వాళ్ళు, మనల్ని ప్రేమించే వాళ్ళు, మనం ప్రేమించేవాళ్ళు ఎన్నడూ మనల్ని వీడిపోలేరు. శారీరకంగా వాళ్ళు దూరం కావచ్చు. కానీ మనకు తెలియకుండానే వాళ్ళు దగ్గరవుతారు. మనల్ని మురిపిస్తారు. వాళ్ళ ఋణం తీర్చుకోవడానికి ఓ మంచి అవకాశం మనకిస్తారు. ఈ కథలో మణికంఠకు అలాంటి అవకాశమే లభించింది. శాస్త్రరీత్యా వైద్యుడు కూడా అతడికి అండగా నిలబడ్డాడు! ఇంతకీ ఏమిటా అవకాశం?**

అక్కా, బావా నవ్వారు.

'మనం రేపు ఉదయం అల్లూరు వెళుతున్నాం' అంది అక్కయ్య. మణికంఠకు ఊరి పేరైతే చెప్పింది గానీ కారణం మాత్రం దాచిపెట్టింది అక్కయ్య.

రెండు టాక్సీలలో బృందం బయలుదేరింది. గంటలో ఆ ఊరు చేరుకున్నారు.

'ఎందుకంటే చెప్పరేం?' అడిగాడు మణికంఠ.

'ఈ ఊరు నీకు నచ్చిందా?' అడిగింది అక్కయ్య.

'నచ్చితే...'

'ఈ ఊరి అమ్మాయి కూడా నచ్చుతుందని'.

మణికంఠ తెల్లబోయాడు. బంధువులంతా కలిసి తనమీద వల పన్నినట్టు ఉక్కిరిబిక్కిరి అయ్యాడు.

'సైనికకుట్రలా ఉంది మీ చర్య' నవ్వాడు మణికంఠ.

ఒక మాదిరి డాబాఇంటి ఆవరణలో వాహనాలు ఆగాయి.

ఆ ఇంటి వారి నుండి ఘనస్వాగతం లభించింది.

'నీ ఫొటో వాళ్లు చూశారులే!' అంది అక్కయ్య.

'శత్రుదేశాన్ని మించిపోయావు అక్కయ్యా బరిలోకి దించడంలో!

'అవును'.

'నేను నచ్చానా మరి'.

'ఎవరికోసం? నా తమ్ముడు నవ మన్మథుడు'.

'అంతమాటే! ఈ మూల నుంచి వెంట్రుకలు ఊడిపోవడం మొదలై ఉండకపోతే!' తల ముందుకు వంచాడు మణికంఠ.

'పోతేపోనీ! పాడు వెంట్రుకలు. నీకు మంచి భార్య దొరుకుతుంది'.

'మిలటరీ వాడినని తెలిసి కూడా ముందుకు వస్తున్నారా?'

'నీ ఆయుష్షు మీద వాళ్లకు నమ్మకం ఎక్కువ. మా మాదిరిగానే!'

మాటలకు ముందు విందుభోజనం ఏర్పాటు చేశారు. ఆ ఇంట వంటలూ, కూరలూ, ప్రత్యేకంగా చేపల పులుసు అద్భుతంగా అమరాయి. మణికంఠ పొలస చేపల పులుసుతోనే ఎక్కువ అన్నం తిన్నాడు.

'మరో చేపముక్క....!' అన్నాడు సంశయంగా.



## బాలీవుడ్‌లో తేలిన ఐటెంభామ?

హీరోయిన్ మధురిమ అంటే ఎవరూ గుర్తుపట్టకపోవచ్చు కానీ, ఐటెంగర్ల్ మధురిమ అంటే చాలా మంది గుర్తుపడతారు. టాలీవుడ్‌లో కొన్ని సినిమాల్లో ఐటెంసాంగ్స్‌లో మెరిసినా పెద్దగా గుర్తింపురాలేదు. అటు కోలీవుడ్, మాలీవుడ్‌లలో కూడా సేమ్ పొజిషన్. దాంతో 'నైనా బెనర్జీ'గా పేరు మార్చుకుని బాలీవుడ్‌లో తేలింది. అక్కడ సన్నీలియోన్ సినిమాలో చాన్స్ పట్టేసింది. సన్నీలియోన్ అంటేనే అడల్ట్ కంటెంట్ ఉన్న సినిమా! మరి ఇలాంటి సినిమా ద్వారా బాలీవుడ్‌లోకి అడుగుపెడుతోంది అంటే..... అలాంటి సినిమాలు చేయడానికి నేను రెడీ అంటూ దర్శకనిర్మాతలకు పరోక్షంగా సిగ్నల్స్ ఇచ్చినట్టేనని బాలీవుడ్ జనాలు అంటున్నారు. ఏదో విధంగా బాలీవుడ్‌లోనైనా నిలదొక్కుకుంటే చాలన్న అభిప్రాయం మధురిమలో గట్టిగా ఉంది అంటున్నారు ఆమె సన్నిహితులు.

'బాగుందా?' అంది అక్కయ్య అక్కడున్న వారిలో ఒక యువతిని చూపిస్తూ.

'చాలా బాగుంది!'

కాబోయే బంధువుల మొహాలు వికసించాయి. మణికంఠ తన చేతులు కడుక్కుంటూంటే ఆ ఇంటి యజమాని అతడిని సమీపించి, 'సంతోషం నాయనా! మా అమ్మాయి నీకు నచ్చినందుకు' అన్నాడు.

మణికంఠ ఆశ్చర్యపోయాడు. వాళ్ళమ్మాయిని తాను ఎప్పుడు చూశాడు? ఎప్పుడు బాగుందన్నాడు? తాను బాగుంది అన్నది చేపలపులుసు కదా! అతడికి అంతా అయోమయమే. ఎవరిని అడుగుదామన్నా వాళ్లందరూ అప్పటికప్పుడు పెళ్లి జరిగిపోతోందన్నంత ఆనందంలో ఉన్నారు. అతడికి కూడా వాళ్ల సంతోషాన్ని భగ్నం చేయాలనిపించలేదు.

ఏమైతేనేం పెళ్లి జరిగిపోయింది. ఒక అనుకూలవతితో మణికంఠ సంసార జీవితం ప్రారంభమయింది.

'అక్కా! నా జీవితాన్ని ఈ దశలో కూడా చక్కటి మలుపు తిప్పావు' అన్నాడు మణికంఠ కృతజ్ఞత నిండిన కళ్లతో.

ఏడాదికే మణికంఠ భార్య గర్భవతి అయ్యింది. ఆమెకు మరో నెలలో ప్రసవం రానున్నదనగా ఎప్పుడూ ఉత్తరం రాయని బావగారు అతడికి ఉత్తరం రాశాడు.

సరిహద్దులో ఉండగా ఆ ఉత్తరం మణికంఠకి అందింది. అక్కయ్య నెలతప్పిందని ఆ ఉత్తరం సారాంశం. అతడి సంతోషం ఇంతా అంతాకాదు. అక్షర రూపంలో తన అక్కయ్యకు తన సంతోషాన్ని అందిస్తూ, 'ఇక మీదట ఈ తమ్ముణ్ణి నువ్వు మన్నించి మాట్లాడాలి సుమా! పిల్లలను కనడంలో నీకంటే నేను ఎనిమిది నెలలు సీనియర్‌ని' అని రాశాడు.

●●●

'నాయనా మణికంఠా! అటు నుండి బెంగళూరు వెళ్లి ఒకసారి అక్కయ్యను చూసి రారా!' అంటూ అమ్మ ఫోన్ చేసింది. ఆ సమయంలో కడుపుతో ఉన్న తన కోడలిని చూసేందుకు చిత్తూరుకు వెళ్లి ఉన్నాడు మణికంఠ. తల్లి చేసిన ఫోన్ కాల్‌లో అతడికి ఆందోళనా స్వరం వినిపించింది.

'ఏమిటమ్మా! ఏమయ్యిందమ్మా!' అడిగాడు మణికంఠ.

●●●

మణికంఠకు చివరిచూపులు దక్కాయి. అక్కయ్య కొన ఊపిరితో ఉంది. ఆమె శరీరం మితిమీరిన ఔషధాల వినియోగంతో విషపూరితం అయిపోయింది. అరవై సంవత్సరాలకే ఆమె పండు ముదుసలిగా మారిపోయింది. శరీరం నేవళం కోల్పోయింది.

'అక్కా! అక్కా!' మణికంఠ గొల్లుమన్నాడు.

అక్క అతడిని దగ్గరకు తీసుకుని, 'ఎందుకురా ఏడుస్తావు? ఎలా ఉందిరా నీ కోడలి ఆరోగ్యం?' అంది.

'మీ ఇద్దరి ఆశీర్వచనం అక్కా! బాగుంది'.

ఆమె విచారంగా చూసింది. ఆమె ఒక్కగానొక్క కొడుకు అమెరికాలో ఉన్నాడు. తుఫాను బీభత్సం వలన విమానాలు రద్దయ్యాయి. మరో రెండు వారాల వరకూ అతడు అక్కడినుండి బయలుదేరే పరిస్థితి లేదు.

'నీకేమీ కాదక్కా! నువ్వు కోలుకుంటావ్'.

ఆమె దీనంగా నవ్వి, 'మీ బావ అమెరికా వెళ్లనంటున్నారు. ఇక్కడ ఎక్కడ ఉంటారు? కాఫీ కాచుకోవడం కూడా రాదు ఆయనకి' అంది.

ఆమె చేతులు అందుకుని, 'అక్కా! నేను మాత్రం నీ బిడ్డను కానా? ఒకే తల్లి కడుపున పుట్టకపోయినా నువ్వు నన్ను ఆదరించిన తీరు మరచిపోయాననుకుంటున్నావా? అమ్మలా పెంచిన నువ్వు నన్ను ఆజ్ఞాపించలేవా? బావగారిని నా తండ్రిలా కాపాడుకోలేనా? అన్నాడు మణికంఠ.

ఆమె కళ్లు ఒక్కసారిగా వెలిగాయి. అదే చివరి వెలుగు.

●●●

'అక్కయ్య పెద్దదినం ముగించాడు మా బావ. ఘనంగా జరిపాం. యశోదమ్మ ప్రేమను మనసులోనే దాచుకున్న నల్లనయ్యకి ఉన్న స్థితప్రజ్ఞత నాకు లేదు. అఖండ భజన కార్యక్రమంతో, వస్త్రదానాలతో ఊరంతా మారుమోగింది" అన్నాడు మణికంఠ.

స్నేహితులు అతడి భుజాలు తట్టారు.

కార్యక్రమం ముగిసింది. కానీ బావగారు నీరసించిపోయారు. ఆయనకి వైద్య సహాయం అందించి తన ఇంటికి చేర్చాడు మణికంఠ.

●●●

సరిగ్గా ఐదు నెలల తరువాత మణికంఠ కోడలు ఆడపిల్లను ప్రసవించింది. ఆశ్చర్యం! ఆ పాప ఎడమబుగ్గ మీద నల్లని పెసర గింజంత పుట్టుమచ్చ ఉంది. "ఇది సాధ్యమే! ఒక్కొక్కప్పుడు లాజిక్కుకు అందని రహస్యం దేన్నో శాస్త్రం విప్పుతుంది. అదే సృష్టి వైచిత్రి. మీ కోడలు గర్భంలోని శిశువు ఊపిరి పోసుకున్నరోజు మీ అక్కయ్య ఆఖరి శ్వాస విడిచినరోజు ఒక్కటే" అన్నాడు Foetal Medical Specialist (పిండ నిర్ధారణ వైద్య నిపుణుడు), ఎదురుగా కూర్చున్న మణికంఠతో.

**సెల్: 94413 44365**




**లంకలో హనుమ అల్లరినీ, వానరసైన్యంతో రాముడు లంకపైకి దండెత్తి వచ్చే అవకాశాన్నీ సభాసదులకు వివరించాడు రావణుడు. వివరించి, అన్నీ సమగ్రంగా చర్చించమన్నాడు. చర్చించి, తాను ఎలాంటి నిర్ణయం తీసుకుంటే బాగుంటుందో తెలియజేయమన్నాడు. అలాగే అన్నారంతా. మహారాజు మనసు తెలిసి, మంత్రులూ, ముఖ్యులూ మాట్లాడితే తమ్ముడు విభీషణుడు మాత్రం అందుకు భిన్నంగా మాట్లాడాడు. తప్పు నీదేనంటూ రావణుణ్ణి వేలెత్తి చూపించాడు. అనర్థాలన్నిటికీ ఒకే ఒక్క పరిష్కారం, సీతను రామునికి అప్పగించడమే అన్నాడు. అందుకు అంగీకరించలేదు రావణుడు. సీతను తిరిగి ఇవ్వడం జరగదుగాక జరగదన్నాడు. ఆనాటికి సభ చాలించి వెళ్ళిపోయాడతను. రాజమందిరానికి చేరుకున్నాడు.**

# విభీషణుని వేడుకోలు:రావణుని దురాగ్రహం

మందిరంలో ఒంటరిగా, అసహనంగా పచార్లు చేస్తున్న రావణుని దగ్గరకు చారులు రహస్యంగా వచ్చారు. చెప్పారిలా.

"ప్రభూ! అపార వానరసైన్యంతో రాముడు దక్షిణ సముద్రతీరంలో విడిది చేశాడు."

చెప్పిన చారులను తీక్షణంగా చూశాడు రావణుడు. వెనువెంటనే చూపులు మరల్చుకున్నాడు. వెళ్ళమన్నట్టుగా సైగ చేశాడు. వెళ్ళిపోయారు వారు.

ఆలోచనలో పడ్డాడు రావణుడు.

పది మాసాలైనా సీత లోబడలేదు. పైగా సీతను అపహరించి తప్పు చేశావంటూ విభీషణాదులు వేలెత్తి చూపిస్తున్నారు. ఈ స్థితిలో సైన్యంసహా రాముడు సముద్రతీరానికి చేరుకున్నాడని వార్త.

భరించలేకపోయాడు రావణుడు. ఆందోళన చెందాడు. మరోసారి మంత్రులతోనూ, ముఖ్యులతోనూ, సేనానాయకులతోనూ సమావేశాన్ని ఏర్పాటు చేయడం మేలనిపించింది అతనికి. ఆహ్వానించాడు అందరినీ.

నగర కీలక ప్రదేశాల్లోనూ, సభాభవనం చుట్టుపక్కలా ప్రహస్తుడు ముందు జాగ్రత్త చర్యగా సైనికుల పహారా ఏర్పాటు చేశాడు. రథం మీద వస్తూ దానిని గమనించాడు రావణుడు. మనసులోనే మెచ్చుకున్నాడతన్ని. సభాభవనం ముందు రథం దిగి, గంభీరంగా లోనికి ప్రవేశించాడు రావణుడు. నేరుగా వెళ్ళి వజ్ర వైడూర్యాలు పొదిగిన స్వర్ణసింహాసనాన్ని అధిష్ఠించాడు.

మహారాజు పాదాలకు నమస్కరించి, తమ తమ స్థానాలను అలంకరించారు సభాసదులు. దృష్టి అంతా ప్రభువుపైనే కేంద్రీకరించి, అతను చెప్పేది వినేందుకు చెవులు రిక్కించారు.

రావణుడు లేచి నిలబడ్డాడు. ఒక చేత్తో మరొక చేతిని నిమురుకుంటూ అన్నాడిలా.

"రాక్షసప్రముఖులారా! మీరు ప్రచండవీరులు. శూరులు. మిమ్మల్ని కాదని నేను ఎలాంటి పనీ చెయ్యలేదు, చెయ్యను కూడ. మీకు తెలిసే ఉంటుంది. మహాసౌందర్యరాశి సీతను నా భార్యగా చేసుకునేందుకు నేను అపహరించాను. లంకకు తీసుకుని వచ్చాను. దురదృష్టం. ఆమె ఇంత వరకూ నా సొంతం కాలేదు. కారణం తన భర్త రాముడు విడిపిస్తాడని ఆమెకు ఓ భ్రమ. పైగా తాను నా సొంతం అయ్యేందుకు ఓ సంవత్సరం గడువు కోరింది. సీత కోరితే కొండ మీది కోతినైనా తీసుకుని వస్తాను. అలాంటిది ఓ సంవత్సర కాలం గడువు కోరితే కాదంటానా? సరేనన్నాను."

"ఆడది కోరితే కాదనడం రాక్షసజాతిలోనే లేదు. అందులోనూ మీరు మహారాజులు. మీకు చెప్పాలా?" అన్నారు సభాసదులు. నవ్వారు.

ఆ నవ్వులు రుచించలేదు రావణుడికి. 'ఊc' అని గర్జించాడు. అది హెచ్చరికగా భావించి, సభాసదులు నవ్వడాన్ని ఆపుకున్నారు. రావణుడు మళ్ళీ అన్నాడిలా.

"మొన్న రామదూతనంటూ ఓ కోతి ఈ లంకకు వచ్చింది. కలవరం సృష్టించి కనుమరుగైంది. ఆ సంగతి మీకు తెలుసు. మీకు తెలియనిది ఒకటి ఉంది. అదేమిటంటే... మనతో యుద్ధం చేసేందుకు రాముడు వానరసైన్యాలుసహా సముద్రతీరంలో విడిది చేశాట్ట! ఇది ఇప్పుడే అందిన వార్త. వీటన్నిటినీ దృష్టిలో పెట్టుకుని మనం ఇప్పుడు ఓ నిర్ణయానికి రావాలి."

"ఆజ్ఞ! మీరేం చెబితే అది చేస్తాం." అన్నారు సభాసదులు. గోలగోలగా వినవచ్చాయి ఆ మాటలు.

"ఇప్పటి వరకూ ప్రతి యుద్ధంలోనూ మనమే గెలిచాం. ఓటమిగాని, శత్రువుకి తలవంచడంగాని చెయ్యలేదు. ఈ స్థితిలో నా ఆలోచనకు భిన్నంగా సీతను రాముడికి అప్పగించడంగానీ, అతనిని నేను శరణు వేడడంగానీ జరగదు. అదలా ఉంటే... రామలక్ష్మణులు సముద్రాన్ని దాటగలరా? దాటగలిగి, ఇక్కడకు రాగలరా? వచ్చిన పక్షంలో మనతో పోరాడగలరా? పోరాడి విజయాన్ని సాధించగలరా?

ఈ విషయాలన్నీ గణనకు తీసుకుని, బాగా ఆలోచించండి! ఆలోచించి మీ మీ అభిప్రాయాలను నాకు తెలియజేయండి." చెప్పాడు రావణుడు. కూర్చున్నాడు.

ఆలోచనలో పడ్డారంతా. నిశ్శబ్దంగా ఉంది వాతావరణం.

ఆ నిశ్శబ్దంలోంచి ఓ పిలుపు వినవచ్చింది.

"అన్నా"

అంతా అటుగా చూశారు. కుర్చీలోంచి లేచి నిల్చున్నాడు రావణుని పెద్ద తమ్ముడు కుంభకర్ణుడు. అతని తల సభామండపం పైకప్పును తాకుతోంది. అంత పొడవున ఉన్నాడతను. తల వంచి కిందికి... రావణుణ్ణి చూస్తూ అన్నాడిలా.

"అన్నా! ఏ రాజైతే ముందుగా తప్పొప్పులు ఆలోచించి కార్యోన్ముఖుడవుతాడో ఆ రాజు కష్టనష్టాలకు గురికాడంటారు. అది రాజనీతి. నువ్వు ఎవరిని సంప్రదించి, ఎవరితో యోచించి, సీతను అపహరించావు? ముందు ఆ సంగతి తేల్చు."

రావణుని దగ్గర సమాధానం లేదు. తెల్లమొహం వేశాడతను.

"సీతను అపహరించేవేళ రాముడికి నువ్వు చిక్కకపోవడం నీ అదృష్టం. లేకపోతే అప్పుడే హతమైపోయేవాడివి. సీతను అపహరించి తప్పు చేశావన్నా! అది మంచిపని కాదు. రాముడు నీకు శత్రువైతే అతనితో పోరాడి, అతన్ని జయించి, వీరుడిగా నువ్వు సీతను తెచ్చిన పక్షంలో ఆమె ఆనందించేది. తనంత తానుగా నీకు భార్యయి ఉండేది. నువ్వు అలా చెయ్యలేదు. అంతా తలక్రిందులుగా చేశావు. అందుకే ఇప్పుడు ఇన్ని బాధలు." చెప్పాడు కుంభకర్ణుడు.

తల వంచుకున్నాడు రావణుడు. ఎంతసేపటికీ తలెత్త లేదు. ఆలోచించి అప్పుడిలా అన్నాడు కుంభకర్ణుడు.

"అన్నా! నిన్ను నిందించి, నీ మనసు గాయపరచడం నాకిష్టం లేదు. అయిందేదో అయిపోయింది. మంచే జరిగిందో చెడే జరిగిందో జరిగిపోయింది. నువ్వు కష్టంలో ఉన్నావు, కష్టంలో ఉన్న అన్నను విడిచిపెట్టి వెళ్ళిపోవడం తమ్ముడికి ధర్మం కాదు. అందుకని నిన్ను నేను విడిచిపెట్టను. ఎక్కడికీ

**తనంత తానుగా వరించనిపక్షంలో నువ్వే బలవంతంగా సీతను ఎందుకు వశపరుచుకోలేకపోతున్నావు? అని సంశయం వ్యక్తం చేశాడు మహామంత్రి మహాపార్శ్వుడు. మంత్రులూ, సేనానాయకులతో జరుగుతున్న సమావేశంలో ఎదురైన ఆ ప్రశ్నకు రావణుడు చేతులు నలుచుకుంటూ నా విషాదగాథ ఏమని చెప్పను? చెప్పడానికి నోరు రావడం లేదు అన్నాడు. రావణుడంతటి రాక్షసవీరునికి విషాదగాథా?**

వెళ్ళను. నీ కోసం రామలక్ష్మణుల్నీ, వారి సైన్యాన్నీ మట్టుబెట్టి విజయం సాధిస్తాను. తలెత్తి పైకి చూడు."

చూశాడప్పుడు రావణుడు. అతని కళ్ళలో ఆనందం వెల్లి విరిసింది. మహారాజు కళ్ళల్లో ఆనం దాన్ని చూసి సంతోషించాడు మంత్రి మహా పార్శ్వుడు. అన్నాడిలా.

"మహారాజా! ఈ రాక్షసులను ఆ నరులూ వాన రులూ జయించడం కల్ల. వజ్రాయుధం ధరించి దేవేంద్రుడూ, దేవతలూ వచ్చినా నిన్ను జయించడం వారి తరం కాదు. కుంభకర్ణుడు, ఇంద్రజిత్తు, నేనూ ఉండగా మీ మీద ఈగ కూడా వాలలేదు. రామలక్ష్మ ణుల సంగతి మాకొదిలేయండి, మేం చూసుకుంటాం."

"బలే" అన్నాడు రావణుడు. మోకాలిపై చేయి ఉంచి, నిమిరాడు.

"నాదో చిన్న సంశయం మహారాజా" అడిగాడు మహాపార్శ్వుడు.

"అడుగు"

"తనంత తానుగా నిన్ను సీత వరించని పక్షంలో నువ్వే ఆమెను బలవంతంగా ఎందుకు వశపరచు కోలేకపోతున్నావు? కారణం ఏమిటి?"

ఏం చెప్పాలి? ఎలా చెప్పాలి?

రావణుడు ఒక్క క్షణం కిందుమీదులయ్యాడు. శాపాన్ని తలచుకుని దుఃఖితుడయ్యాడు.

"నా విషాదగాథ ఏం చెప్పమంటావు? చెప్పడా నికి నోరు రావడం లేదు." అన్నాడు రావణుడు. చేతి వేళ్ళు నలుచుకున్నాడు. చెప్పాడిలా.

"బ్రహ్మసభలో నాట్యం చేసేందుకు అప్సరస్త్రీ పుంజికస్థల ఒకనాడు ఆకాశమార్గాన పోతోంది. వయ్యా రాలు పోతూ నడుస్తోంది. ఆమెను చూసి కామోన్మ త్తుణ్ణయ్యాను. కోరిక అణచుకోలేకపోయాను. కౌగిట బంధించి ఆమె శీలాన్ని హరించాను. అది తెలుసు కున్నాడు బ్రహ్మ. నాపై ఆగ్రహించాడు.

'రావణా! నేటి నుండి నిన్ను కామించని స్త్రీపై నువ్వు అత్యాచారం చేశావో, నీ తల వేయి ముక్కలవు తుంది' అని శపించాడు. అదిగో! ఆ శాపం కారణం గానే నేను సీతను దూరంగా ఉంచాను."

పాపం అన్నారు రాక్షసప్రముఖులు. రావణుని పట్ల జాలి చెందారు.

"నన్ను ఎదిరించగల వీరులు లోకంలో లేరు. ఇంద్ర వరుణులు కూడా నన్ను ఎదుర్కోలేరు. అలాంటిది రాముడు నన్ను ఎదుర్కొని ప్రాణాలతో ఉంటాడా? జర గని పని! నాతో యుద్ధం అంటే... ప్రాణాలను కోల్పో వడమే! ఆ సంగతి త్వరలోనే రాముడు తెలుసు కుంటాడు. తెలియజేస్తాను." అన్నాడు రావణుడు.

అతనిని అభినందిస్తూ సభాసదులంతా కరతాళ ధ్వనులు చేశారు. రాక్షసరాజుకి జై అంటే జై అన్నారు.

అరుస్తూ, చప్పట్లు చరుస్తున్న రాక్షసప్రముఖుల్ని చూసి జాలి చెందాడు విభీషణుడు. వారి అవివేకా నికి కళ్ళు చెమర్చుకున్నాడు. ఆగండి! ఆగండి అన్న ట్టుగా చేతులూపి, అందరినీ మౌనం వహించమని ప్రార్థించాడు. అతని ప్రార్థనకి అంతా మౌనం వహిం చారు. తనని అసహనంగా చూస్తున్న రావణునికి చేతులు జోడించి నమస్కరించాడు విభీషణుడు.

"అన్నా! సీతాసాధ్వి అయిదు పడగల విషసర్పం. ఆ సర్పాన్ని కావాలని లంకకు తెచ్చి తప్పు చేశావు. నీ తప్పు నిన్నే కాదు, యావత్తు రాక్షసజాతినీ కబ ళించేట్టుగా ఉంది. జాగ్రత్తపడు! పర్వతాల్లాంటి శరీ రాలతో, కోరలూ, గోళ్ళూ ఆయుధాలుగా కలిగిన అసంఖ్యాక వానరవీరులు లంకను అతలాకుతలం చేయక ముందే సీతను రాముడికి అప్పగించు." అన్నాడు విభీషణుడు.

తమ్ముడి మాటను కొట్టి పారేసినట్టుగా విసుక్కు న్నాడు రావణుడు. అయినా విభీషణుడు మాట్లాడడం మానలేదు.

"మరో సంగతి చెబుతున్నాను, వినన్నా! మాట వరుసకే వానరవీరుల సాయం. రాముడికి ఎవరి సాయమూ అక్కరలేదు. వాయువేగాలైన రామ బాణాలు రాక్షసజాతిని తుదముట్టించక ముందే సీతను రామునికి సమర్పించి శరణు వేడుకో! అది నీకూ, మాకూ అందరికీ మంచిది."

మానవులు. వారిని మనలో ఏ ఒక్కడైనా గెలిచి తీరుతాడు. అందులో సందేహం లేదు. ఇంద్రుణ్ణి గెలిచినవాణ్ణి. ఐరావతం కోరలు పెరికినవాణ్ణి. నేను చాలనా, కోతిమూకను చీల్చి చెండాడడానికి?"

"చాలవు నాయనా, చాలవు. నువ్వు తెలియక మాట్లాడుతున్నావు. బ్రహ్మదండ యమదండ సమానా లైన రామబాణాల్ని భరించడం నీ తరం కాదు. ఇలా అంటున్నానని నన్ను మరోలా అనుకోకు." అన్నాడు విభీషణుడు. ఇంద్రజిత్తును ప్రేమగా దగ్గ రగా తీసుకోబోయాడు. విదిలించుకుని దూరంగా జరిగాడతను. తనని చీకొట్టినా, అసహ్యించుకున్నా కావాల్సింది ఒకటే! రాక్షసజాతిని కాపాడడం అను కున్నాడు విభీషణుడు.

అందుకే రావణునితో మళ్ళీ అన్నాడిలా.



"విభీషణా" గట ్టిగా అరిచాడు రావణుడు. నిప్పు లుమిసేటట్టుగా చూశాడతన్ని.

అయినా భయపడలేదు విభీషణుడు. చెప్పదలచు కున్నది స్పష్టంగా చెప్పాలనే పట్టుదలతో ఉన్నాడతను.

"అన్నా! కుంభకర్ణ, అతికాయ, మేఘనాథులు గానీ, ప్రహస్త, మహాపార్శ్వులుగానీ, నేనుగానీ, నువ్వు గానీ ఎవరూ రాముణ్ణి జయించలేరు. ఇది నిజం." అన్నాడు కుంభకర్ణుడు.

ఆ మాటలకి ఆగ్రహావేశాలతో కుతకుతలాడి పోయాడు ఇంద్రజిత్తు. దుర్గంధాన్ని వెదజల్లుతున్న పెంటకుప్పను చూసినట్టుగా విభీషణుణ్ణి చూశా డతను. రగిలిపోతున్న తండ్రిని చూశాడు. అన్నాడిలా.

"తండ్రీ! బల విక్రమ సాహసాలకు పేరు గాంచిన మన వంశానికి అప్రతిష్ట కలిగించేందుకే నీ తమ్ముడు ప్రయత్నిస్తున్నాడు. చాలు! ఆయన్ని ఇక వదరొద్దని చెప్పు. రామలక్ష్మణులు! ఇద్దరూ

"అన్నా! ఇది నేను నీ హితం కోరి త్రికరణ శుద్ధిగా చేస్తున్న ప్రార్థన. దయచేసి ఆలకించు. అమూల్య రత్నాభరణాలు, ధనాలుసహా సీతా సాధ్విని రామునికి అప్పగించు. అందరం సుఖపడతాం. లేదంటే కోరి కోరి ప్రమాదాన్ని కొని తెచ్చుకోవడమే అవుతుంది. ఆలోచించు. నన్నర్థం చేసుకో."

"ద్రోహీ" గట్టిగా అరిచాడు రావణుడు. తమల పాకులూ, సుగంధద్రవ్యాలతో నిండిన సేవకురాలి చేతిలోని బంగారుపళ్ళాన్ని అందుకుని, దానిని చక్రంలా విభీషణునిపైకి ప్రయోగించాడు. తప్పుకున్నాడు కాబట్టి విభీషణుడు బతికిపోయాడు. లేదంటే తల తెగిపోయేది. విభీషణుడు తప్పించుకోవడంతో పళ్ళెం వెళ్ళి సభామండపం గోడకి తగిలి కింద పడింది. చిత్రంగా పెద్దగా శబ్దించింది. బంగారం శబ్దించ డాన్ని విని ఆశ్చర్యపోయారంతా.

**-అరణి**




ఏప్రిల్ 27 నుంచి
మే 3 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



**మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)**

అదనపు ఆదాయం పొదుపు పథకాలు, ఫీజుల చెల్లింపులు, షాపింగ్‌పై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరంగా ఉంటుంది. పెద్దల సహకారంతో ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు. సంకల్పం ఫలిస్తుంది. 30,1, తేదీల్లో పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. ప్రియతముల కోసం ఖర్చులు అంచనాలు మించుతాయి. ఆర్థికపరమైన సమావేశాలు, బృందకార్యక్రమాలు ఫలిస్తాయి. 2,3 తేదీల్లో దీర్ఘకాలిక పెట్టుబడులు లాభిస్తాయి. సినీ, రాజకీయ రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం.



**వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)**

వేడుకలు, సమావేశాలు, వృత్తి, వ్యాపారాలు, ఆర్థిక నిర్ణయాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో సమావేశాలు, వేడుకల్లో పాల్గొంటారు. ఒక సమాచారం ఉల్లాసం కలిగిస్తుంది. సంకల్పం ఫలిస్తుంది. 30,1 తేదీల్లో పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. వృత్తి, వ్యాపారాల్లో కొత్త ప్రయోగాలకు తగిన సమయం కాదు. ప్రముఖులను కలుసుకుంటారు. గౌరవ, మర్యాదలు అందుకుంటారు. 2,3 తేదీల్లో సమావేశాలు, బృందకార్యక్రమాలకు సంబంధించి కీలక నిర్ణయాలు తీసుకుంటారు. ఆర్థికంగా ప్రోత్సాహకరం.



**మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)**

దీర్ఘకాలిక పెట్టుబడులు, ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలు, గృహనిర్మాణ పనులు, వేడుకలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో ఉత్సవాలు, సంస్మరణల్లో పాల్గొంటారు. రుణప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం 30,1 తేదీల్లో సమావేశాల్లో మాటపడాల్సి వస్తుంది. సినీ, రాజకీయ రంగాల వారికి ప్రోత్సాహ కరంగా ఉంటుంది. దూరంలో ఉన్న బంధుమిత్రులను కలుసుకుంటారు. 2,3 తేదీల్లో రాజకీయ, సినీరంగ ప్రముఖులను కలుసుకుంటారు. గౌరవ మన్ననలు పొందుతారు. వృత్తి, వ్యాపారాల్లో గత అనుభవం వల్ల లబ్దిపొందుతారు.



**కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)**

సమావేశాలు, పెట్టుబడులు, షాపింగ్, వేడుకలు, విద్యా సంస్థలతో పనులపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో శ్రీవారు, శ్రీమతి విషయంలో శుభపరిణామాలు సంభవం. వేడుకల్లో పాల్గొంటారు. స్పెక్యులేషన్లు లాభిస్తాయి. 30,1 తేదీల్లో ఆర్థిక విషయాల్లో ఆచితూచి వ్యవహరించాలి. డబ్బు విషయంలో సన్నిహితులు మొహమాట పెట్టే అవకాశం ఉంది. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 2,3, తేదీల్లో ఆర్థిక విషయాల్లో సంకల్పం ఫలిస్తుంది. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. పెట్టుబడులకు సంబంధించిన సమాచారం అందుకుంటారు.



**సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)**

ప్రముఖులతో సమావేశాలు, కొత్త ప్రాజెక్టులు, అదనపు ఆదాయం కోసం ప్రయత్నాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది. 30,1 తేదీల్లో శ్రీవారు, శ్రీమతి వైఖరి ఆవేదన కలిగిస్తుంది. పరువు, ప్రతిష్ఠలకు భంగం వాటిల్లే ప్రమాదం ఉంది. ప్రముఖులను కలుసుకుంటారు. 2,3 తేదీల్లో పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది. వృత్తి వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరం. లక్ష్య సాధనలో పూర్వ అనుభవం ఉపయోగపడుతుంది.



**కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)**

సమావేశాలు, దూరప్రయాణాలు, ఇంటర్వ్యూలు, వృత్తి, వ్యాపారాలకు సంబంధించిన అంశాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో విద్యార్థులకు శుభప్రదం. ప్రేమానుబంధాలు బలపడతాయి. ప్రియతముల నుంచి కీలక సమాచారం అందుకుంటారు. 30,1 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో అంచనాలు ఫలించకపోవచ్చు. సమావేశాలకు ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది. వేడుకల్లో పాల్గొంటారు. 2,3 తేదీల్లో శ్రీవారు, శ్రీమతి విషయంలో శుభపరిణామాలు సంభవం. భాగస్వామ్యాలు లాభిస్తాయి.



**తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, సంస్మరణలు, బ్యాంకులు, ఆర్థిక సంస్థలతో పనులు, షాపింగ్, బోనస్‌లపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో గృహరుణాలు మంజూరవుతాయి. ఇంటికోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. ఆర్థిక విషయాలను సమీక్షించుకుంటారు. 30,1 తేదీల్లో ఆర్థిక విషయాల్లో ఆచితూచి వ్యవహరించాలి. చిన్నారులు, ప్రియతముల ఆరోగ్యం కలవరపెడుతుంది. 2,3 తేదీల్లో వైద్య, హోటల్, పరిశ్రమల రంగాల వారు చక్కటి ఫలితాలు సాధిస్తారు. ఆర్థిక విషయాల్లో సహోద్యోగుల సహకారం లభిస్తుంది.



**వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)**

వేడుకలు, జనసంబంధాలు, సమావేశాలు, ఆర్థిక వ్యవహారాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. కీలక సమాచారం అందుకుంటారు. కాంట్రాక్టులు అగ్రిమెంట్లు ఫలిస్తాయి. 30,1 తేదీల్లో కుటుంబ సభ్యుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. వేడుకల్లో అసౌకర్యం కలిగే అవకాశం ఉంది. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారు ఆచితూచి వ్యవహరించాలి. 2,3 తేదీల్లో చిన్నారులు, ప్రియతముల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. స్పెక్యులేషన్లు లాభిస్తాయి. వివాహ నిర్ణయాలకు అనుకూల సమయం.



**ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)**

ఆరోగ్యం, బీమా, వృత్తిపరమైన సమావేశాలు, ప్రముఖుల కలయిక. ఉద్యోగ వ్యవహారాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. వృత్తి, వ్యాపారాల్లో అదనపు ఆదాయం లభిస్తుంది. హోటల్, వైద్యం, రిటైల్ రంగాల వారికి శుభప్రదం. 30,1 తేదీల్లో స్టేషనరీ, ఏజెన్సీలు, రవాణా, మార్కెటింగ్ రంగాల వారికి వృత్తి, వ్యాపారాల్లో నిరుత్సాహకరం. సన్నిహితుల ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపిస్తారు. 2,3 తేదీల్లో విందు వినోదాల్లో పాల్గొంటారు. రియల్ ఎస్టేట్, గృహనిర్మాణ రంగాల వారికి ప్రోత్సాహకరం.



**మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)**

వేడుకలు, ప్రేమానుబంధాలు, పెట్టుబడులు, వృత్తిపరమైన సమావేశాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో విద్యార్థులకు శుభప్రదం. ప్రేమానుబంధాలు బలపడతాయి. పొదుపు పథకాలు లాభిస్తాయి. 30,1 తేదీల్లో పెట్టుబడుల్లో నిదానం అవసరం. ప్రియతముల కోసం ఖర్చులు అంచనాలు మించుతాయి. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. బ్యాంకులు, ఫైనాన్స్ రంగాల వారికి శుభప్రదం. 2,3 తేదీల్లో విద్యార్థులు సత్ఫలితాలు సాధిస్తారు. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లకు అనుకూల సమయం. ఒక సమాచారం ఉల్లాసం కలిగిస్తుంది. లక్ష్యాలు సాధిస్తారు.



**కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)**

కుటుంబ విషయాలు, బదిలీలు, మార్పులు, గృహరుణాలు, విద్యా విషయాలకు ఈ వారం అనుకూలం. బుధ, గురు, శుక్రవారాల్లో వారసత్వ విషయాలకు అనుకూలం. గృహారంభ ప్రవేశాలకు అనుకూలం. కుటుంబ వ్యవహారాలు ఒక కొలిక్కి వస్తాయి. 30,1 తేదీల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి నిరుత్సాహకరంగా ఉంటుంది. బదిలీలు అసౌకర్యం కలిగిస్తాయి. కుటుంబంలో శుభపరిణామాలు చోటుచేసుకుంటాయి. 2,3 తేదీల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. గృహనిర్మాణానికి అవసరమైన నిధులు లభిస్తాయి.



**మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, విద్యా సంస్థలతో పనులు, వేడుకలు, ఇంటర్వ్యూలు, సమావేశాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. సన్నిహితుల సహకారంతో ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు. 30,1 తేదీల్లో రవాణా, బోధన, రాజకీయ, సినీరంగాల వారు నిరుత్సాహకరమైన సమాచారం అందుకుంటారు. విద్యార్థులు శ్రద్ధాలోపం వల్ల నష్టపోతారు. ప్రయాణాలు, సమావేశాలకు ఏర్పాట్లు చేసుకుంటారు. 2,3 తేదీల్లో ఉన్నత విద్య, విదేశీ ప్రయాణాలకు సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. రాజకీయ, సినీరంగాల వారికి ప్రోత్సాహకరం.

నవ్య



## ఆ హీరో కూడా పుస్తకాల పురుగే!

టాలీవుడ్‌లో పుస్తకాలను ఎక్కువగా చదివే హీరో ఎవరు? అంటే టక్కున పవన్‌కల్యాణ్ పేరు గుర్తుకొస్తుంది. ఇప్పుడు మరో పేరు కూడా గుర్తుకు రాకమానదు. ఆ హీరో ప్రభాస్. మార్కెట్‌లో కొత్త విషయాలతో వచ్చిన ప్రతి పుస్తకాన్నీ కొని చదివేస్తాడట! ఆయన ఇంట్లో పుస్తకాల షాపులాంటి లైబ్రరీ ఉందట! 'బాహుబలి' కారణంగా కొత్త పుస్తకాలు కొని చదివే తీరిక ఉండడం లేదట! కొద్దిగా తీరిక దొరకగానే తాను మిస్ అయిన పుస్తకాలన్నీ కొనేసి చదివేస్తానని ప్రభాస్ అంటున్నాడు.



## లారెన్స్ పెద్ద మనసు

తనకు దక్కని అదృష్టం ఇతరులకు దక్కాలని తాపత్రయపడేవారిలో నటుడు, దర్శకుడు, డ్యాన్స్ డైరెక్టర్ లారెన్స్ పేరు ఎప్పుడూ ముందే ఉంటుంది. లారెన్స్ పెద్దగా చదువుకోలేదన్న సంగతి తెలిసిందే! కారణాలు ఏమైనా తనకు అందని చదువును పేద పిల్లలకు అందించాలని సంకల్పించాడు లారెన్స్. తమిళనాడులో పేద పిల్లల కోసం ఓ పాఠశాల నిర్మిస్తున్నాడు. ఇందులో ఎల్‌కేజీ నుంచి ఐదవ తరగతి వరకూ పేదపిల్లలకు ఉచిత విద్య అందిస్తారట! భవిష్యత్తులో ఈ పాఠశాల స్థాయి పెంచుకుంటూ పోవాలనే ఆలోచనలో లారెన్స్ ఉన్నట్టు సమాచారం! మాటలు చాలామంది చెబుతుంటారు కానీ, ఆచరణలో పెట్టేవారు తక్కువ! వారికి భిన్నంగా తన మాటలను చేతలలో చూపిస్తున్న లారెన్స్‌ను కోలీవుడ్ తంబీలు ఆకాశానికి ఎత్తేస్తున్నారు.



## 'బాహుబలి-2'కి వేసవి సెలవులు

సూర్య ధాటికి అదేనండి సూర్యుడి ప్రతాపానికి 'బాహుబలి-2' దెబ్బయిపోతోంది. కూలర్లు, ఏసిలు పెట్టినా సిబ్బంది అల్లాడిపోతుండడంతో దర్శక ధీరుడు రాజమౌళి యూనిట్‌కి ఒక నెల రోజులపాటు వేసవి సెలవులు ప్రకటించేశాడు. ఆ తరువాత వరుసగా డే అండ్ నైట్ షూటింగ్ చేయాలని నిర్ణయించారట! ఇంత వరకూ ఎవరికీ భయపడని రాజమౌళి భానుడికి భయపడ్డాడని సినీ జనాలు అంటున్నారు.




## హమ్మయ్య! తెలుగులో కొట్టాడు

కోలీవుడ్ హీరో విజయ్‌కి తెలుగునాట అంతగా మార్కెట్ లేదు. సూర్య, కార్తీ లాంటి హీరోలు తెలుగులో దూసుకుపోతుంటే విజయ్ మాత్రం ఈ రేసులో కాస్త వెనుకబడ్డాడనే చెప్పాలి. టాలీవుడ్‌లో హిట్ కొట్టాలని ఎప్పటి నుంచో ఎదురు చూస్తున్న విజయ్ కోరిక 'పోలీసోడు' (తమిళంలో 'తెరి')తో తీరిపోయింది. మొదటి రోజు కాస్త తేడా టాక్ వచ్చినా, వారాంతంలో మంచి కలెక్షన్లే రాబట్టడంతో టాలీవుడ్‌లో విజయ్ ఓ హిట్టు సాధించాడని సినీ జనాలు అంటున్నారు.



## ఆ డైరెక్టరే నాకు పోటీ

మ్యూజిక్ డైరెక్టర్లలో తమన్ స్టయిలే సెపరేట్ అంటారు సినీ జనాలు. మనసులో అనుకున్నది ఎలాంటి భేషజాలు లేకుండా బయట పెట్టేస్తుంటాడు. ఈ రంగంలో తను ఎవరినీ పోటీగా ఫీలవడట కానీ, దేవిశ్రీని మాత్రం పోటీగా ఫీలవుతాడట! ఐటెంసాంగ్స్‌ను



దేవిశ్రీ అద్భుతంగా చేస్తాడు. ఆయనలా ఎప్పటికైనా ఓ మంచి ఐటెంసాంగ్ చేయాలని అనుకుంటున్న తరుణంలో 'రేసుగుర్రం'లో చేసే ఛాన్స్ వచ్చింది. దేవిశ్రీకి ధీటుగా చేయాలన్న కోరికతోనే 'సినిమా చూపిస్త మావా' పాట చేశాను. నేను అనుకున్నట్లే ఆ పాటకు మంచి రెస్పాన్స్ వచ్చింది అని చెప్పుకొచ్చాడు తమన్.

# మరో మూడేళ్ళు

## -ప్రియాంక చోప్రా

**ఆమె అందంతో పాటు నటన కూడా విశ్వవ్యాప్తం అయింది. బాలీవుడ్ హీరోయిన్‌గా ప్రియాంక ప్రపంచంలో కొంత మందికి మాత్రమే తెలిసి ఉండవచ్చు. కానీ 'క్వాంటికో' సీరియల్ ద్వారా ప్రపంచవ్యాప్తంగా అందరికీ పరిచయమైంది. ఆ సీరియల్ ద్వారా ప్రియాంక ఇక హాలీవుడ్‌లో వెనుతిరిగి చూసుకోవలసిన అవసరం లేకపోయింది. 'పద్మశ్రీ' అవార్డు తనకు రావడానికి తండ్రిద్వారా సంక్రమించిన నిజాయితీ, నిబద్ధతతోపాటు తన కృషే కారణమంటున్న ప్రియాంకచోప్రాతో...**

---

**'పద్మశ్రీ' వరించడం వెనుక మీ కృషి ఒక్కటే కారణమంటారా?**

నూటికి నూరుపాళ్ళూ నా ఒక్కదాని కృషే ఉంది. కెమెరా ముందు నేను మాత్రమే నటించగలను. నా సినిమాల్లో పాటలకు నేనే డ్యాన్సులు చేస్తాను. అంతే తప్ప నా టీం ఎవరూ ఇందులో పాలు పంచుకోరు. అందుకే ఈ అవార్డు దక్కడం వెనుక నా ఒక్కదాని కృషే ఉందని గట్టిగా చెప్పగలను.

**ఈ అవార్డు అందుకోవడంపై హాలీవుడ్‌లో మీ కో స్టార్స్ స్పందన ఎలా ఉంది?**

వాళ్ళకి 'పద్మశ్రీ' గురించి అస్సలు ఏమీ తెలియదు. దీని గురించి వివరించి చెప్పిన తరువాత చాలా గొప్పగా ఫీలయ్యారు.

**మీ ఫాదర్‌ని బాగా మిస్ అయినట్టున్నారు?**

ఈ అవార్డు అందుకునే సమయంలో మా ఫాదర్ ఉంటే చాలా సంతోషించేవారు. ఆయన్ని నేను చాలా మిస్ అవుతున్నాను. నేను రాష్ట్రపతి నుంచి అవార్డు తీసుకుంటున్న సందర్భంలో మా పెదనాన్నగారు, మా మదర్, బ్రదర్ అందరూ ఉన్నారు నాన్న తప్ప. అదే బాధగా అనిపించింది.

**మీపై మీ ఫాదర్ ప్రభావం ఎక్కువ అంటారు నిజమేనా?**

నిజమే! ఆయన ఆర్మీలో పనిచేశారు. అక్కడి డిసిప్లిన్ ఇంట్లో కూడా అమలు చేసేవారు. చిన్నతనం నుంచి నాకూ అదే అలవాటయింది. నిజాయితీగా ఉండాలని, చేస్తున్న పనిలో నిబద్ధత ఉండాలని ఎప్పుడూ చెప్పేవారు. ఆయన మాటల ప్రభావం నా మీద చాలా ఉంది. ఈ రోజు ఈ అవార్డు అందుకోవడానికి ఆయన మాటలు చాలావరకూ కారణం అయ్యాయి. పారితోషికం, పేరు కన్నా కూడా ప్రభుత్వంనుంచి అందుకునే అవార్డులే గొప్ప అని ఎప్పుడూ ఆయన అనేవారు. ఆ మాటల ప్రభావం వల్లనేమో... నాలుగైదురోజుల వరకూ ఆ సంతోషం నుంచి బయట పడలేకపోయాను. ఇప్పటికీ తలుచుకుంటే మాటల్లో చెప్పలేని భావం కలుగుతుంది.

**సినిమాల్లో నటించడం తేలికా? టీవీలలో నటించడం తేలికా?**

టీవీలో నటించడం అంటే ఇక్కడ చాలా తక్కువ అభిప్రాయం ఉంది. కానీ హాలీవుడ్‌లో అలా కాదు. సినిమాలలో కన్నా టీవీలలో నటించడమే గొప్పగా ఫీలవుతారు. సినిమాల కన్నా కూడా టీవీలో నటించడమే చాలా కష్టం. అది నాకు బాగా అనుభవంలోకి వచ్చింది.

**దాదాపుగా ఏడాదిగా కుటుంబానికి దూరంగా ఉన్నట్టున్నారు?**

నిజమే. మొదట్లో ఫ్యామిలీని మిస్ అవుతున్నాను అన్న బాధ ఉండేది. అమెరికాలో ఇండియన్స్‌ని తరచూ కాకపోయినా, అవకాశం వచ్చినప్పుడల్లా కలుసుకుంటూ ఉండడం వలన ఇంటి బెంగ కొద్దిగా తీరింది. మధ్యలో ఒకటి రెండు సార్లు మా ఫ్యామిలీ మెంబర్లు నన్ను కలవడానికి అమెరికా వచ్చారు. దాంతో ఇంటికి దూరంగా ఉన్నానన్న బెంగ పూర్తిగా పోయింది.

**తిరిగి బాలీవుడ్‌లో షూటింగ్‌లో పాల్గొనబోతున్నారట?**

అవును. గతంలో ఒప్పుకున్న సినిమాలు పెండింగ్‌లో ఉన్నాయి. వాటి షూటింగ్ పూర్తి చేయాలని అనుకుంటున్నాను. ఓ ఆరునెలల పాటు హిందీ సినిమాలకే కేటాయించాను. ఆ తరువాత హాలీవుడ్ వెళ్ళి అక్కడ షూటింగ్‌లో పాల్గొంటాను.

# ఆగాల్సిందే!

మీ జీవితంలో మరిచిపోలేని పాత్ర...

'బాజీరావ్ మస్తానీ' సినిమాలో కాశీబాయి పాత్ర జీవితంలో మరిచిపోలేను. ఈ పాత్రకి ఎన్నో అవార్డులు రివార్డులు వచ్చాయి. ఆ పాత్రను అద్భుతంగా చేశానని అందరూ మెచ్చుకున్నారు. కానీ ఆ క్రెడిట్ అంతా సంజయ్ లీలా భన్సాలీకే దక్కుతుంది. తప్పకుండా ఆయన దర్శకత్వంలో మరో సినిమా చేస్తాను. కాకపోతే దానికి ఇంకా కొంత సమయం పడుతుంది.

ఇటీవలి కాలంలో బాగా బాధపడిన సందర్భం?

టీవీ నటి ప్రత్యూష ఆత్మహత్య విషయం తెలిసి చాలా బాగా బాధపడ్డాను. ఆమె ఎందుకు జీవితాన్ని అంతం చేసుకోవలసి వచ్చిందో తెలుసుకోకుండా ఆమె జీవితం గురించి ఎందుకు మాట్లాడతారో అర్థం కావడం లేదు. యాక్టర్స్ పబ్లిక్ ఫిగర్స్ అన్న మాటను నేను ఒప్పుకుంటాను. వాళ్ళూ మామూలు మనుషులే! అందరి లాగే వాళ్ళకి భావోద్వేగాలు ఉంటాయి. వాటి గురించి పట్టించుకోకుండా అవమాన కరంగా మాట్లాడుతుంటే భరించలేను. మనుషులు సినిమా, టీవీ యాక్టర్ల గురించే మాట్లాడుకోనక్కర్లేదు. లోకంలో ఎన్నో సమస్యలు ఉన్నాయి. వాటి గురించి మాట్లాడితే కొన్నింటికైనా పరిష్కారం లభించొచ్చు. దయచేసి వాటి గురించి మాట్లాడమని కోరు తున్నాను.

ప్రత్యూష ఆత్మహత్య సరైనదంటారా?

ముమ్మాటికీ కాదు. ప్రేమలో ఓడిపోయినా, ఆర్థిక బాధలు ఉన్నా, ఆత్మహత్య అనేది పరిష్కారం కాదు. బతికి గెలవాలి కానీ, చనిపోయి సాధించేది ఏదీ ఉండదు. కాకపోతే ఆమె ఆత్మహత్యకు ప్రేరేపించిన పరిస్థితుల గురించి నాకు తెలియదు. వాటి గురించి మాట్లాడడం సబబు కాదు కూడా! ఒక్క ప్రత్యూష ఆత్మహత్యనే కాదు. అమ్మాయిల ఆత్మహత్యలను వేటినీ నేను సమర్థించను. ఏ సమస్యకైనా పరిష్కారం ఉంటుంది. నిదానంగా ఆలోచిస్తే వాటిని పరిష్కరించు కోవడం పెద్ద కష్టమేమీ కాదు.

మీ మాజీ మేనేజర్ వ్యాఖ్యల గురించి...

పనిలేని వారి మాటల గురించి పట్టించుకునే అవసరం, తీరికా నాకు లేవు. చేయడానికి ఏ పనీ లేనప్పుడే అలాంటి మాటలు పుట్టుకొస్తుంటాయి. ఇతరులు సాధించిన విజయాలనుకూడా తమవిగా చెప్పుకునే మనిషి అతను. ఆ మనిషికి తగిన బుద్ధి ఎప్పుడో చెప్పాను. ఆ విషయం అందరికీ తెలుసు. ఇప్పుడు ఏదో నా గురించి కొత్తగా చెబుతానంటే ఎవరూ అతని మాటలు నమ్మరు.

మేనేజర్ మాటలు సరే...సినిమాల ఒత్తిడిని ఎలా అధిగమిస్తారు?

చిన్నతనం నుంచీ మెడిటేషన్ చేయడం అలవాటు. అదే నన్ను ఒత్తిడి నుంచి కాపాడుతోంది. షాట్‌కీ షాట్‌కీ మధ్యలో మెడిటేషన్ చేస్తుంటాను. దాంతో ఒత్తిడి, ఆందోళన నన్ను బాధించవు.

సినిమాల విషయానికి వస్తే, 'జంగిల్ బుక్'కి వాయిస్ ఓవర్‌ను ఎందుకు కాదన్నారు?

నిజానికి 'జంగిల్ బుక్' అంటే నాకు చాలా ఇష్టం. కార్టూన్ ఫిలిమ్స్‌ను బాగా ఎంజాయ్ చేసేదాన్ని. అలాంటిది దాన్ని సినిమాగా తీసి వాయిస్ ఓవర్ ఇమ్మని అడగగానే చాలా ఆనందమని పించింది. కానీ ఆ సమయంలో 'క్వాంటికో', 'బేవాచ్' షూటింగ్‌లతో బిజీగా ఉండడంతో వాళ్ళు అడిగిన డేట్లు అడ్జస్ట్ చేయలేక పోయాను. అందరికీ నేను చేయను అన్నానన్న విషయం మాత్రమే తెలుసు. దాని వెనుక నేను ఎంత బాధ పడ్డాను అన్నది నాకు మాత్రమే తెలుసు.

'పద్మశ్రీ' శ్రీమతిగా మారేదెప్పుడు?

ఇప్పుడప్పుడే ఆ ఆలోచన లేదు. దానికి ఇంకా టైముంది. ప్రస్తుతానికి నా వయస్సు 33 సంవత్సరాలు. మరో రెండు మూడేళ్ళు ఆగి పెళ్ళి చేసుకుందామని అనుకుంటు న్నాను. ఆలోగా అంగీకరించిన ప్రాజెక్టులన్నీ అయిపోతాయి.

-చిన్ని



## ఆ హీరో తన అదృష్టం అంటోంది

సాధారణంగా ఏ హీరోతో చేస్తే ఆ హీరోతో తమ కెమిస్ట్రీ వర్కవుట్ అయిందనీ, తమ జంట చూడడానికి ముచ్చటగా ఉందనీ ఇలాంటి ఎన్నో కబుర్లు చెబుతుంటారు హీరోయిన్లు. వీరి కన్నా ఓ అడుగు ముందుకేసి ఏకంగా ఒక హీరో తన అదృష్టం అంటోంది మిల్కీ బ్యూటీ తమన్నా! ఈ బ్యూటీ నటించిన 'ఊపిరి' సూపర్ డూపర్ సక్సెస్ కావడంతో ఆనందంతో తబ్బిబ్బయిపోతూ మనసులో అనుకోవలసిన మాటలను బయటకే చెప్పేస్తోంది. ఇప్పటి వరకూ కార్తీతో తను మూడు సినిమాలు చేస్తే అవి మూడూ సూపర్ డూపర్ హిట్టయ్యాయనీ, అందుకే కార్తీ తన అదృష్టం అని తెగ సంబరపడిపోతూ చెప్పుకొచ్చింది. అయితే ఇప్పటి వరకూ తమన్నా చేసిన హీరోలు ఆమెకు దురదృష్టాన్ని తీసుకువచ్చారా? అంటూ కొత్త లాజిక్ లేవనెత్తుతున్నారు టాలీవుడ్ జనాలు. కార్తీతో పాటు చాలా మంది హీరోలతో తమన్నా జత కట్టింది. వాటిల్లో చాలా మటుకు సూపర్ డూపర్ సక్సెస్ సాధించాయి. మరి వారెవ్వరికీ ఇవ్వని క్రెడిట్ తమన్నా కార్తీకి ఎందుకు ఇస్తోంది? అన్న అనుమానాలు పలువురు వ్యక్తం చేస్తున్నారు. మొత్తానికి నోరు జారి చిక్కుల్లో పడిందనే అంటున్నారు కొందరు.





నాకు నంది అవార్డులు లభించాయి. నా మొదటి చిత్రానికే నంది అవార్డు రావడం నాకు ఎంతో గర్వకారణం.

### కరుణామయుడు

నాకు గొప్ప పేరు ప్రతిష్ఠలు తెచ్చిన చిత్రం 'కరుణామయుడు'. 1974లో ఈ చిత్ర నిర్మాణం ప్రారంభమైంది. కానీ విడుదలకు నాలుగేళ్ళు పట్టింది. ఎన్నో కష్టాలు, ఇబ్బందులు ఎదుర్కొని చివరికి ఈ చిత్రం విడుదల చేశాను. అలాంటి ఇబ్బందులు మరెవరూ పడి ఉండరని నాకు అనిపిస్తుంది. ఈ చిత్ర నిర్మాణ సమయంలోనే కొందరు తప్పుకున్నారు. ఎలాగైనా సరే చిత్రాన్ని పూర్తి చేయాలనే దృఢ సంకల్పంతో

## ఇంటర్వ్యూ

కష్టపడి 1978 డిసెంబర్ 25న క్రిస్మస్ రోజు విడుదల చేశాను. ఎ. భీమ్‌సింగ్ దర్శకత్వంలో నాతోపాటు త్యాగరాజు, గిరిబాబు, శ్రీధర్, ముక్కామల, ధూళిపాళ, చంద్రమోహన్ నటించారు. మోదుకూరి జాన్సన్, క్రిస్టోఫర్ కోయిలో మాటలు రాశారు. నా కష్టం ఫలించి ఉత్తమచిత్రం విభాగంలో 'కరుణామయుడు' నంది అవార్డు గెలుచుకుంది.

### 16 భాషల్లోకి

పదహారు భాషల్లో, ముఖ్యంగా హిందీ, తమిళ్, ఇంగ్లీష్, మలయాళం, కన్నడ భాషల్లోకి కరుణామయుడు విడుదల చేశాం. ఇందులో నటులందరి గొప్పతనం వల్లే ప్రేక్షకులు ఎంతో బాగా ఈ చిత్రాన్ని ఆదరించారు. ముఖ్యంగా అమెరికా ప్రజలు ఎంతో బాగా రిసీవ్ చేసుకున్నారు.

# ఎన్టీఆర్‌గారి తర్వాత ఆ అదృష్టం నాకు దక్కింది

## -విజయచందర్

**దైవాంశసంభూత పాత్రలకు ప్రాణప్రతిష్ఠ చేస్తూ దేశ విదేశాల్లో ప్రేక్షకాదరణ పొందిన నటుడు విజయచందర్. నటించిన చిత్రాలు తక్కువే అయినా మూడు నంది అవార్డులు సొంతం చేసుకున్నారు. కొన్ని పాత్రల్లో నటించినప్పుడు ఆ నటులు ప్రేక్షకుల హృదయాల్లో నిలిచిపోతారనీ, ఎన్టీఆర్ గారి తర్వాత అంతటి అదృష్టం తనకు దక్కిందనీ అంటున్న టంగుటూరి ప్రకాశం పంతులు మనవడు విజయచందర్ ఇంటర్వ్యూ...**

మా నాన్నగారు తెలిదేవర వెంకటరావు. అమ్మ పుష్పవతి. నేను పుట్టింది మద్రాసులో అయినా హైస్కూలు, ఇంటర్మీడియట్ కాకినాడలో చదువుకున్నాను. మద్రాసులో డిగ్రీ పూర్తి చేశాను.

### నాటకరంగం

కళాశాలలో ఉన్నప్పుడే నాటకాలతో నాకు పరిచయం. లోభి, రూమ్‌నెంబర్-9, ఇన్‌స్పెక్టర్ జనరల్, మాస్టర్ జీ, వాంటెడ్ ఫాదర్ వంటి నాటకాల్లో నటించాను. ఏడిద నాగేశ్వరరావుగారు, రెంటాల గోపాలకృష్ణగారి పర్యవేక్షణలో మా ప్రదర్శనలు జరిగేవి. నా నటన చూసి వారు అభినందించేవారు. ఇన్‌స్పెక్టర్ జనరల్ నాటకంలో వెయిటర్, రూమ్‌నెంబర్-9లో కథానాయకుడి పాత్రలకు మంచి పేరు వచ్చింది. కాకినాడ రాఘవ కళాసమితి వారి నాటక సంస్థలో మరికొన్ని నాటకాలు కూడా ప్రదర్శించి ఎంతో అనుభవం సంపాదించాను.

### మొదటి చిత్రానికే నంది అవార్డు

నా గురుతుల్యులు రమణమూర్తి, కె.విశ్వనాథ్, మేకప్‌మెన్ వీర్రాజుగార్ల సహకారంతో సినీరంగంలో ప్రవేశించాను. ఆదుర్తి సుబ్బారావుగారి 'మరో ప్రపంచం' నేను నటించిన మొదటి చిత్రం. 1967లో విడుదలైన ఈ చిత్రంలో అక్కినేని నాగేశ్వరరావు, జమున గార్లు నటించారు. ఇందులో నేను ఏడుగురు బృందానికి నాయకుడిగా నటించాను. ప్రబోధాత్మకమైన ఈ చిత్రానికి నంది అవార్డు, నూతన నటుడిగా

### విదేశాల్లో ఆదరణ

లండన్, కెనడా దేశాల వారు 'కరుణామయుడు' చిత్రాన్ని బాగా రిసీవ్ చేసుకున్నారు. నేను ఆయా దేశాల్లో పర్యటించాను. అన్ని మతాల వారూ ఈ చిత్రాన్ని ఎంతగానో ఆదరించడం విశేషం. నా సినీ జీవితంలో ఇదో గొప్ప మైలురాయి. నా నటన అత్యద్భుతం అని అందరూ మెచ్చుకున్నారు. విదేశాల నుండి ఎన్నో బహుమతులు లభించడం విశేషం. అక్కడి తెలుగు ప్రజలు నన్ను సత్కరించి నాపై ఎంతో అభిమానం చూపించడం ఎన్నటికీ మరువలేను.

### శ్రీ షిర్డీ సాయిబాబా మహాత్మ్యం

కె.వాసుగారి దర్శకత్వంలో గోగినేని ప్రసాద్ గారు నిర్మించిన 'శ్రీ షిర్డీ సాయిబాబా మహాత్మ్యం' చిత్రం సెన్సేషన్ సృష్టించింది. ప్రతి కుటుంబం ఈ చిత్రాన్ని ఆదరించింది. ఇప్పటికీ ఎక్కడ ప్రదర్శించినా మళ్ళీ


కరుణామయుడి పాత్రలో...

మళ్ళీ చూస్తూ నాకు అభినందనలు తెలియజేస్తుంటారు.

## ప్రేక్షకుల బ్రహ్మరథం

షిర్డీ సాయిబాబా పాత్ర నాకు సూటవుతుందా లేదా? అని ఎంతో ఆలోచించాను. ప్రధాన పాత్రల్లో నటించే టప్పుడు చాలా జాగ్రత్తలు తీసుకోవాలి. అలాంటి సమయంలో సీనియర్ ప్రొడక్షన్ మేనేజర్ భావనారాయణగారు, దర్శకుడు కె.వాసుగారు నాకు దన్నుగా నిలిచి నన్ను ఒప్పించారు. ఈ చిత్రం ఇంతగొప్ప విజయం సాధిస్తుందని, సాయిబాబా పాత్రలో అంతబాగా రాణిస్తానని నేను అస్సలు ఊహించలేదు. ప్రేక్షకులు ఈ చిత్రానికి బ్రహ్మరథం పట్టారు. నా సినీ జీవిత చరిత్రలో సువర్ణాధ్యాయం లిఖించిన చిత్రమిది. 'షిర్డీ సాయిబాబాకీ కహానీ'గా 'షిర్డీ సాయిబాబా'గా హిందీ, తమిళ భాషల్లోకి కూడా డబ్బింగ్ చేశారు.

## విభిన్న పాత్రలు

కరుణామయుడు, షిర్డీసాయిబాబా చిత్రాల్లో నా పాత్రలు రెండూ విభిన్నమైనవి. నటించేటప్పుడు కొంత ఇబ్బందిపడినా కెరీర్‌లో ఎంతో సంతృప్తి నిచ్చిన పాత్రలవి. కరుణామయుడులో కరుణ, ప్రేమ, దయ చూపించాలి. షిర్డీ సాయిగా పూర్తిగా భిన్నంగా నటించాలి. ఒకొక్కసారి కోపం, చిరాకు వస్తుంది. వీటన్నింటినీ మరిచిపోయి మళ్ళీ ప్రేమతో దగ్గరకు తీసుకోవాలి. రెండు వేరియేషన్స్ గల చిత్రాలు. కానీ బేసిక్‌గా రెండూ ప్రేమతత్వం చాటేవే. కనుక ఈ రెండు పాత్రలూ నా జీవితంలో రెండు కళ్ళు లాంటివి.

## బ్రాండ్ పడుతుంది

దేవుడి పాత్రల్లో నటించడం వేరు. ప్రేక్షకుల హృదయాల్లో నిలిచిపోవడం వేరు. చిత్తూరి నాగయ్యగారు రామదాసుగా, త్యాగయ్యగా, భక్త పోతనగా ఎన్నో భక్తి పాత్రల్లో నటించి ప్రేక్షకుల హృదయాల్లో నిలిచిపోయారు. అదేవిధంగా ఎన్.టి.రామారావుగారు చేసిన దేవుడి పాత్రలు ప్రజల హృదయాల్లో నిలిచిపోయాయి. కృష్ణగారి అల్లూరి సీతారామరాజు, నాగేశ్వరరావుగారి దేవదాసు, నాగార్జున నటించిన రామదాసు, అన్నమయ్య చిత్రాలు గమనిస్తే ప్రతి పాత్రలోనూ నటనకి ఒక బ్రాండ్ పడిపోతుంది. క్రీస్తుగా, షిర్డీ సాయిబాబాగా నేను చేసిన పాత్రలు కూడా అంతే. ఆ పాత్రలు చేస్తే విజయచందరే చేయాలని ప్రేక్షకుల్లో ముద్ర పడిపోయింది. ముఖ్యంగా దేవుడి పాత్రల విషయంలో రామారావుగారి తర్వాత ఆ అదృష్టం మళ్ళీ నాకే దక్కింది. నా జీవితంలో ఇంతకంటే మరిచిపోలేని సంఘటన ఏముంటుంది? నేను ఇప్పటివరకు 40 చిత్రాల్లో నటించాను.


నవ్యవీక్లీ చదువుతూ...

## సాయిబాబా వేషంలో ఆయన్ని దర్శించా!

అంజలీదేవిగారు తీసిన సీరియల్ సత్యసాయి, షిర్డీసాయి. పుట్టపర్తి సాయిబాబాగా నటించమని ఆమె నన్ను అడిగారు. ఆ వేషం మీరే వేయాలి అని ఆమె అడిగినప్పుడు నేను వెంటనే అంగీకరించాను. షూటింగ్ ప్రారంభించేముందు సాయిబాబాగారిని ఒకసారి దర్శిద్దాం అని అంజలిగారు అన్నారు. అప్పటికే నేను ఆయన వేషంలోనే ఉన్నాను. ఇదే వేషంలో వెళ్ళి ఆయన్ను దర్శించుకుంటే బాగుంటుందని ఆమె అనడంతో మేం వెళ్ళాం. అప్పుడు అంజలీదేవిగారు, 'రా బాబా...బాబాగారు వచ్చేశారు, ఆయన్ను దర్శించుకుందాం' అన్నారు నన్ను. ఒకపక్క పుట్టపర్తిబాబాగారు, మరోవైపు ఆయన వేషంలో నేను! బాబా సమక్షంలో అంజలిగారు నన్ను కూడా బాబా అని సంబోధించడం నాకు ఆశ్చర్యం కలిగించింది. అదే క్షణంలో ఆయన నాకు ఎదురు రావడం, ఆయన గెటప్‌లో బాబా నన్ను చూసి ఆశీర్వదించడం వెంటనే జరిగిపోయాయి. ఇది నిజంగా ఒక అద్భుతం. ఆ విధంగా ఆమె నిర్మించిన ఆ సీరియల్ ప్రేక్షకుల్ని ఎంతో అలరించింది.

అదేవిధంగా 50 ఎపిసోడ్స్‌లో తీసిన 'దయాసాగర్' సీరియల్ నేషనల్ దూరదర్శన్‌లో ప్రసారమైంది. తర్వాత అన్ని భాషల్లోకీ దీన్ని డబ్ చేశారు.

## ఆంధ్రకేసరి మనవణ్ణి

1982లో 'ఆంధ్రకేసరి' డాక్యుమెంటరీ చిత్రం తీశాను. దీనికి కూడా నాకు నంది అవార్డు లభించింది. ఇందులో కూడా నా పాత్ర ఎంతో గొప్పగా రాణించింది. ఇక్కడ ఒక ముఖ్య విషయం చెప్పాలి. తొలి ముఖ్యమంత్రి, ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులుగారు మా పెద్ద తాతయ్య. అంటే మా అమ్మగారికి స్వయానా పెదనాన్నగారు. ప్రముఖ నటి టంగుటూరి సూర్యకుమారిగారు మా పిన్ని. అంటే మా అమ్మ సొంత చెల్లెలు. నేను కాకినాడలో చదివే రోజుల్లో ఒకరోజు రాత్రి మా పెద తాతయ్య గారు చెప్పిన మాటలు ఇప్పటికీ నాకు గుర్తే. కాకినాడ పరిసర ప్రాంతాల్లో ఒకసారి ఆయన కాంగ్రెస్ పార్టీ సమావేశాల్లో పాల్గొని అర్ధరాత్రి ఇంటికి చేరుకున్నారు. అప్పుడు ఇంట్లోవాళ్ళు, 'ఇంత రాత్రివరకూ తిరిగితే ఎలా? ఎప్పుడూ రాజకీయాలేనా? ఆరోగ్యం చూసుకోకపోతే ఎలా?' అని గట్టిగా అడిగి నప్పుడు, 'నా జీవితం ఏనాడో ప్రజలకు, పార్టీకి అంకితమైంది, ప్రజాసేవయే నా ప్రధమ కర్తవ్యం' అని సమాధానమిచ్చారు మా పెద్దతాతయ్యగారు. ఆ మాటలు ఇప్పటికీ నా చెవుల్లో మారుమోగుతున్నాయి. ఆయన ఆ మాటలు ఇంట్లో వాళ్ళతో చెప్పడం నేను స్పష్టంగా విన్నాను. పెద్దవాణ్ణయ్యాక ఒకరకంగా ఆయన మాటలే నాకు స్ఫూర్తి.

## అక్కినేనికి అభిమానిని

అక్కినేనిగారు నా అభిమాన నటుడు. నేను ఆయన ఏకలవ్య శిష్యుణ్ణి అని అందరూ అంటూ ఉంటారు. ఇప్పటి హీరోల్లో పవన్‌కల్యాణ్, ప్రభాస్, జూనియర్ ఎన్టీఆర్, మహేష్‌బాబు నాకు ఇష్టమైన వారు. హీరోయిన్లలో ఆనాడు సావిత్రి, ఈనాడు సమంత. నటనకు వీరు భాష్యం చెప్పారు. కళాకారులకు ముఖ్యంగా ఈ మధ్య సినీ నటులకు కొందరు గుళ్ళు కట్టి పూజిస్తున్నారట. నటుణ్ణి నటుడుగానే చూడాలి. ఎవరిలో ఏ టాలెంట్ ఉంటే ఆ టాలెంట్‌నే మనం గౌరవించాలి.

ఇప్పటి నటులు బాగా నటిస్తున్నారు. ఇప్పటి సినిమాలు బాగాలేవని అనను. కాలాన్ని బట్టి సినిమాలు తీస్తున్నారు. సమాజ మార్పును బట్టే ప్రజల మనోభావాలు మారతాయి.

## యువత రాజకీయాల్లోకి రావాలి

ఎన్నో రంగాల్లోకి ఈనాడు యువతరం అడుగు పెట్టింది. సినిమారంగంలోకి యువతే వస్తున్నారు. రాజకీయాల్లో మాత్రం 45 యేళ్ళు పైబడినవారే ప్రభుత్వాలను శాసిస్తున్నారు. రాజకీయాల్లోకి యంగ్‌స్టర్స్ రావాలి. ముఖ్యంగా వారికి అవకాశాలు కలిగించడం లేదు. దీన్ని నేను కచ్చితంగా ఖండిస్తున్నాను. జెట్ వేగం ఉన్న రోజుల్లో రాజకీయ రంగం మాత్రం నత్త నడక నడుస్తోంది. ఈ రంగంలో ప్రక్షాళన జరగాలి. యువత రాజకీయ నాయకత్వం తీసుకుంటే అన్ని రంగాల్లోనూ మార్పులు సంభవిస్తాయి. టెక్నికల్‌గా దేశం ఇంకా ముందుకుపోవడానికి అవకాశం ఉంటుంది. ఇప్పుడు అన్ని దేశాల్లోనూ యువకులే దేశాధ్యక్షులుగా వస్తున్నారు.

**-కె.హరనాథ్**

**9703542598**

# ఇవన్నీ నిజాలే!

✡ విలియం వర్డ్స్‌వర్త్ 1843లో ఆస్థాన కవిగా నియమితుడయ్యాడు. బకింగ్‌హామ్ ప్యాలస్‌లో ఆ సందర్భంగా జరిగిన ఉత్సవానికి వర్డ్స్‌వర్త్ తన కవి మిత్రుడు శ్యామ్యూల్ రోజర్స్ సూటు ధరించి వెళ్ళారు. తర్వాత ఏడేళ్ళకు ఆస్థానకవిగా నియమితుడైన టెన్నిసన్ కూడా రోజర్స్‌నే సూటు అడిగి ధరించి వెళ్లాడు. రోజర్స్ కవిత్వం కంటే ఆ సూటు విషయమే ఎక్కువమందికి గుర్తుండిపోయింది.

•••

✡ ఎనిమిదవ హెన్రీ రాజుకు పేకాట అంటే ఇష్టం. ఎక్కువ అప్పుల పాలయ్యేవాడు. ఒకసారి సెంట్‌పాల్స్ చర్చిగంటను పేకాటలో పణంగా పెట్టి పోగొట్టుకున్నాడు.

•••

✡ అమెరికా ఫ్లోరిడా రాష్ట్రానికి చెందిన ఎలైన్ ఎస్పొటో 1941లో కోమాలోకి వెళ్ళింది. 37 ఏళ్ళు కోమాలోనే ఉండి 1978లో మరణించింది.

•••

✡ మానవ శరీర సాధారణ ఉష్ణోగ్రత 98.4 ఫారన్ హీట్ డిగ్రీలు. కానీ ఒక రోగి శరీరం 112 ఫారన్ హీట్ డిగ్రీల వరకు తట్టుకునే అవకాశం ఉంది.

•••

✡ 1906లో డ్రెట్రాయిచ్ అనే పట్టణంలో రెండు కార్లు ఒకదాన్నొకటి ఢీకొన్నాయి. ఆశ్చర్యం ఏమిటంటే ఆనాటికి ఆ పట్టణంలో ఉన్నది ఈ రెండు కార్లే.

**శాలరీ పదం పుట్టుక**

✡ రోమన్‌ల కాలంలో ఉప్పు చాలా విలువైనది. జూలియస్ సీజర్ తన సైనికులకు జీతం బదులు ఉప్పు ఇచ్చేవాడు. గ్రీకు భాషలో శాల్ అంటే ఉప్పు అని అర్థం. దాన్నుండే శాలరీ పదం పుట్టింది.

•••

✡ 'న్యూట్రిషన్ ఫర్ హెల్త్' అనే గ్రంథ రచయిత ఆరోగ్యంపై ఎన్నో గ్రంథాలు రాశాడు. కానీ ఆయన పోషకాహార లోపం కారణంగానే మరణించాడు!

•••

✡ గూటెన్‌బర్గ్‌కు చెందిన ఒక నావికుడు తన యాభయ్యవయేట మరణిస్తానని కలగనేవాడు. చివరకు యాభయ్యవ పుట్టినరోజు జరుపుకుని హమ్మయ్య చావు తప్పించుకున్నానని ఆనందించాడు. కానీ దురదృష్టవశాత్తు ఆ రాత్రే ఎక్కువగా తాగడం వల్ల అతడు మరణించాడు.

•••

✡ జాన్‌వాన్ విలియట్ అనే వ్యక్తి సెలవుల్లో ఆస్ట్రియా పర్యటనకు వెళ్ళాడు. అక్కడ ఒకచోట అతడి కారు చెడిపోయింది. ఒక స్త్రీ తారసపడి లిఫ్ట్ ఇస్తాను రమ్మని పిలిచింది. విచిత్రం ఏమిటంటే, 23 సంవత్సరాల క్రితం ఇంటినుంచి పారిపోయిన అతడి కుమార్తే అలా కనిపించడం!

•••

✡ షాంఘైకి చెందిన కోటీశ్వరుడు ఊ-లాయ్ లింగ్. అతడికి ఒక కల వచ్చింది. సన్నగా ఇరుకుగా ఉన్న స్వర్గ ద్వారంలోంచి తన డబ్బంతా కష్టపడి మోసుకువెళుతూ ఇక మోయలేక జారిపడ్డాడు. అదీకల. తెల్లారి నిద్రలేచిన లింగ్ మార్కెట్‌కెళ్ళి బరువులు మోసే పోర్టర్ పనిలో జేరాడు.

-సౌభాగ్య

## సుధామ పదగారడి-259

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ✱ | 2 | | 3 | ✱ | 4 | ✱ | 5 |
| | ✱ | | ✱ | | ✱ | 6 | ✱ | |
| | ✱ | 7 | | | | 8 ✱ | ✱ | |
| 8 | 9 | ✱ | ✱ | ✱ | ✱ | ✱ | 10 | |
| ✱ | 11 | | 12 | ✱ | 13 | | | ✱ |
| 14 | | 15 ✱ | | ✱ | | ✱ | 15 | 16 |
| | ✱ | ✱ | 17 | 18 | | 19 | ✱ | |
| 20 ✱ | | 21 | ✱ | | ✱ | | ✱ | |
| | ✱ | | ✱ | 22 | | | ✱ | |

### ఆధారాలు

**అడ్డం**

2. శరీరము (3)
6. దీనికి ఆలస్యం మొగుడు అని సామెత (3)
7. చెలువు (4)
8. పసిపిల్ల (2)
10. అరటిపండుపైన వొలిచేది (2)
11. నష్టమునకు వ్యతిరేకం (3)
13. ఎండిన కొబ్బరి (3)
14. మార్గ కవిత కాదు మరోటి (2)
15. యంత్రము (2)
17. హిరోషిమా తోడుగా నాశనమైన నగరం (4)
20. దేవునికి చెక్కలతో చేసేది (3)
22. సోషల్ నెట్‌వర్క్‌లోకి వెళ్ళడానికి ముందు ఇదవ్వాలి (ఆంగ్లపదమే) (3)

**నిలువు**

1. సరిగ సరిగా లేదు! (4)
2. ఆడ దేవుడు (3)
3. స్నానము నదిలో (3)
4. తిరగబడిన ఇది ముదిరి ఊసరవెల్లి అయినట్లు! (2)
5. సమ్మక్క సోదరి (4)
9. జువ్వి (3)
10. వృంతం, ఆకూ, పువ్వుల కాడ (3)
12. అడుగునుండి నర్తనమే! (3)
13. క్షేమమా! (3)
14. దైవం పట్లా, పెద్దల పట్లే కాదు, దేశం పట్లా వుండాల్సింది (4)
16. మన్మథుడు భర్త హోదాలో (4)
18. 'నాలో వున్న ప్రేమ' చిత్రంలో రాజీగా నటించిన హీరోయిన్ (3)
19. రైతు, జవాన్ కాదు (3)
21. ఆభరణం (2)

### పదగారడి-258 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ■ | ■ | 1 మ | 2 హా | వి | 3 దు | డు | ■ | ■ |
| ■ | 4 నై | ■ | రం | ■ | ధి | ■ | 5 త్వ | ■ |
| 6 ధై | న్య | ము | ■ | 7 ప | రం | ప | ర | 8 గా |
| ■ | ము | ■ | 9 స్ఫూ | ■ | ■ | ■ | ■ | లి |
| 10 దు | ■ | 11 కా | ర్తి | కే | 12 యు | డు | ■ | బ్ |
| హి | ■ | ■ | ■ | ■ | క్తి | ■ | 13 ప | ■ |
| 14 త | 15 మ | ల | 16 పా | కు | ■ | 17 స్వ | లా | భం |
| ■ | జ్ఞ | ■ | త | ■ | 18 రో | ■ | లు | ■ |
| ■ | ■ | 19 అ | ర | విం | ద | ము | ■ | ■ |

Printed and Published by **VEMURI RADHAKRISHNA,** Managing Director, on behalf of Aamoda Publications Pvt. Ltd., Plot No.76, Aswani Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad-500 033. Ph.(040) 23558233/44, Fax No.23558288. Printed at Aamoda Press, R.S.No.191/3, Ward No.43, Donka Road, Patamata, Vijayawada 520 010, Reg.No.: APTEL/2004/12594. Editor: **A.N.JAGANNADHA SARMA**

